సాహిత్య

# ప్రస్థానం

మే 2018

వెల రూ. 20





## కందుకూరి వీరేశలింగం

### శతవర్ధంతి ప్రత్యేక సంచిక

సాహితీస్రవంతి

27.05.1919 - 27.05.2018



కందుకూరి తొలి రోజుల నాటి ఇల్లు



భార్య రాజ్యలక్ష్మి మరణానంతరం ఆమె పేరన నిర్మించి
చివరి రోజుల్లో నివసించిన ఇల్లు




రాజమహేంద్రవరంలో నిర్మించిన పురమందిరం
ఇందులో ఉన్న గ్రంథాలయాన్ని బిపిన్‌చంద్రపాల్,
రవీంద్రనాథ్ టాగూర్ తదితర పెద్దలు సందర్శించారు



కందుకూరి స్థాపించిన హితకారిణీ సమాజం



వితంతు పునర్వివాహాల కళ్యాణ వేదిక



కందుకూరి వీరేశలింగం థియెస్ట్ కళాశాల



రాజమహేంద్రవరంలో కందుకూరి దంపతుల సమాధి



సమాధి లోపల






తన పత్రికల ముద్రణకు ఉపయోగించిన యంత్రాలు



కందుకూరి వీరేశలింగం పంతులు, రాజ్యలక్ష్మి దంపతులు

PRSVMORA19R

సాహిత్య
ప్రస్థానం
మే 2018

సంపుటి : 17 సంపాదకీయం సంచిక : 5

# కందుకూరి వీరేశలింగం శతవర్ధంతి

ఒక వ్యక్తి అస్తమించిన వందేళ్ల తర్వాత ఆయన ఆదర్శాలూ, ఆచరణా అత్యంత సమకాలీన అవసరాలుగా కనిపిస్తున్నాయంటే ఆయన ఎంత దార్శనికుడో సాహసికుడో దానికదే అర్థమైపోతుంది. ఆయనే అగ్ని తరంగం కందుకూరి వీరేశలింగం. అందుకే వైతాళికుడు అనిపించుకున్నాడు. ఆయన విస్తారమైన విశేషమైన విలక్షణ కృషి ఒక సంస్కర్త పరిధికి మించింది. ప్రధాన మంత్రులూ ముఖ్యమంత్రులే యాగాల పేరిట యాగీ చేస్తున్నపుడు– అమ్మాయిలపై అత్యాచారాలు అమానుషాలే గాక అసమానతలు కూడా ప్రబోధించే ప్రభువులూ పరివారాలూ ఢిల్లీ గద్దెక్కినప్పుడు– వాస్తు కోసం రాజధానులూ సచివాలయాల మార్పుచేర్పులు చేసే నేతలు తెలుగునేల నేలుతున్నప్పుడు-- అలాటి నేపథ్యంలో వస్తున్నది వీరేశలింగం శతవర్ధంతి. సాహితీ స్రవంతి ఈ సమున్నత సంచలన వారసత్వాన్ని సగర్వంగా చాటిచెప్పేందుకే ఈ ప్రత్యేక సంచిక వెలువరిస్తున్నది. తెలుగునాట సంఘసంస్కరణ ఉద్యమాలతో ఆధునిక భావవిప్లవానికి తొలికృషి బలంగా చేసినవాడు వీరేశలింగం. వందేళ్ళ క్రితం కన్నుమూసినా సమాజంలోని మూఢాచారాలపై వీరేశలింగం చేసిన పోరాటం సదా ఆయనను జ్ఞప్తికి తెస్తూనే ఉన్నది. ఆధునిక కాలం అని చెప్పుకుంటున్న ఈ నవ్య నాగరిక సమాజంలో ఇటీవల జరుగుతున్న ఘటనలు చూస్తే ఇంకో వెయ్యి మంది వీరేశలింగాలు వచ్చి పోరాడాలేమో అనిపిస్తుంది. ఆనాటి సమాజంలో మహిళల జీవితాలతో ఆడుకుంటున్న అజ్ఞానపు ఆచారాలైన బాల్య వివాహాలు, మంత్రాలు, మూఢనమ్మకాలు వంటి వాటికి వ్యతిరేకంగా వీరేశలింగం పోరాడాడు. వితంతు వివాహాలు జరిపించడం కోసం అత్యంత సాహోసపేతంగా ఉద్యమాన్ని నిర్వహించాడు. చాంధసులను లెక్కచేయకుండా ఆనాటి విద్యార్థులు, సంఘ శ్రేయోభిలాషులు, వీరేశలింగం ఉద్యమానికి వెన్నుదన్నుగా నిలిచారు. సంప్రదాయాలకు వ్యతిరేకంగా ఉద్యమిస్తున్నందుకు సాంఘిక బహిష్కారం వంటివి ఎదురైనా వాటిని సమర్థవంతంగా ఎదుర్కొన్నారు. ఆ ఉద్యమస్ఫూర్తిని ఆ తరువాత కాలం కొనసాగించలేకపోయింది. వర్తమాన సమాజంలో మహిళల పరిస్థితి మరింత దయనీయంగా మారింది. దళితులపై, పేదలపై సరికొత్త రూపంలో దాడులు పెరిగాయి. సమాజాన్ని కులవ్యవస్థ, ఛాందస భావాలు ఇంకా పట్టి పీడిస్తూనే ఉన్నాయి. ఇటువంటి పరిస్థితులలో కందుకూరి వీరేశలింగం శతవర్ధంతి అవకాశాన్ని అందిపుచ్చుకుని పురోగామి శక్తులు, సామాజిక కార్యకర్తలు, రచయితలు ఐక్యంగా సమాజాన్ని వెనకకు నడిపించే భావజాలాన్ని తిప్పికొట్టాలి. కందుకూరి వీరేశలింగం శతవర్ధంతి జరిగే ఈ సంవత్సర కాలమంతా శతవర్ధంతి పేరిట వివిధ సామాజిక చైతన్య కార్యక్రమాలు నిర్వహించడానికి అందరూ కృషిచేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. అదే కందుకూరి వీరేశలింగం గారికి తెలుగు నేల ఇచ్చే నిజమైన నివాళి. ◆



రచనలు, చందాలు, విరాళాలు, మనీ ఆర్డర్లు, చెక్కులు, డిడిలు పంపవలసిన చిరునామా:
సాహిత్య ప్రస్థానం, 27-30-4, ఎం.బి. విజ్ఞానకేంద్రం, 3వ అంతస్తు, ఆకులవారి వీధి,
గవర్నరుపేట, విజయవాడ - 520002, ఫోన్: 0866-2577248, సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com, www.prasthanam.com



తన దేహము, తన గేహము,
తన కాలము, తన ధనమ్ము
తన విద్య జగజ్జనులకు వినియోగించిన
ఘనుడీ వీరేశలింగకవి జనులారా!

- చిలకమర్తి లక్ష్మీనరసింహం

## విషయ సూచిక

# అగ్ని తరంగం



- తెలకపల్లి రవి

వీరేశలింగం జీవితానుభవాలు నేటి పరిస్థితులలో మరింత ప్రాధాన్యత సంతరించుకుంటున్న వాస్తవం ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. ఆ యుగకర్త జ్ఞాపకాలు మరోసారి కర్తవ్యోద్దీపకాలైతే, జడలు విచ్చి ఆడుతున్న మతోన్మాదాన్ని ఆధునికత చాటున పెరుగుతున్న అంధ విశ్వాసాలను దృఢంగా ఎదుర్కోగలుగుతాము.

"కార్యశూరుడు వీరేశలింగం, కదం తొక్కి పోరాడిన సింగం, దురాచారాల దురాగతాలను తుదముట్టించిన అగ్ని తరంగం" అని మహాకవి శ్రీశ్రీ ఆయనను అభివర్ణించారు. "కొట్టుకొని పోయె కొన్ని కోటిలింగాలు, వీరేశలింగమొకడు మిగిలెను చాలు" అని ఆరుద్ర ఆయనకు నివాళులర్పించారు. "ఆధునిక కాలంలో అగ్రగణ్యుడైన ఆంధ్రుడు" అని కట్టమంచి రామలింగారెడ్డి అంటే "ప్రముఖ భారతీయులలో ఒకడు. లోతైన వివేచన, అంతులేని సాహసము, అమితమైన శక్తికలవాడు. అసత్యాన్ని చెండాడి ప్రగతి మార్గం కోసం పోరాడాడు" అని రాజాజీ ప్రస్తుతించారు. "ఆదర్శ దృక్పథం గల కార్యవాది" అని నార్ల వెంకటేశ్వరరావు అన్నారు. ఆంధ్రలో జీవిత ప్రవాహాన్ని వీరేశలింగం కొత్తదారి పట్టించారు. ఈ కృషిలో ఆయనకు మార్గదర్శకులు లేరు. ఆయనతో పోల్చదగినవారు లేరు" అని కుందూరి ఈశ్వర దత్తు కీర్తించారు.

ఇలాంటి వర్ణనలెన్నయినా నవ్యాంధ్ర వైతాళికుడు. వీరేశలింగం విరాట్ స్వరూపాన్ని సంపూర్ణంగా చిత్రించలేవు.

రాజారామమోహన్‌రాయ్, ఈశ్వర చంద్ర విద్యాసాగర్ వంటి మహా సంస్కర్తల కోవలోని వారు వీరేశలింగం. ఆయన సంస్కరణాభిలాష కేవలం ప్రబోధమాత్రమైంది కాదు. ఆచరణ శీలమైంది. సామాజిక సంస్కరణతోపాటుగా శతాధిక గ్రంథాలు రాసి సాహిత్య రంగంలోనూ వరవడి పెట్టిన ప్రతిభా పాటవాలు ఆయన స్వంతం. అందుకే ఆయన ఆధునికాంధ్ర సంస్కార వికాసానికి అక్షరాలా ఆద్యుడు. మార్గదర్శకుడు. అనుభవాలగని.

భారతదేశంలో సాంస్కృతిక పునర్వికాసం పందొమ్మిదో శతాబ్ది ద్వితీయార్థంలో రూపందుకొన్నది. జాతీయ పునరుజ్జీవం, సామాజిక పునర్నిర్మాణం వంటి భావనలు ఆలోచింపచేశాయి. జీవితానుభవాలు, అవసరాలకు తోడు ఇంగ్లీష్ వారి సాంఘిక, సాంస్కృతిక ప్రభావం కూడా ఇందుకు ప్రేరేపించింది. తరతరాలుగా పాతుకుపోయిన సాంఘిక దురాచారాలు మేధావులను, ఆలోచనా పరులను కలవరపరచాయి.

ఈ నేపథ్యంలోనే వీరేశలింగం ఉద్యమించారు. ఆయన జన్మించడానికి పాతికేళ్ళముందు వరకు చెదురు మదురుగానైనా సతీసహగమనం వంటి దురాచారం ఇక్కడా ఉండేది. అక్షరాస్యత చాలా తక్కువ. పాత సామాజిక వ్యవస్థ శిథిలమవుతున్నా కూడా కొత్తది రూపం దాల్చలేదు. సంఘజీవనంలో అజ్ఞానం, అనారోగ్యం, అంధవిశ్వాసాలు రాజ్యమేలుతున్నాయి. తరచు కరువు కాటకాలు, తుఫానులు, గాలి వానలు వంటివి ప్రజల జీవితాన్ని కడగండ్ల పాలుచేస్తున్నాయి. వానకురిస్తేనే పంట. ప్రయాణ సాధనాలు లేవు. సంస్థానాధీశులు, జమీందారుల భోగవిలాసాలు, బ్రిటిష్ పాలకులు సాయంతో పెత్తనం, విత్తం సంపాదించుకున్న కొత్త కులీనవర్గం. లంచగొండితనం, విద్యా విధానం ప్రయాణ సాధనాలు నామమాత్రం ఇలాంటి స్థితిలో

ప్రజల అజ్ఞానం, భయభీతులు, దైన్యం వగైరాలను ఆసరా చేసుకుని క్షుద్రశక్తులు, మూఢనమ్మకాలు వెర్రితలలు వేస్తున్న దశ. వీటికి అందరికంటే ఎక్కువగా బలైనవారు స్త్రీలు. అందులోనూ బాలవితంతువుల! 1901లో దేశంలో పాతికేళ్లలోపు బాల వితంతువులు 12 లక్షలమంది వున్నట్లు జనాభా లెక్కలు చెప్పాయి. ఆడపిల్లలు చదువుకోకూడదు. వారికి లోకజ్ఞానం ఉండకూడదు. బాల్యవివాహాలు, పురుషులకు నాలుగైదు పెళ్ళిల్లు, బాల వితంతవులు మాత్రం గొడ్డు చాకిరీలోనే జీవితం చాలించాలి.

ఇలాంటి పరిస్థితులలో పుట్టి వాటిని మార్చడానికి నడుంకట్టి, దేశానికే ఆదర్శం చూపిన ధీశాలి కందుకూరి. తన జీవితానుభవాలను, అభిప్రాయాలను స్వీయచరిత్ర'గా గ్రంథస్తం చేయడం తెలుగువారి మహద్భాగ్యం. ఆ మహావ్యక్తి ఆలోచనలతో, దృష్టి కోణంతో ఆయన జీవితాన్ని, నాటి కాలాన్ని సందర్శించగలగడం ఒక అపూర్వ అనుభవం. నిజానికి వీరేశలింగం స్వీయచరిత్ర 19-20 శతాబ్దాల మధ్య కాలపు మూడు తరాల తెలుగువారి సాంఘిక చరిత్ర. ఆయన గురించి అమూల్యమైన పరిశోధన చేసిన అక్కిరాజు రమాపతిరావు గారన్నట్లు అది రాజారామ్‌మోహన్‌రాయ్‌కి మహాత్మాగాంధీకి మధ్యకాలపు తెలుగుదేశపు సాంఘిక, సాహిత్య విద్యా వైజ్ఞానిక రంగాల చరిత్ర. ఆనాటి సంధియుగంలోని సమాజం, న్యాయస్థానాలు, పాఠశాలలు, కులాచారాలు, ప్రభుత్వ యంత్రాంగం, ఉద్యోగస్తుల నడవడులు, స్థానిక సంస్థల నిర్వహణ, యువతరానికి పెద్దలకు సంభవించిన భారీ సంఘర్షణలు - ఇవన్నీ వీరేశలింగం స్వీయ చరిత్ర ఆధారంగా అధ్యయనం చేయవచ్చు. ఇంకో విశేషమేమిటంటే తెలుగులో సంపూర్ణమైన అర్థంలో తొలి స్వీయ చరిత్ర కూడా ఇదే కావడం!

"తెలుగులో మొదటి ప్రబంధమును నేనే చేసితిని, మొదటి నాటకమును నేనే తెనుగించితిని. మొదటి ప్రకృతి శాస్త్రమును నేనే రచించితిని. మొదటి ప్రహసనము నేనే వ్రాసితిని. మొదటి చరిత్రమును నేనే విరచించితిని. స్త్రీలకై మొదటి వచన పుస్తకమును నేనే కావించితిని". అంటూ స్వీయ చరిత్రలో రాసుకున్న కందుకూరి ఆ ప్రక్రియకు కూడా ఆద్యులు అనడం అక్షర సత్యం.

నిజానికి పంతులుగారికి స్వీయచరిత్ర రాసుకోవడం పెద్దగా ఇష్టం లేదు. "పనిచేసి చూప వలయునన్న చింతయే కాని నన్ను గూర్చి నేను చెప్పుకోవలయునన్న అభిలాష మొదటి నుండియు నాకెందుకో లేకుండెను" అని రాశారు. ఆయన ఆదర్శ జీవితానుభవాలు గ్రంథస్థం కావాలనే ఆకాంక్షతో ఆత్మీయులు, అభిమానులు ఆపని చేయమంటూ పంతులుగారిపై వత్తిడి తెస్తుండేవారు. అత్యంత ఆప్తమిత్రుడైన బసవరాజు గవర్రాజు ఇంగ్లీషులో కందుకూరి జీవితచరిత్ర రాయాలని సంకల్పించగా ఆయన నిరుత్సాహపరచి కావాలంటే తన మరణానంతరం రాయమన్నారు. అయితే ఆయన కంటే చిన్నవాడే ఆయన గవర్రాజు దురదృష్టవశాత్తు అకాలమరణం చెందారు. అప్పుడు పంతులుగారే గవర్రాజు జీవిత చరిత్ర రాయాల్సి వచ్చింది. ఆ క్రమంలో స్వీయ చరిత్రకు శ్రీకారం చుట్టినట్లయింది. ఈలోగా అభిమానులు తమకు తోచినట్లు రాయటం మొదలుపెట్టారు. దాంతో ఆయనే 1903లో ఆత్మకథ రాసుకోవటం మొదలుపెట్టారు. రెండు భాగాలుగా పూర్తిచేశారు. 1911లో మొదటి భాగం అచ్చుయ్యేలోగా సహధర్మచారిణి రాజ్యలక్ష్మమ్మగారు కన్నుమూశారు. జీవితాంతం అన్ని మలుపుల్లో మహాత్కార్యాల్లో తనతో నిలిచిన భార్య మరణం ఆయనను ఎంతో కృంగదీసింది. 'ఏబది సంవత్సరముల కాలము ప్రాణమునకు ప్రాణమైయుండిన నా యర్థాంగి లక్ష్మియైన రాజ్యలక్ష్మికి దీనిని నేనంకితము చేయుచున్నాడనని ఆయన రాశారు. అదృష్టవశాత్తూ ఆ అంకిత వాక్యాలు చాలా సంవత్సరాలకు బయటపడి 1982లో విశాలాంధ్ర ప్రచురించిన స్వీయ చరిత్ర ముద్రణలో చోటుచేసుకున్నాయి.

కొమర్రాజు లక్ష్మణరావుగారి విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి 1919లో రెండు భాగాలుగా స్వీయ చరిత్ర ముద్రించింది. హితకారిణీ సమాజం వారు 1936లో, 1954లో రెండు సార్లు పునర్ముద్రించారు. సుప్రసిద్ధకవి, రచయిత చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారు 1936లో రెండవ ముద్రణకు పీఠికరాస్తూ, తన హోదాను "వీరేశలింగ మహాశయుని శిష్యపరమాణువు' అని రాసుకోవడం ఆ గురుశిష్యులిద్దరి గొప్పతనాన్ని ప్రతిబింబిస్తుంది. హితకారిణీ తరపునే స్వీయచరిత్రకు సంగ్రహ ముద్రణ వెలువరించారు. 1982లో విశాలాంధ్ర వారు అక్కిరాజు రమాపతి రావు సంపాదకత్వంలో అధోజ్ఞాపికలు, వివరాలతో సహా స్వీయచరిత్ర సంపూర్ణ పాఠం పునర్ముద్రించారు.

చెట్లులేని చోట ఆముదం చెట్టు మహావృక్షమన్నట్టు తాను కొంత కృషి చేశానని పుస్తకం పొడుగునా ఎన్నిసార్లు సవినయంగా చెప్పుకున్నా పంతులుగారు తెలుగులో స్వీయచరిత్ర తనదే ప్రథమం అంటూ అందులోని కష్టనష్టాలను

ప్రస్తావించారు. ఆత్మస్తుతి, పరనింద లేకుండా రాయటం, రాసినట్లు పాఠకులను ఒప్పించడంలో ఇబ్బందిని వివరిస్తారు.

గోదావరి తీరంలోని రాజమహేంద్రవరం తరతరాల చరిత్రకు సాక్షీభూతమైంది. కళాసాహిత్యాలనూ ప్రవహింపచేసింది. ఆంధ్ర మహాభారతానికి అక్కడే అంకురార్పణ జరిగింది. అలాంటి చోటు కందుకూరి వీరేశలింగం సంస్కార క్షేత్రం కావడం యాధృచ్ఛికమేమీ కాదు. తాతగారి పేరుకూడా వీరేశలింగమే. గొప్ప వ్యవహర్త. ఎన్నో ఉన్నతోద్యోగాలు నిర్వహించిన వ్యక్తి. రాజమండ్రిలో లంకంత ఇల్లు కట్టాడు. వీరశైవుడైనప్పటికీ మెడలో లింగాకృతులు కట్టుకోకుండా కొద్దిపాటి సంస్కరణ దృష్టి ప్రదర్శించినవాడు ఆయన. రెండో కొడుకు సుబ్బారాయుడుకు – పున్నమ్మకు 1848లో ఏప్రిల్ 16న పుట్టిన బిడ్డే వీరేశలింగం. పుట్టినప్పటి నుంచి జబ్బులు ఆయనను వెన్నాడాయట. ప్రాణాలు పోతాయని దాదాపు బయటపెట్టిన సందర్భాలూ వున్నాయి. అయినా మృతాచారాలను తుదముట్టించే కర్తవ్య నిర్వహణకు ఆయన మృత్యుంజయుడై బయటపడ్డారు! చనిపోయే వరకు సాంఘిక దురాచారాలతోనే గాక శారీరక రుగ్మతలతోనూ పోరాడుతూ వచ్చారు. నాలుగో ఏటనే తండ్రిని కోల్పోయినా పెత్తండ్రి సాయంతో, తల్లి నీడలో పెరిగాడు. చిన్నప్పుడే పాఠాలు, శతకాలు బాగా వంటపట్టించుకొన్నాడు. అన్నట్లు ఆ రోజుల్లోనే తమ పంతులుగారిని అనుకరించి, ముక్కుతో మాట్లాడటం నేర్చుకున్నారు. ఈ దురలవాటు జీవితాంతం తనను వదిలిపెట్టలేదని ఆత్మకథలో వాపోయారు. ఆయన విద్యార్థి దశలోని కొన్ని ఘట్టాలు ఎంతో ఆసక్తి కల్పించడమే గాక ఆయన వ్యక్తిత్వాన్ని తెలియజెప్పాయి. వసు చరిత్ర చదవాలనే కుతూహలంతో ఆయన పుస్తకాల షాపు యజమానితో ఒక ఒప్పందం కుదుర్చుకుంటాడు. తల్లి స్కూల్ ఫీజు కోసం ఇచ్చే డబ్బు ఆయనకు ఇస్తే ధర పూర్తిగా చెల్లించే వరకు అక్కడే వుండి చదువుకోవడం ఆ ఒప్పందం సారాంశం. కొడుకు బడిమానేసి అలా చదువుకుంటూన్న విషయం ఎలాగో తల్లికి తెలిసింది. ఆయన పఠనాభిలాషకు సంతోషించి, పుస్తకం కొని పెట్టింది. ఏక సంథాగ్రాహికావడంతో ఆయనకు పాఠాలు త్వరగా వచ్చేవి. అయితే ఆ లక్షణమే తనను కొంత చెడగొట్టిందని ఆయన రాసుకున్నారు. ప్రతిభవుందని మరింత కష్టపడకుండా వుండేవారి కంటే ఎక్కువగా కష్టపడేవారే లోకానికి మేలు చేస్తారని అంటారు. విద్యార్థి దశలో ఆయన అసమర్థుడైన ప్రధానోపాధ్యాయునికి వ్యతిరేకంగా పోరాడి వెనక్కు పంపించారు. అదే సమయంలో చదువులో ప్రతిసారి ప్రథములుగా వచ్చి అనేక ప్రశంసలు, సహాయాలు అందుకున్నారు.

జ్యోతిష్యాలు, ముహూర్తాలపై, భూతవైద్యులు, దయ్యాలపైన ఆయన మొదటే విశ్వాసం పోగొట్టుకుని, అవన్నీ బూటకమని గ్రహించారు. బ్రహ్మసమాజ ఆచార్యత్రయంలో ముఖ్యులైన కేశవ చంద్రసేన్ రచనలు వీరేశలింగం గారిలో కొత్త ఆలోచనలు రేకెత్తించాయి. మిత్రులతో కలసి సమావేశాలు జరుపుతూ నూతన విషయాలను చర్చించడం మొదలు పెట్టారు. తాము వీధిలో వెళ్తూంటే మూఢులు "మీటింగుల వాళ్ళు వీళ్ళేనర్రో" అని తమలో తాము చెప్పుకునే వారట! కొన్నాళ్ళు న్యాయవాదుల దగ్గర పనిచేసిన తర్వాత ఆయనకు ఆవృత్తిపై వైముఖ్యమేర్పడింది. స్వతంత్రంగా జీవించాలని, లేదా ఉపాధ్యాయుడగా పనిచేయాలని నిర్ణయించుకున్నారు. అలాగే పత్రికా రచన కూడా మొదలు పెట్టారు. మద్రాసు నుంచి కొక్కొండ వెంకటరత్నం పంతులు ప్రచురించే పత్రికలో స్త్రీవిద్యకు వ్యతిరేకంగా రాసేవారు. దాన్ని ఖండిస్తూ ఆయన బందరు నుంచి వెలువడే "పురుషార్థ ప్రదాయని"లో వ్యాసాలు రాయసాగారు. ఆ తర్వాత 1974లో తానే "వివేకవర్ధిని" పేరుతో మాసపత్రిక ప్రారంభించారు. దానికి అనుబంధంగా "హాస్యసంజీవని" అనే మాసపత్రిక ప్రారంభించారు. తనపైన, తన రచనలపైనా ఛాందసులు చేసే విమర్శలను ఎదుర్కోవడానికి, సాంఘిక దురాచారాలను ఖండించడానికి ఆయన దాన్ని సాధనంగా చేసుకున్నారు. "పెద్దయ్యగారి పెళ్ళి" అని పామరులు చెప్పుకున్న "బ్రహ్మ వివాహము" ప్రహసనలు ఈ పత్రికలోనే మొదట వెలువడింది. ఆనాటి న్యాయవాదులు, న్యాయమూర్తుల అవినీతి పనులను, వేశ్యావృత్తిని పోషించే దురాచారాన్ని శక్తివంతంగా ఖండించడానికి ఆయన తన పత్రికలను ఆయుధాలుగా వినియోగించారు. ఈ క్రమంలో ఎందరినినో ఎదుర్కొన్నారు. ఎన్నో భాగోతాలు బయటపెట్టారు. వేలంపాట పెట్టి ఎక్కువ సొమ్మునిచ్చిన వారికి అనుకూలంగా తీర్పులు చెప్పే మునసబుగారిని, ఆయనకు చిత్రతీర్పులు రాసే చిత్రపు కామరాజు అనే లాయరును పత్రిక కెక్కించారు. ఈనాడు ఎంతగానో చెప్పుకునే 'పరిశోధనాత్మక జర్నలిజం'కు వరవడి పెట్టారు. పరువుపోయిన కామరాజు ఆత్మహత్య చేసుకోగా, మునసబుకు మతిచలించింది. ప్రభుత్వోద్యోగులు, ప్లీడర్లు, కపట

స్వాములు, వేశ్యా గృహనిర్వాహకులు ఆయనను, ఆ పత్రికను తిట్టిపోశారు. అది ప్రజల ఆదరణతో 1876లో పక్ష పత్రికగా మారింది. ఆనాటి ఇంగ్లీష్ అధికారులకు అన్ని విషయాలు అర్థంకావడం కోసం ఇంగ్లీష్ విభాగంకూడా వుండేది. ఇక తెలుగు విభాగంలో భాషా, సాహిత్య సంబంధమైన వ్యాసాలు, రచనలు సమీక్షలు వగైరాలుండేవి.

వీరేశలింగంగారి ఉద్యమరధానికి రెండు చక్రాలు ఒకటి సాహిత్యం, రెండోది సంఘసంస్కరణ. సాహిత్యకారుడుగా ఆయనకృషి అసాధారణమైంది. అందులోనూ అంతటి కార్యశీలిగా వుంటూ అన్ని రచనలు చేయడం ఆయనకే చెల్లింది. నన్నయ్య కాలంనుంచి ఆయన కాలం వరకు వెయ్యేళ్ళు తెలుగు సాహిత్యంలో ప్రక్రియా వైవిధ్యం, ఇతివృత్త వైవిధ్యం నాస్తి. మానవునికే పరిమితమైన కథాంశాలూ లేవు. ఆ పరిస్థితులలో వీరేశలింగం లౌకిక సాహిత్యానికి నాందిపలికారు. 1899లో గోల్డ్ స్మిత్ నవల "వికార్ ఆఫ్ వేక్ ఫీల్డ్" ఆధారంగా "రాజశేఖర చరిత్ర" అనే తొలి తెలుగు నవల రాశారు. దేవుళ్ళు, రాజులు గాక మానవుడ్ని కథానాయకుడుగా తీసుకున్నారు. మొత్తంపై ఆయన రచనలు వందకు పైనే వుంటాయి. కొత్త గ్రంగాలు రాయడమే గాక, పాతవి పరిష్కరించి ప్రచురించారు. వ్యాకరణం రాశారు. ఆఖరుకు వైజ్ఞానిక దృష్టితో జీవశాస్త్రం, ప్రకృతి శాస్త్రం, వంటివి తెలుగులోకి తీసుకువచ్చారు. అందుకోసం ఆ రోజుల్లోనే జంతువులు, మానవుల శరీర భాగాలను క్షుణ్ణంగా తెలుసుకోవడానికి ప్రయత్నించారు. తెలుగులో తొలిసారి సమగ్రంగా కవుల చరిత్ర రాశారు. 1883లో స్త్రీల కోసం ప్రత్యేకంగా సతీహితబోధిని అనే పత్రిక నడిపారు. స్త్రీలను చైతన్యపరిచే ఎన్నో రచనలు దానిలో వెలువరించారు.

స్త్రీవిద్య, వితంతు పునర్వివాహం కోసం వీరేశలింగం, ఆయన మిత్రబృందం, శిష్యబృందం సాధించిన మహోద్యమం గురించి స్వీయ చరిత్రలో చదువుతుంటే ఉత్సాహం, ఉత్తేజం ముప్పిరిగొంటాయి. సమాజంలో మార్పుకోసం పోరాడటంలోని సాధక బాదకాలు అవగతమవుతాయి. ఎందరినో కదిలించి, వెంట నడిపించుకోగలిగారు గనుకనే ఆయన ఒక సామాజిక శక్తిగా మారగలిగారు. ఛాందసులను, స్వార్థపరులను నైతికంగానే గాక భౌతికంగానూ ఎదుర్కోగలిగారు.

నాటి రోజుల్లో సహపంక్తి భోజనాలకు, వితంతు వివాహ విందులకు హాజరు కావడమే పెద్ద సాహసం. ఒక్కో పునర్వివాహం ఒక్కో యజ్ఞమే. వితంతువులకు ఆశ్రయమివ్వడం, పెళ్ళి నిర్విఘ్నంగా చేయడం, ఆరోపణలు, అసత్యప్రచారాలు ఎదురవడం ఎన్నో సమస్యలు. ఇవన్నిటా ఎందరో శ్రేయోభిలాషులు ఆయనకు తోడ్పడ్డారు.

1881 డిసెంబర్ 11న ఆంధ్రదేశంలో తొలి వితంతు పునర్వివాహం రాజమండ్రిలో జరిగింది. కృష్ణాజిల్లాకు చెందిన గౌరమ్మను వీరేశలింగం సన్నిహితులైన గోగులపాటి శ్రీరాములు రాజమండ్రిలో పెళ్ళి చేసుకున్నారు. నిజానికిది వివాహం కాదు. పెద్ద సాంఘిక సంగ్రామం. ఒక కురుక్షేత్రం. ఆనాటినుంచి ఎన్నో అవరోధాలు ఎదురైనా వీరేశలింగం వెనకంజ వేయలేదు.

ఎక్కడెక్కడి వితంతువులకు ఆ పుణ్య దంపతులే ఆశ్రయమిచ్చారు. విద్యా, వైద్యం కల్పించి, పెళ్ళిళ్ళు చేయడమే గాక కొత్త జంటలకు కొంత భృతి కూడా కల్పించారు. తనమీద గౌరవంగల దాతల ద్వారానూ, తాను స్వయంగానూ వీరేశలింగం గారు పెద్దపెద్ద మొత్తాలు ఇందుకు వెచ్చించారు. ఆశ్రమాలు, విద్యాసంస్థలు కట్టించారు. కాలక్రమంలో కొందరు మిత్రులు శత్రువులుగా మారినా, సహాయం పొందినవారే కృతఘ్నులుగా మారినా, అనారోగ్యం వెంటాడినా ఆయన నిస్పృహ చెందలేదు. అసహాయ శూరునిగా, అవిశ్రాంత యోధునిగా ముందుకు సాగారు. అందరి మన్ననలు పొందారు. తెలుగుదేశంలోనే కాదు, దక్షిణ భారత మంతటా ఖ్యాతిగాంచారు. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ అందుకు అభినందన సందేశం పంపించారు. సుబ్రహ్మణ్య భారతి ఆయనను పాత్రగా పెట్టి నవల రాశారు.

సాహిత్యం, సంస్కరణలతో పాటు ఇతర విషయాల్లోనూ ఆయన దూరదృష్టి కనపరిచారు. గ్రంథాలయాలు నెలకొల్పారు. పురపాలక కార్యక్రమాల్లో పాల్గొన్నారు. పురమందిరం పేరు మీద టౌన్‌హాల్ కట్టించారు. ఇవన్నీ ఆయన ఆధునిక దృష్టికి అద్దం పడతాయి. ఇందుకు సంబంధించిన జమా ఖర్చులు కూడా కచ్చితంగా రాసిపెట్టడం విశేషం.

స్వీయచరిత్రలో ఈ పరిణామాలన్నీ సవివరంగా చూడగలుగుతాము. అడుగడుగునా ఆయన కార్యశీలత, వినమ్రత గమనిస్తాము. జాతీయ కాంగ్రెస్ స్థాపనకు ఆయన ప్రతిస్పందన కూడా కనిపిస్తుంది. అయితే ఆ కాలం నాటికి జాతీయోద్యమం ఇంకా విస్తరించలేదు. రాజ్యాంగ స్వాతంత్ర్యం కోసం పోరాడటం కంటే సంఘ సంస్కరణ, సంస్కారాలు ముఖ్యమని ఆయన తలపోశారు. ఈ దృష్టి ఇంకా చాలామంది సంస్కర్తలలో కనిపిస్తుంది. అన్ని విషయాలలో అభివృద్ధి రావాలి

## వీరేశలింగం ఒక విజ్ఞాన సర్వస్వం.

రస ప్రపంచంలో గురజాడ ధ్రువతార అయితే వీరేశలింగం ఒక విజ్ఞాన సర్వస్వం. దురాచారాల గాఢాంధకారంలో నిద్రపోతున్న జాతిని మేల్కొలిపి విజ్ఞానపు వెలుగులు ప్రసరించిన మహనీయుడు. ఆంధ్రుల అభ్యుదయోద్యమానికి మూల పురుషుడు. ప్రతికూల శక్తుల ఝంఝా ప్రభంజనానికి చెక్కుచెదరకుండా నిలబడి శాఖోపశాఖలుగా విస్తరించిన వటవృక్షం. తెలుగులో మొట్టమొదటి వాస్తవిక నాటకం గురజాడ రచిస్తే మొట్టమొదటి వాస్తవిక నవలను వీరేశలింగం రచించాడు. తన కథలలో, కవిత్వంలో గురజాడ భావవిప్లవం తీసుకు వస్తే, వీరేశలింగం తన జీవితంలో దాన్ని ప్రత్యక్షంగా ప్రదర్శించాడు. విభిన్న భావాల సంఘర్షణలో తాటస్థ్యానికి విరుగుడు శాస్త్రీయ విజ్ఞానమేనని ఇద్దరూ తమ రచనల ద్వారా ప్రచారం చేశారు. గిడుగు, గురజాడ, వీరేశలింగం! వీరు జల్లిపోయిన విజ్ఞాన బీజాలు యిప్పుడిప్పుడే ఫలవంతమవుతున్నాయి. అయినా అసలు వీరు పుట్టనేలేదన్నట్లుగానో, వీరు సలిపిన పరిశ్రమ అంతా విఫలమైయి పోయినట్లుగానో, ఏ శక్తుల మీద వీరు తిరుగుబాటు చేశారో వాటిని ఊత కర్రలుగా చేసుకొని వెనక్కి పోవాలని యీ యిరవయ్యో శతాబ్దపు 55వ సంవత్సరంలో ప్రయత్నాలు జరుగుతున్నాయి. అభ్యుదయ రచయితలమైన మనం గిడుగు సాంప్రదాయాలలో, గురజాడ కావ్యవాహినులలో, వీరేశలింగం విప్లవధోరణులలో ప్రాణవాయువులు పీల్చుకుంటున్న మనం, నిస్సందేహంగా ఆంధ్ర సాహిత్య పరిణామంలో అగ్రశ్రేణిని పయనిస్తున్న మనం, మళ్ళీ మనల్ని పాతరాతి యుగానికి పట్టుకుపోయే ప్రయత్నాలను సహిస్తామా అని ప్రశ్నిస్తూ జవాబుకోసం ఆగకుండానే (అది ఎలాగుంటుందో నాకు ఎలాగూ తెలుసు కాబట్టి) ఇంతటితో నా ప్రసంగం ముగిస్తున్నాను.

**- శ్రీశ్రీ**

***(ఆంధ్ర అభ్యుదయ రచయితల ఐదవ మహాసభ 1955 జూలై 30, 31 తేదీల్లో విజయవాడలోని షెహెన్‌షా మహల్లో జరిగింది. సభాధ్యక్ష స్థానం నుంచి చదివిన ఉపన్యాస పాఠం ఇది. ఈ సభలోనే శ్రీశ్రీ సంఘానికి అధ్యక్షుడిగా ఎన్నికయ్యాడు.)(అభ్యుదయ మాసపత్రిక జూలై 1955)***

❖

గాని కేవలం రాజ్యాంగ సంస్కారం చాలదని ఆయన నొక్కి చెబుతారు. ఇంగ్లీషు వారి ప్రభావం వల్ల కలిగిన చైతన్యాన్ని, సత్ఫలితాలను వివరిస్తారు. అయితే సంఘ సంస్కరణ లేని స్వాతంత్ర్యం నిష్ప్రయోజనమనేది ఆయన ప్రధాన దృష్టి. "సాంఘిక సంస్కారములందు మనవారికి మాటలలో గల శూరత్వము కావ్యములలోనింకను నేనభిలషించినంత కనబడుటలేదు. మన సంఘ స్థితి బాగుపడిన గాని ప్రభుత్వమువారనుగ్రహించు స్వాతంత్ర్య ఫలములను మనము నిర్విచారముగా ననుభవింపజాలము" అని ఆయన స్వీయచరిత్ర చివరి విన్నపము పేర రాశారు. నేటికీ కొనసాగుతున్న కులమతతత్వాలు, ఛాందసాలు, జ్యోతిషశాస్త్రం తదితర శాస్త్రాల పేరిట అంధ విశ్వాసాలు గమనిస్తే ఆయన ఆవేదనలోని వాస్తవికత ఎవరైనా అర్థం చేసుకోగలుగుతారు. భూతవైద్యుణ్ణి సవాలు చేసి రాత్రి శ్మశానంలో కాపు వేసి దయ్యాలు లేవని నిరూపించిన వీరేశలింగం పుట్టిన గడ్డమీదనే ఆ తర్వాత వందేళ్ళకు క్షుద్ర శక్తుల గురించిన నవలలు ప్రచారం పొందడం ఎంత దురదృష్టకరం? మూఢనమ్మకాలతో ఇంట్లో అరటిచెట్లు నరికివేయమంటే నిరాకరించి ఎదురునిలిచిన ఆయన పుట్టిన చోటనే వాస్తు పేరిట అనేకమంది కుహనా పండితులు అనవసరమైన పనులు చేయించడం ఎంత విచారకరం? మహిళా వికాసం కోసం ఆయన జీవితమే ధారపోస్తే ఈనాడు సతీసహగమనాలు పునరావృతం కావడం, వరకట్నం కోసం భార్యలను సజీవ దహనాలు చేయడం మరెంత భయంకరం? అందుకే ఆయన ఆత్మకథలో మూఢనమ్మకాలను ఖండించే అనుభవాలను ఆయన అగ్రభాగాన వుండి నడిపించిన వితంతు పునర్వివాహ ఉద్యమ చరిత్రకు సంబంధించిన అనేక అంశాలున్నాయి.

వీరేశలింగం జీవితానుభవాలు నేటి పరిస్థితులలో మరింత ప్రాధాన్యత సంతరించుకుంటున్న వాస్తవం ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. ఆ యుగకర్త జ్ఞాపకాలు మరోసారి కర్తవ్యోద్దీపకాలైతే, జడలు విచ్చి ఆడుతున్న మతోన్మాదాన్ని ఆధునికత చాటున పెరుగుతున్న అంధ విశ్వాసాలను దృఢంగా ఎదుర్కోగలుగుతాము.

**(అనుభవంలో అంధవిశ్వాసాలు - వితంతు పునర్వివాహోద్యమం సంకలనం ముందుమాట )**

❖

# మహానుభావుడు వీరేశలింగం గారు



- చిలకమర్తి లక్ష్మీనరసింహం

*వీరేశలింగముగారు తంజాపురీ గ్రంథ భాండారములోని పుస్తకముల జాబితా తెప్పించి చూడగ, నందులో నాచనసోముని యుత్తర హరివంశము యొక్క వ్రాతప్రతి యొకటి యున్నట్లు కనబడెను. ఆ గ్రంథము నశించిపోయినదని చింతించుచున్న వీరేశలింగముగారికి, పేదకు పెన్నిధి దొరకినట్లయ్యెను. వెంటనే వారు వ్యయ ప్రయాసములకు లోనై తంజావూరు పోయి, యప్పుడచ్చట మండల న్యాయాధిపతిగ నుండిన "హేమ్‌నెటు" దొరగారి సహాయ్యమున నెవరిచేతనో "యుత్తర హరివంశము"న కొక ప్రతి వ్రాయించి, తెప్పించి, తమ వివేకవర్ధనీ ముద్రాక్షరశాలలో దానిని ప్రకటింప నారంభించిరి.*

ఆ దినములలోనే, రాజమహేంద్రవరమున తహసీలుదారుగ నుండిన నందివాడ పేర్రాజుగారు, మృతినొందిరి. ఆ సంవత్సరము జూలై 16వ తేదీని శ్రీ బసవరాజు గవరరాజుగారు మృతినొందిరి. వీరు వీరేశలింగంగారికి ప్రాణమిత్రులు, వీరేశలింగము గారు చేయు సమస్త కార్యములకు గవరరాజు గారు సాయపడుచుండిరి. గవరరాజుగారు వీరేశలింగముగారితోపాటు వెలిలో నుండుటచేత వారి దహనమునకు సభాపతులు కొన్ని చిక్కులు పెట్టిరి. నాకప్పటికి గవరరాజు గారితో బరిచయము లేకపోయినను, వారియందలి గౌరవముచేత, 1886 జూలై 17వ తారీఖున, వారి శవముతో గూడ శ్మశానమునకు బోతిని. శవమును గరికపాటి సుబ్బారాయుడుగారు, దామెర్ల రమణరావుగారు, గాడేపల్లి సుబ్బయ్యగారు మరియొకరు మోసిరి. గవరరాజుగారి జ్ఞాతియైన బసవరాజు సేతూరావుగారగ్నిహోత్రము పట్టుకొనిరి. మంత్రపుబ్రాహ్మణుడు దొరకకపోవుటచే, కందుకూరి వీరేశలింగముపంతులుగారు, పుస్తకము జూచి మంత్రము చదివి, కర్మజేయించిరి. శవము వెంట శ్రీ నాగోజీరావుపంతులుగారు, న్యాపతి సుబ్బారావుపంతులుగారు, మొదలగు పురప్రముఖులందరు వచ్చిరి.

❖❖❖

1894వ సంవత్సరమున నవలల పోటీ పరీక్షకు నిలిచితిని. ఆ సంవత్సరమున నేను "రామచంద్ర విజయ" మను నవలను వ్రాసి పంపితిని. ఆ సంవత్సరమున నవలల గుణగణముల పరీక్షించుటకు శ్రీ వావిలాల వాసుదేవ శాస్త్రిగారిని, శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారిని, జిల్లాకోర్టు న్యాయవాదియైన యాచంట సుందర రామయ్యగారిని నియమించిరి. ఆ సంవత్సరమున పోటీపరీక్షకు పదునాలుగు నవలలు వచ్చినవి. వాటినెల్ల శ్రమపడి చదివి పరీక్షకులు తమ నిర్ణయములనిచ్చిరి. గోటేటి కనకరాజుగారు "వివేక విజయ"మని యొక నవలను వ్రాసి పంపిరి. మరియు ననేకులు బంపిరి. శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారును, యాచంట సుందరరామయ్య గారును, నేను వ్రాసిన "రామచంద్ర విజయము" ప్రథమగణ్యమని యభిప్రాయపడిరి. కనకరాజుగారు వ్రాసిపంపిన "వివేకవిజయుము" ప్రథమ గణ్యమని వీరేశలింగం గారభిప్రాయపడిరి. ఎవరి అభిప్రాయము త్రోసివేయుటకు వీలులేక సుబ్బారావు పంతులుగారు మొదటి నవల కేర్పడిన 125 రూపాయలును, రెండదాని కేర్పడిన 75 రూపాయలును కలిపి మొత్తము రెండువందల రూపాయలు మొదటి నవల

రెండవ నవల యను రెంటిని సమానముజేసి కనకరాజుగారికి నూరు రూపాయలును, నాకు నూరు రూపాయలును యిచ్చి "తుని తగవు" మాదిరిగ చేసిరి.

"రామచంద్ర విజయు" మే నా నవలలలో మొట్టమొదటిది. అంతకుముందు నాటకములే గాని నేను నవలలు రచియింపలేదు. సుబ్బారావు పంతులుగారి ప్రోత్సాహము చేత నేను క్రొత్తపుంత త్రొక్కితిని. హనుమంతరావు నాయుడుగారి ప్రోత్సాహము లేకపోయిన యెడల నేను త్వరగ నాటకములు వ్రాయలేకపోదును. సుబ్బారావు పంతులుగారి ప్రోత్సాహము లేకపోయిన యెడల నేను నవలలప్పుడు వ్రాయలేకపోదును. నవలలు వ్రాయుటకు మాకప్పుడు వీరేశలింగము గారు వ్రాసిన 'రాజశేఖర చరిత్ర' యను నవలయే యాదర్శకము. ఆ నవలను నేనామూలాగ్రముగ జదివి, నవలలు రచయించు పద్ధతి తెలిసికొని "రామచంద్ర విజయము" వ్రాసితిని. పోటీపరీక్షలో నెగ్గిన నవలలు "చింతామణి", పత్రికలోనే ప్రతిమాసము ప్రకటింపబడుచు వచ్చెను. ముద్రణము పూర్తియైన తరువాత నవలలు వ్రాసినవారికి 500 ప్రతులు సుబ్బారావు పంతులుగా రుచితముగ నిచ్చుచుండిరి.

❖❖❖

1896వ సంవత్సరం డిశంబరులో వీరేశలింగముగారు తంజావూరు నగరమునకు నముద్రితాంధ్ర గ్రంథములను సంపాదించుటకై వెళ్ళిరి. ఆ పురమును తెలుగు నాయకులు బరిపాలించునపుడు యమూల్యమైన యంధ్రగ్రంథ భాండారమొకటి సంపాదించి యుంచిరి. మనదేశములో నెచ్చటను దొరకని యంధ్రగ్రంథము లనేకములచ్చట దొరుకుచు వచ్చెను. నాచనసోముడు రచియించిన "యుత్తర హరివంశ"మును మహాకావ్యము, తెనుగుదేశమున నెవరెంత ప్రయత్నించినను దొరికినది గాదు. వీరేశలింగముగారు తంజాపురీ గ్రంథ భాండారములోని పుస్తకముల జాబితా తెప్పించి చూడగ, నందులో నాచనసోముని యుత్తర హరివంశము యొక్క వ్రాతప్రతి యొకటి యున్నట్లు కనబడెను. ఆ గ్రంథము నశించిపోయినదని చింతించుచున్న వీరేశలింగముగారికి, పేదకు పెన్నిధి దొరకినట్లయ్యెను. వెంటనే వారు వ్యయ ప్రయాసములకు లోనై తంజావూరు పోయి, యప్పుడచ్చట మండల న్యాయాధిపతిగ నుండిన "హేమ్‌నెటు" దొరగారి సహాయ్యమున నెవరిచేతనో "యుత్తర హరివంశము"న కొక ప్రతి వ్రాయించి, తెప్పించి, తమ వివేకవర్ధనీ ముద్రాక్షరశాలలో దానిని ప్రకటింప నారంభించిరి. నాచనసోముని కవిత్వము, కవిత్రయము వారి పాకముకంటెను మిన్నగ నుండునని "శబ్దరత్నాకర" నిర్మాతలైన బహుజనపల్లి సీతారామాచార్యులుగారును, వీరేశలింగముగారును వ్రాయుటచేతను, నాచన సోముడు మూడవకన్ను దాచివచ్చిన శివుడేయని పూర్వము చిన్నయసూరి గారు మెచ్చుటచేతను, సోముని కవిత్వమెంత బాగుండునో చూడవలెనన్న కుతూహలము మిక్కుటమగుట చేతను, గ్రంథము ప్రకటింపబడినదాక వేచియుండుటకు నా కోపికలేక, నేనొక చిన్న దొంగతనము జేసితిని. చేసిన పాపము చెప్పిన పోవునని మనలో నొక సామెత గలదు. పాఠక మహాశయులు నన్ను క్షమింత్రుగాక.

❖❖❖

1897వ సంవత్సరమున రాజమహేంద్రవరమున గొప్ప విశేషమొకటి జరిగెను. ఈ పురనివాసియు, మహాకవియు, మహా పండితుడు, సంఘసంస్కర్తయు, పురమందిర ప్రదాతయు, స్త్రీ పునర్వివాహ సంస్థాపనాచార్యుడు, స్త్రీ విద్యాభిమానియు, శతాధిక గ్రంథకర్తయునైన రావుబహదూరు శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగారు, రాజధానియైన చెన్నపట్టణములో వితంతు శరణాలయము స్థాపించి, సంఘసంస్కరణ విషయమున విశేషకృషి సలుపవలెనను సంకల్పముతో, రాజమహేంద్రవర నివాసము మాని డిశంబరు నెలలో సకుటుంబముగ చెన్నపురికి బోయిరి. వారు రమారమి యిరువది సంవత్సరములు రాజమహేంద్రవర కళాశాలలో నాంధ్రాధ్యాపకులుగ నుండుటంజేసి, కళాశాల విద్యార్థులు నుపాధ్యాయులు గలిసి, కళాశాలలో నొక మహాసభజేసి, వారిని సన్మానించి వీడుకోలు నొసంగిరి. ఆ సభకు పురప్రముఖులలో నొకరును న్యాయవాదులును పూర్వము వీరేశలింగముగారికి శిష్యులు శ్రీ ఆచంట సుందరరామయ్యగా రధ్యక్షత వహించిరి. ఆ సభలో నప్పుడు బి.ఏ. తరగతిలో చదువుచున్నట్టియు, సరసకవితా విశారదుడైనట్టియు "రుక్మిణీపరిణయ" "శ్రీరామ విజయా"ది నాటకములు రచించినట్టియు, శ్రీ కోపల్లె వెంకటరమణారావుగారు కొన్ని పద్యములు వ్రాసి చదివిరి.

## చరిత్ర పునరావృతమవుతోందా?

**- సి.వి.**

కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, రఘుపతి వెంకటరత్నం, తాపీ ధర్మారావు, త్రిపురనేని రామస్వామి, యామినీ పూర్ణ తిలకమ్మ, డాక్టర్ ముత్తులక్ష్మిరెడ్డి, గుడిసేవ సుబ్బయ్య, యింకా ఎందరో అజ్ఞాత యువకిశోరాలు వజ్రసంకల్పంతో అహోరాత్రాలూ కృషిచేసి, తెలుగునేల నలుమూలలకీ నూత్న సాంస్కృతిక పునర్వికాస మహోద్యమ సందేశాన్ని కొనిపోయారు. అంధమత విశ్వాసాలకి, అర్థం చెల్లిన ఆచార వ్యవహారాలకీ వ్యతిరేకంగా వీరు రాజీలేని పోరాటం సాగించారు. నాటి తెలుగు ప్రజల్ని తరతరాలుగా రాచపుళ్లవలె పట్టి పీడించిన సానివాడల్నీ - సాంఘిక దురాచారాల్నీ - నిర్దాక్షిణ్యంగా వీరు పారదోలారు. అయితే, ఈ అనారోగ్యకర ఫలితాలు క్రమంగా "నేడు అదృశ్యమవుతున్నాయేమోననే అనుమానం వేస్తోంది. భూమి గుండ్రంగా తిరుగుతున్నట్లు, చరిత్ర పునరావృత మవుతున్నదేమోననే భయం కల్గుతోంది! జాతీయోద్యమం పేరిట పొడిచేస్తాం - కరిచేస్తాం - అని బయలుదేరిన సనాతన కాంగ్రెస్ నాయకుల పుణ్యాన, బ్రహ్మసమాజం సామాజికరంగంలో తీసుకొచ్చిన చైతన్యమంతా గంగలో కలిసిపోయింది. ముప్పయేళ్ళ స్వరాజ్యకాలంలో పాలకవర్గాలు ప్రోత్సహించిన రివైవలిజం పుణ్యాన, ఈ సాంఘిక మార్పులన్నీ కాలగర్భంలో కలిసిపోయి మళ్లీ ఆదిశంకరుని ఇండియా నేడు అవతరించింది! అంచేత, మరల పడగవిప్పుతోన్న వేయి తలల హిందూ పునరుజ్జీవన వాదం నాగును ముక్కముక్కల కింద నరికివేయాలి. నూత్న మానవవిలువలతో నిండిన సాంస్కృతిక పునర్వికాస మహోద్యమం కోసం యావన్మంది ప్రజలూ తిరిగి నడుములు బిగించి తీరాలి.

**01.01.1984 (భారతీ జాతీయ పునరుజ్జీవనం - సి.వి. పుస్తకం నుండి )**

❖

నేనును కొన్ని పద్యములు వ్రాసి సభలో చదివితిని. మరికొందరు కొన్ని పద్యములు వ్రాసి చదివిరి. ఇదియేగాక శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులుగారు, మరికొందరు పురప్రముఖులును గలసి టవునుహాలులో నొక గొప్ప సభజేసి, వీరేశలింగముగారిని సన్మానించిరి. మరియు శ్రీ కంచుమర్తి రామచంద్రరావుగారిచేత స్థాపింపబడిన "విద్యాభిమానినీ" సమాజము వారు గూడ సభజేసి, యాంధ్రాభ్యుదయ పితామహుడైన వీరేశలింగముగారిని గౌరవించిరి. అప్పుడు శ్రీ కొట్టి రాఘవయ్యగారు మనోహరములైన పద్యములు వీరేశలింగముగారిమీద రచించి చదివి సభాసదులను రంజింపజేసిరి. వీరేశలింగముగారు 1889లో తమ సొంత డబ్బుతో టువునుహాలు కట్టుట ప్రారంభించి 1890లో ముగించిరి. అప్పుడు కళాశాలలో ప్రథమ సహాయోపాధ్యాయుడుగ నుండిన శ్రీ నాగోజీరావు పంతులుగారు, పురమందిర ప్రవేశ మహోత్సవ సందర్భములో జరిగిన మహాసభకధ్యక్షులైరి. నాడు కళాశాలలో ప్రకృతిశాస్త్ర పండితులైన పండిత రంగాచార్యుల వారాంగ్లభాషలో బహుజన స్తవనీయమైన యుపన్యాసమును వీరేశలింగముగారిని గూర్చి యిచ్చిరి. నాటినుండియు మా పురమందిరము ప్రజల నిమిత్తమే యుపయోగపడుచుండినను, వీరేశలింగముగారు దానిని ధర్మసత్రము వ్రాసి ధర్మకర్తల కప్పగింపలేదు. ఈ 1897వ సంవత్సరము డిశంబరు నెలలో చెన్నపురికి వెళ్ళకమునుపు వీరేశలింగముగారు పురమందిర పరిపాలనము నిమిత్తము, ధర్మశాసనమొకటి వ్రాసి, పదముగ్గురు ధర్మకర్తల నేర్పరచి, వారికది యప్పగించిరి. ఆ ధర్మకర్తల సంఘమునకు న్యాపతి సుబ్బారావు పంతులుగా రధ్యక్షులుగను, చిత్రపు వేంకటాచలముగారు కార్యదర్శిగను నియమింపబడిరి. వీరేశలింగముగారు కష్టార్జితమైన సొంతసొమ్ముతో దీనికి కట్టించిరి. ఆంధ్రదేశమున వెలసిన పురమందిరములలో నిదియే మొదటిదియని, రాజమహేంద్రపురవాసులము సగర్వముగ సంతోషించుచున్నాము. వీరేశలింగముగారు చెన్నపురికి పోకమునుపు, నేను వారి దర్శనము చేయబోవగ, వారు రచియించిన ప్రతి పుస్తకము యొక్కయు నొక్కొక్క ప్రతి నాకు బహుమానముగ నిచ్చిరి.

(కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహం స్వీయ చరిత్రము పుస్తకం నుండి)

❖

# వీర సంస్కర్త

- డా॥ అక్కిరాజు రమాపతిరావు



**పనప్పాకం ఆనందాచార్యులుగారు, తమబండిలో ఎక్కించుకొని తీసుకొనివెళ్ళి వీరేశలింగాన్ని రక్షించవలసి వచ్చింది. విద్యార్థులాయనను కంటికి రెప్పలా కాపాడారు. ఏ పని చెప్పినా వెంటనే నిర్వహించేవారు. యువతరమే ఆయనకానాడు కొండంత బలం. వాళ్ళ అండదండలే ఆయన కార్యనిర్వహణ కెంతగానో తోడ్పడ్డాయి. వీరేశలింగం బోధనలు విని యువతరం చాలా ఉత్తేజాన్ని పొందింది. ఆయన ప్రారంభించిన సంఘ సంస్కరణలన్నింటిలో యువకులు ముందున్నారు. వితంతువులను వివాహమాడతామని విద్యార్థులు ముందుకు వచ్చారు. విరూపాక్ష పీఠాధిపతుల లోపాలన్నీ విద్యార్థులే బట్టబయలుచేసి రాజమండ్రిలో వారికి ఉప్పూ పత్రీ పుట్టకుండా చేశారు.**

బసవరాజు గవర్రాజు, చల్లపల్లి బాపయ్య, చిర్రావూరి యజ్ఞన్న శాస్త్రి, బుర్రా రాజలింగం, ఏలూరు లక్ష్మీనరసింహం మొదలైన వాళ్ళంతా వీరేశలింగానికి ఆప్తమిత్రులు.

1874 అక్టోబరు నెలలో వివేకవర్ధని మొదటి సంచికను వీరేశలింగం విడుదల చేశాడు. ఆ తరువాత మిత్రులంతా కలిసి సంఘంలోని దురాచారాలు ఏ విధంగా రూపుమాపాలో అప్పుడప్పుడు చర్చించుకొనేవాళ్ళు. భోగం వాళ్ళకు వసూళ్ళు చదివించటం గూర్చి తీవ్రంగా వ్రాసి, తగు మనుష్యులు తలలు వంచుకొనేటట్లు చేశారు. తరువాత ఉద్యోగస్తుల లంచగొండితనంపైన దాడి చేశారు. ప్రజాక్షేమం నిమిత్తం పనిచేయవలసివస్తే స్వజాతివాడనీ, బంధువనీ, మిత్రుడనీ పరిగణించడం ఉండేదికాదు. అతి జాగ్రత్తగా సమాచారాన్ని సేకరించేవాళ్ళు. గురి తప్పకుండా కొట్టే వాళ్ళు. ఆశించిన ప్రతిఫలాన్ని రాబట్టేవాళ్ళు. వివేకవర్ధని కొన్నాళ్ళకు పక్షపత్రిక అయింది. కొన్నాళ్ళు వారపత్రికగాకూడా వచ్చింది.

"ఆ కాలమునందలి రాజకీయోద్యోగులలోని లంచములు మొదలైన యకృత్యముల నణచుటకును కులములోని దురాచారములను మాన్పుటకును సంఘ సంస్కారములను దేశమంతటను వ్యాపింపజేయుటకును మా వివేకవర్ధనీ పత్రిక యమూల్యాయుధముగా నుండెను." అన్నారు వీరేశలింగంగారే.

ప్రతిపక్షులు ప్రదర్శించగలిగినంత కోపాన్ని ప్రదర్శించారు. పెట్టగలిగినన్ని కష్టాలు పెట్టారు. కానీ వీరేశలింగం చలించలేదు. శుష్కోపన్యాసాలవల్ల ప్రయోజనం లేదని ఆయన గ్రహించాడు. కేవలం ప్రహసనాలవల్ల సాధించగలిగిందేమీ ఉండదని తెలుసుకొన్నాడు. తాము నమ్మిన సత్యాన్ని, సిద్ధాంతాన్ని లోకానికి ఆచరణ సాధ్యమేనని నిరూపించాలి, చేసి చూపాలి ఏదైనను ఒక మేలు.

బోగం వాళ్ళకు కట్నాలు చదివించే పద్ధతి మాన్పించటమూ, శాఖా భేదాలు తగవని బోధించటమూ, మూఢ విశ్వాసాలు సాంఘిక వికాసానికి వేరుపురుగులని నచ్చచెప్పటమూ కొంతకాలము జరిగింది.

ఇంతకన్నా తీవ్రమైన సాంఘిక సంస్కరణలు ఆచరణలోకి తేవాలి. ఆంతరంగిక మిత్ర సమాజమంతా కటిబద్ధులైనారు. స్త్రీ పునర్వివాహాలు, వాటి సాంఘికావసరాలకు అనుగుణమైనవే అని ప్రచారం చేయాలి. ముక్కుపచ్చలారని బాల వితంతువులకు అవశ్యం మళ్ళీ పెళ్ళి చేయాలి. అని కూడ బలుక్కున్నారు. నాయకత్వం వీరేశలింగానిది. అంతకుపూర్వం చెన్నపట్నంలో స్త్రీ పునర్వివాహ ప్రవర్తక సమాజము ఒకటి తల ఎత్తింది. కాని, పనిమాత్రం చేయకుండా సమసిపోయింది. తెలుగుదేశంలో ధవళేశ్వరమనే చిన్న ఊళ్ళో వీరేశలింగమనే సంఘ సంస్కరణాభిలాషి ఉన్నాడన్న విషయం, చెన్నపట్నం సంఘ సంస్కరణ సమాజంవాళ్ళు గుర్తించలేదు.

1878 సెప్టెంబరు 8వ తేదీ రాజమహేంద్రవరంలో

మిత్రులతో కలిసి వీరేశలింగం సంఘ సంస్కార సమాజం స్థాపించాడు. ఆ సామాజంలో వివిధ విషయాలను గూర్చి వీరేశలింగం ఉపన్యసించేవాడు.

రాజమండ్రిలో చిత్రపు కామరాజనే గవర్నమెంటు ప్లీడరు, పోలూరి శ్రీరాములనే డిస్ట్రిక్టు మున్సబూ కలిసి, న్యాయస్థానాన్ని లంచాల శాలగా మార్చారు. దాని విషయమై వీరేశలింగం వివేకవర్ధనిలో వ్రాశాడు. ప్రభుత్వంవారు విచారణ జరిపించారు. గవర్నమెంటు ప్లీడరు తన నేరం రుజువు కావటంతో ఆత్మహత్య చేసుకొన్నాడు. క్రిమినల్ రికార్డు కీపరైన బొల్లాప్రగడ వెంకన్నగారిదీ, సిరస్తదారైన రొజారియో అనే యూరోపియన్‌దీ ఉద్యోగాలు ఊడిపోయినాయి. ఈ విచారణ బందరులో జరిగింది కొన్నాళ్ళు. ఈ రోజుల్లోనే అంటే 1878 సెప్టెంబరు 22వ తేదీన వీరేశలింగాన్ని కనిపెంచిన తల్లి పున్నమ్మ కీర్తిశేషురాలైంది. ఇన్ని కష్టాలలో దుఃఖాలలోకూడా వీరేశలింగం పూనిన పనిని విడిచిపెట్టలేదు. ఆ సంవత్సరం డిసెంబరు నెలలో వివేకవర్ధనిలో ఆయన ఇట్లా వ్రాశాడు:

“మేమీ పనిని (పత్రికా ప్రకటనమును) పూనుకొనుట దేశముయొక్కయు ప్రజలయొక్కయు క్షేమలాభముల కొరకే కాని ధనలాభమున కాశపడికాదు. లౌక్యాధికార ధూర్వహులయియున్న కొందరి దుశ్చేష్టలను వెల్లడి చేయటమువలన అట్టివారు మాకు శత్రువులుగా నేర్పడిరి. అయినను ఒకరి యనుగ్రహమున కపేక్షపడిగాని ఒకరి నిగ్రహమునకు వెఱచిగాని పత్రికా విలేఖత్వము ననుసరించి మాకు విధిగా నేర్పడిన కృత్యము నుండి తొలగకుండుట మా పూనికగాన, కొందరితో విరోధపడియైనను జనసంఘమునకు మేలు చేయగలిగితిమి గదాయని యానందించుచున్నాము.”

ఒక సందర్భములో వివేకవర్ధనిని గూర్చి చెపుతూ ‘వివేకవర్ధని పేరే భయంకరమై దుష్టాధికారులకు గర్భనిర్భేదక మయ్యెను’ అన్నాడు.

వీరేశలింగం ముఖ్యంగా రెండు రంగాలలో గొప్ప కృషి చేశాడు. ఒకటి స్త్రీ విద్యావ్యాపనం. రెండు వితంతు వివాహాలు. ఇక మూఢవిశ్వాసాలు తొలగించడం, కులాచారాలు సంస్కరించడం, ఏకేశ్వరోపాసనం ప్రచారం చేయడం, భూతప్రేతాలను గూర్చి యథార్థ జ్ఞానం కలగజేయడం, ప్రార్థనా మందిరాలు నిర్మించడం, పాఠశాలలు నెలకొల్పడం మొదలైనవి ఆయన ప్రధానంగా పనిచేసిన సంస్కరణలకు సహాయకంగా ఉన్నాయి.

1879 ఆగస్టు 3వ తేదీ వీరేశలింగం, వితంతు వివాహం శాస్త్ర సమ్మతమే అంటూ రాజమండ్రిలో మొట్టమొదట బహిరంగోపన్యాసం చేశాడు. దానితో ఆంధ్రదేశమంతా సంక్షోభం చెలరేగింది. వాదోపవాదాలు చెలరేగాయి. ఖండన గ్రంథాలు ఎందరో వ్రాసి ప్రచురించారు. వీటన్నిటికీ సమాధానంగా అదే సంవత్సరం అక్టోబరు 12వ తేదీన వీరేశలింగం రెండో ఉపన్యాసం చేశాడు. తమ సిద్ధాంతాలను పండితసభల్లో వాదించి నిలబెట్టుకోలేక వీరేశలింగాన్ని చుట్టుముట్టి కొట్టి కసి తీర్చుకొందామనుకొన్నారు ప్రతిపక్షాలవాళ్ళు.

రాజమండ్రిలో ఒకసారీ, కాకినాడలో ఒకసారి ఇట్లా జరిగింది. రెండుసార్లూ ఆయన్ను విద్యార్థులు కాపాడారు. మద్రాసులో ఒకసారి ఇట్లా జరిగింది. వనప్పాకం ఆనందాచార్యులుగారు, తమబండిలో ఎక్కించుకొని తీసుకొనివెళ్ళి వీరేశలింగాన్ని రక్షించవలసి వచ్చింది. విద్యార్థులాయనను కంటికి రెప్పలా కాపాడారు. ఏ పని చెప్పినా వెంటనే నిర్వహించేవారు. యువతరమే ఆయనకానాడు కొండంత బలం. వాళ్ళ అండదండలే ఆయన కార్యనిర్వహణ కెంతగానో తోడ్పడ్డాయి. వీరేశలింగం బోధనలు విని యువతరం చాలా ఉత్తేజాన్ని పొందింది. ఆయన ప్రారంభించిన సంఘ సంస్కరణలన్నింటిలో యువకులు ముందున్నారు. వితంతువులను వివాహమాడతామని విద్యార్థులు ముందుకు వచ్చారు. విరూపాక్ష పీఠాధిపతుల లోపాలన్నీ విద్యార్థులే బట్టబయలుచేసి రాజమండ్రిలో వారికి ఉప్పూ పత్రీ పుట్టకుండా చేశారు. సమాచారాలను సేకరించడంలోనూ, వాటిని అందించవలసిన వాళ్ళకు అందించి రావడంలోనూ, విద్యార్థులు వీరేశలింగాని కెంతగానో తోడ్పడ్డారు. నిప్పులోకి ఉరకమన్నా, నూతిలోకి దూకమన్నా సరేనని వాళ్ళు సిద్ధంగా ఉండేవాళ్ళని వీరేశలింగమే వ్రాశాడు.

చందాలు వసూలుచేసి రాత్రి పాఠశాలలు నిర్వహించి, కూలినాలి చేసుకొని పొట్టపోసుకొనే వాళ్ళకు చదువులు నేర్పారు. ప్రార్థనా సమాజ కార్యకలాపాలలో అత్యుత్సాహంగా పాల్గొనేవాళ్ళు. నిర్మాణ కార్యక్రమాలన్నింటిలో చేయూతనివ్వడానికి సంసిద్ధమే. చల్లపల్లి బాపయ్య, బసవరాజు గవర్రాజు వంటి కార్యశూరులు, సాహసులు, సంఘ సంస్కరణోత్సాహులు ఇంటింటికీ తిరిగి, స్త్రీ పునర్వివాహాలు జరిగితే భోజనానికి వచ్చే వారి పట్టికను సిద్ధం చేశారు. ఆత్మూరి లక్ష్మీనరసింహంగారు అప్పుడు రాజమండ్రిలో డిస్ట్రిక్టు మున్సిఫ్. న్యాపతి సుబ్బారావు కొత్తగా ప్రాక్టీసు పెట్టాడు. ఏలూరు లక్ష్మీనరసింహం పాఠశాలోపాధ్యాయుడు సంఘ సంస్కరణ కార్యక్రమాలపట్ల అత్యంతాభినివేశం చూపేవాడు.

ఆంతరంగిక మిత్రమండలి సమావేశమై, వితంతు వివాహాలు జరపటానికి నిశ్చయించింది. అయితే

పెళ్ళికొడుకూ, పెళ్ళికూతురూ కావాలి. వీరేశలింగం స్త్రీ పునర్వివాహ విషయమై వర్ణించిన సన్నివేశాలు ఏ అపరాధ పరిశోధక ఇతివృత్తానికీ తీసిపోవు. ఎదుర్కొన్న సాధక బాధకాలు రాత్రిళ్ళు ప్రయాణం చేయడం, ఊరూ పేరూ చెప్పకపోవడం, ఆడపిల్లలకు మగవేషాలు వెయ్యటం, మైళ్లకొద్దీ వాళ్ళను ఎత్తుకొని నడవటం, పగటిపూట దాక్కోవడం, రహస్యంగా ఉత్తరాలందించటం, ఇంటికి చేరిన బాల వితంతువులను కడుపులో పెట్టుకొని కాపాడటం, వితంతువుల బంధువులు, సంరక్షకులు ఫిర్యాదులుచేస్తే, అభియోగాలు తెస్తే పోలీసు అధికారుల చుట్టూ తిరిగి, వాటి బాధలు తప్పించుకోవడం, ఇవన్నీ సాహస గాథలు. ఊపిరి బిగబట్టి చదివే సంఘటనలు. ఉత్కంఠ కలిగించే సన్నివేశాలు.

చిత్రవిచిత్రమైన మానవ ప్రకృతులు. ఆసూయలు బలహీనతలు, ఆత్మవంచనలు, అహంభావాలు, దాంభిక ప్రదర్శనలు, సహాయం చేస్తామని ముందుకు వచ్చినవాళ్ళే, మాట ఇచ్చినవాళ్ళే, కావలసిన సమయానికి కూడిరాకపోవడం, పైపెచ్చు ఎన్నో చిక్కులు కలిగించడం, వంచన చేయటం ఇవన్నీ అనుభవించాడు వీరేశలింగం. అప్పటి పరిస్థితులలో అడుగు ముందుకు వేయడమే కష్టం. అటువంటిది సంఘ సంస్కరణ ప్రయాణంలో మైళ్ళు ముందుకు నడిచాడు. మైలురాళ్ళు స్థాపించాడు.

పైడా రామకృష్ణయ్యగారు కాకినాడలో సంపన్న గృహస్థు, సజ్జనుడు, ఉత్తమ సంస్కారి, ఆధునిక భావాలు కలవాడు. వీరేశలింగానికి అండగా నిలబడ్డాడు. తన జీవితకాలంలో ముప్పైవేలదాకా వితంతు వివాహాల నిమిత్తం ధన సహాయం చేశాడు. అయినా ఆయన కొనవరకూ పోరాడలేకపోయినాడు. ఎన్నో వత్తిడులు, అంతర, బాహ్య సంఘర్షణలు, కులభయం, వెలభయం, ప్రాయశ్చిత్తం చేసుకొన్నాడు. వీరేశలింగానికి అత్యంత ఆప్తులే ఆయనను విడిచిపెట్టారు. కొందరు వ్యతిరేక ప్రచారంకూడా చేశారు. ఆనాటి సాంఘిక పరిస్థితులటువంటివి. అయినా వీరేశలింగం జంకలేదు.

కృష్ణాజిల్లా, రేపూడి గ్రామం. రాజమండ్రినుంచి బయలుదేరి రేపూడి వెళ్ళి బాల వితంతువు పన్నెండేళ్ల పిల్లను తీసుకొని రావడానికి పన్నెండు రోజులు పట్టింది. సోమంచి భీమశంకరం కార్యసాధకుడు. ఆ పిల్లను తీసుకొని వచ్చాడు. ఇరవై రెండేళ్ళ గోగులపాటి శ్రీరాముల వరుడు. పన్నెండేళ్ళ గౌరమ్మ వధువు.

1881 డిసెంబర్ 11వ తేదీ శుభలగ్నం. సంస్థానాధిపతుల ఇంట జరిగే పెళ్ళిళ్ళకన్నా మహావైభవంగా జరిపించారు ఈ పెళ్ళి. వీధిలోనూ ఇంటి చుట్టూ పోలీసులు కాపలా వున్నారు. పెద్ద పెద్ద యూరోపియన్ అధికారులెందరో పల్లకీ వెంట పెళ్ళి ఊరేగింపుతో నడిచారు. బోగం మేళంకూడా ఉంటేకాని శోభలేదన్నారు. పెళ్ళి జరిగినట్లు కాదన్నారు. సంఘాన్ని జయించినట్లు కాదన్నారు. సాంఘికామోదముద్ర పడదన్నారు. ఆ వెలితి ఎందుకన్నారు. ధనసహాయం చేసే రామకృష్ణయ్య, బోగంమేళంకూడా తప్పకుండా ఉండవలసిందేను అంటున్నాడు అన్నారు. విధిలేక వీరేశలింగం అంగీకరించాడు. బహుజనాభిప్రాయం. ఇది పదిమందినీ కూడగట్టుకొని రావలసినపని. 'సరే మీ ఇష్టం వచ్చినట్లు చేసుకోండి. అయితే భోగం మేళం వాళ్ళు మా ఇంటిగడప చాయలకైనా రావటానికి నేనొప్పుకోను' అని ఖండితంగా చెప్పాడు. అట్లా అయితే ఊరేగింపులో పెడతాం, అన్నారు. ఆ విధంగా అది నాలుగురోజుల పెళ్ళి జరిగింది. చేస్తానని చెప్పిన దానిని చేసి చూపాడు. తెలుగుదేశంలో మొట్టమొదటి వితంతు వివాహం జరిగింది.

నాలుగు రోజులకే కన్నకడుపుకనక తండ్రికికూడా చెప్పకుండా, తన పన్నెండేళ్ళ కూతురిని తీసుకొని ఒక తల్లి వచ్చింది. తన పిల్లరాత చెడింది తలరాత చెరిపి తిరిగి రాయమని వీరేశలింగాన్ని కోరింది. శుభస్య శీఘ్రం అన్నాడు. వీరేశలింగం. వెంటనే పెళ్ళి జరిపించాడు. నాలుగురోజులు వ్యవధానంలోనే ఇద్దరు బాల వితంతువులకు మళ్ళీ మంగళసూత్రాలు కట్టించారు. ఈ పెళ్ళికూడా మహావైభవంగా జరిగింది.

అయితే ఏం! ఊరివాళ్ళు ఏం చేశారో చూడండి – "ఈ శుభ కార్యములయందు కొంచెము సంబంధమున్న వారినందరిని వారి కాపురమున్న యద్దె ఇండ్లలో నుండి లేవగొట్టిరి. కాపురముండుట కెవ్వరు నిండ్లనియ్యకుండిరి. నూతులలో నీళ్ళు తోడుకోనియ్యకపోయిరి. నీళ్ళు తెచ్చు బ్రాహ్మణులను లేకుండ జేసిరి. శుభాశుభ కార్యములకు పురోహితులను బ్రాహ్మణులను రాకుండ జేసిరి. దేవాలయములకు పోనియ్యకపోయిరి. బంధువులు మొదలైన వారిని వారి యిండ్లకు పోకుండ జేసిరి. కనపడినచోట్ల మొగము ముందరనే తిట్టసాగిరి."

సుమారు ఒక శతాబ్దం కిందటి సాంఘిక చరిత్ర ఇది.

ఉత్తుంగ తరంగితమైన సముద్రంలో ఎదురీత వంటిది వీరేశలింగం చేసిన పని. ఇళ్ళనుంచి వెళ్ళగొట్టిన వాళ్ళంతా వీరేశలింగం ఇంటిమీద వచ్చి పడ్డారు. వాళ్ళందరినీ ఆదరించవలసి వచ్చింది. నాయనమ్మ కూడా ఇంటినుంచి వెళ్ళిపోయి వేరింట కాపరం పెట్టింది. తల్లి లేనేలేదు. తండ్రి లేనేలేడు. ఇల్లాలికికూడా సహకరించవద్దని ఎందరో హితబోధ

చేశారు. కాని "ఉత్తమా ఇల్లాలు" వాళ్ళ మాటలు చెవిని పెట్టలేదు. అన్ని విధాలా భర్తకు అండదండలుగా నిలిచింది. ఈ రెండు పెళ్ళిళ్ళూ కాగానే వీరేశలింగానికెన్నో అభినందన లేఖలు వచ్చాయి.

రాజధాని నగరానికి వచ్చి ఉపన్యాసాలిచ్చి, సంఘ సంస్కరణ కార్యక్రమాన్ని నడిపించవలసిందిగా ఎందరు పెద్దలో ఆహ్వానించారు. వీరేశలింగం చెన్నపట్నం వెళ్ళాడు. ఉపన్యాసాలు చేశాడు. కులభేదాన్ని పాటించని విందులో పాల్గొని, మళ్ళీ రాజమండ్రి వచ్చాడు.

ఏడాది గడిచిపోయింది. మూడో వివాహం జరపలేకపోయినాను ఎట్లా? అని కలతచెందాడు. తీవ్రమైన ప్రయత్నాలు చేశాడు. అదివరలో సుముఖులుగా ఉన్నవాళ్ళు కూడా ఇప్పుడు విముఖులైనారు. అందరూ చాలా భయపడిపోయినారు. ధన సహాయం చేసిన రామకృష్ణయ్య, అనేక విధాల ఎంతో ప్రోత్సాహమిచ్చి తోడ్పడిన ఆత్మూరి లక్ష్మీనరసింహం వంటి విద్యాధికులే ప్రాయశ్చిత్తాలు చేయించుకొన్నారు.

అయినా ఎంతో శ్రమపడి మూడో వితంతు వివాహం నిర్వహించాడు వీరేశలింగం. మొదటి రెండు వివాహాల మాదిరిగానే మహావైభవంగా జరిపించాడు. సనాతనులకు, ప్రతిపక్షులకు కడుపు మండిపోసాగింది. పెళ్ళి ఊరేగింపుమీద రాళ్ళు రువ్వారు. అయినా వీరేశలింగం సహించాడు.

అటు తరువాత నాలుగో వితంతు వివాహం నిర్వహించాడు. ఐదోది నిర్వహించాడు. వంట బ్రాహ్మణులు సహాయ నిరాకరణం చేశారు. ఎవరూ రాలేదు. రాజ్యలక్ష్మమ్మ గోదావరికి వెళ్ళి నీళ్ళు మోసుకొని తేవాల్సి వచ్చింది. పెళ్ళివారికి వంటచేసి పెట్టవలసి వచ్చింది. ఆమె వీరేశలింగానికి తగిన ఇల్లాలు.

ఏడో వివాహం జరిగే కాలానికి, రాజమండ్రి ప్రజలందరికీ వితంతు వివాహాలు అలవాటుపడి, పాతపడిపోయినాయి. రక్షకభటుల అవసరం లేకపోయింది. విద్యార్థులు మాత్రం సహాయంగా పెళ్ళి పల్లకి వెంట నడిచారు.

మూడేళ్ళలో మొత్తం పన్నెండు వితంతు వివాహాలు జరిపించాడు. అంటే మొదలు పెట్టిన నాటినుంచీ సుమారుగా మూణ్ణెల్ల కొకటి నిర్వహించాడన్న మాట. ఇందులో కొన్ని చెన్నపట్నంలో నిర్వహించాడు. గొప్ప గొప్ప ప్రభుత్వాధికారాలలో ఉన్నవాళ్ళు, విశేషించి సంపన్నులు, సాంఘికంగా బలవంతులూ అయిన సంఘసంస్కార పక్షావలంబకులే ఎందరో ప్రాయశ్చిత్తాలు చేయించుకొని వీరేశలింగాన్ని విడిచివేశారు. ఆయన పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించిన అభిమానపుత్రుడే ప్రాయశ్చిత్తం జరుపుకొన్నాడు. కన్న ప్రేమకన్నా పెంచిన మరులు మిక్కుటంకదా. రాజ్యలక్ష్మమ్మగారు చాలా బాధపడి ఉంటుంది. ఎంతగానో పరితపించింది. అయినా వీరేశలింగం చలించలేదు.

మూడో వితంతు వివాహం కాగానే కలకత్తా నుంచి ఈశ్వరచంద్ర విద్యాసాగరులు వీరేశలింగానికి అభినందన సందేశం పంపించారు. ఒక్క తెలుగుదేశంలోనే కాక, దక్షిణ దేశమంతటను వీరేశలింగం పేరు ప్రఖ్యాతి పొందింది.

ఈ విధంగా స్త్రీ పునర్వివాహోద్యమాన్ని నడిపిస్తూనే, సమస్త ప్రజాహిత కార్యకలాపాలలో వీరేశలింగం ముందు నిలుస్తూ వచ్చాడు. గ్రంథ రచన నిరంతరాయంగా కొనసాగిస్తూనే వచ్చాడు. కొత్త కొత్త విరోధాలతో, బలవంతులైన విరోధులతో ఢీకొంటూ వచ్చాడు. స్త్రీ పునర్వివాహ సమాజంకోసం చందాలు వసూలు చేయటానికి వివిధ ప్రాంతాలు సందర్శిస్తూ వచ్చాడు. పురపాలక సంఘ కార్యకలాపాలలో ప్రధానపాత్ర వహిస్తూ వచ్చాడు. తనకు ధర్మమని న్యాయమని తోచినప్పుడు యూరోపియన్లే అయినా పెద్ద పెద్ద అధికారులే అయినా ఏ మాత్రమూ లక్ష్యపెట్టలేదు. రాజమహేంద్రవరం అభివృద్ధికి సంబంధించి పురపాలక సంఘ సభ్యులూ, అధికారులూ కలిసి రాకపోయినా, పురపాలక సంఘాధ్యక్షులే వ్యతిరేకించినా, వీరేశలింగం పట్టు విడవకుండా, తాను అధ్యక్ష ప్రతినిధిగా ఉన్న కాలంలో, ఎంతో పనిచేసి చూపించాడు.

ఆత్మూరి లక్ష్మీ నరసింహంగారి వంటి ఆప్తుల విరోధులైనారు. న్యాపతి సుబ్బారావుగారి వంటి మిత్రులతో వైమనస్యం సంభవించినది. ఏలూరి లక్ష్మీనరసింహంగారి వంటి సహాయులతో వైరం వచ్చింది. బసవరాజు గవర్రాజు వంటి ప్రాణమిత్రులు పరలోకగతులైనారు. ఒంటరివాడైనాడు. అయినా అహర్నిశలూ భాషాభివృద్ధికే, దేశాభివృద్ధికే కృషి చేశాడు.

'వీరేశలింగంగారికి ప్రఖ్యాత రచయిత వాల్టేరుతో సరిసమాన స్థానాన్నివ్వవచ్చు. వాఙ్మయం ఆయన సేవాపత్రానికి ఆయుధంలా పనిచేయగలిగింది. ప్రఖ్యాత గ్రీకు గ్రంథకర్త హెయిను తన సమాధిపైన ఆయుధాన్ని చిత్రించమని కోరాడు. వీరేశలింగంగారికి చాలాకోపం వచ్చేదట. సహించేవాడు కాదట – రామలింగారెడ్డిగారే వ్రాశారు. మానసికంగా వీరేశలింగం ఎప్పుడూ నిత్య యవ్వనుడు. సమధిక కార్యోత్సాహిశీలి. ఆయన జీవిత కాలమంతా అట్లానే గడిచింది.

❖




# ప్రహసన ప్రయోక్త కందుకూరి వీరేశలింగం

*కొక్కొండ వెంకటరత్నం పంతులు వీరేశలింగం వివేకవర్ధని పత్రికను పరిహసించే ఉద్దేశంతో హాస్యవర్ధని అన్న పత్రికను స్థాపించితే దానికి ప్రతిగా ఆయన తిరిగి హాస్య సంజీవని ఆరంభించారు. వాటిలో వెలువడినవే ప్రహసనాలు. ఉత్తరోత్తరా తెలుగులో హాస్య సంజీవని అన్న మాట కూడా స్థిరపడిపోయింది. అత్యాధునిక నాగరిక కాలమనుకుంటున్న ఈనాటికి కూడా వెన్నాడుతున్న మూఢత్వాన్ని గమనంలో వుంచుకుంటే ఈ ప్రహసనాల ప్రాధాన్యత మరింత బోధపడుతుంది.*

కందుకూరి వీరేశలింగం సంఘ సంస్కర్తగా తెలుగువారి వేగుచుక్క. మూఢత్వాన్ని, దంభాచారాలను చీల్చి చెండాడిన సాహసికుడు. ఇప్పుడు పునర్మూల్యాంకనాల పేరిట కొందరు ఆయన విశిష్టతను పరిమితం చేస్తుండవచ్చు గాని నేటికీ ఆయన కృషి మార్గదర్శకంగానే ఉంటుంది. అంధ విశ్వాసాలు, కులతత్వాలు, అవినీతి, అవలక్షణాలు, దురాచారాలపై ఆయన ప్రత్యక్ష పోరాటం చేయడమే గాక ప్రహసనాల ద్వారా పిడుగులు కురిపించారు. అందులో అనేకం ప్రసిద్ధంగా ప్రజల నాల్కలపై నాట్యమాడటం స్వయంగా గమనించి ఆనందపరవశు డయ్యాడు. వేశ్యాలోలత్వం, బాల్య వివాహాలు, బహు భార్యత్వము, ప్రజా ధనాపహరణం, టక్కరితనం, పటాటోపం వంటి సాంఘిక జాడ్యాలకు పాల్పడే వారి పోకడలను తూర్పార పట్టే పలు సంభాషణాత్మక ప్రహసనాలు ఆయన అందించారు. ఇప్పుడు చదివితే అవి శిల్పంలో తేలిగ్గా కనిపించవచ్చు గాని నూటయాభై ఏళ్ళకు పూర్వం గురజాడ కన్యాశుల్కం కన్నా బాగా ముందే రాయడం గుర్తుంచుకుంటే వాటి విలక్షణత తెలుస్తుంది.

వీరేశలింగం అనగానే వితంతు పునర్వివాహాలు ప్రధానంగా గుర్తుకొస్తాయి గాని సమాజంలో పేరుకుపోయిన ప్రతి చెడునూ ఆయన చీల్చి చెండాడాడు. ఆచారాలు, శాస్త్రాల పేరిట సాగిన బూటకాలను పటాపంచలు చేశారు. పెద్ద మనుషుల అల్పబుద్ధులను బదాబదలు చేశాడు. ఆనాటికి అది గొప్ప సాహసమే. ఈనాటికి కూడా వాస్తు పేరిట, శకునాల పేరిట సాగే తతంగాలను చూస్తూనే వున్న మనం వీరేశలింగం అన్నేళ్ళ కిందటే వాటిని వినోదాత్మకంగా, విశ్లేషణాత్మకంగా చెప్పిన తీరుకు విస్తుపోకుండా ఉండలేము. వ్యాధులకు చికిత్స అవసరం గాని మందులతో తగ్గదని మరో ప్రహసనం. గ్రహణాల చుట్టూ అల్లుకున్న నమ్మకాలపై మరో మతాబు చూస్తే ఇస్రో అధినేత ప్రదక్షిణలు గుర్తుకు వస్తాయి. కులతత్వాలను కూడా అప్పటికే ప్రస్తావించారు. మున్సిపల్ కాంట్రాక్టులలో కమిషన్ల పర్వాన్ని ఎత్తిచూపించారు. బ్రహ్మ వివాహము అనే ఆయన ప్రహసనం పెద్దయ్యగారి పెండ్లి పేరిట ప్రజాదరణ పొందింది. వ్యవహార ధర్మ బోధినిలో కోర్టు వ్యాజ్యాల తీరుతెన్నులు చూపించారు. ఇవి చాలా పెద్దవి, సుపరిచితమైనవి. అంత ప్రచారం పొందక పోయినా నేటికి కూడా వర్తించే సంక్షిప్త రూపాలే మిగతావన్నీ. ఈనాటి ప్రమాణాలతో పోలిస్తే ఇందులో భాషా ప్రయోగాలు కొన్నిచోట్ల ఇబ్బందిగా అనిపించినా నాటి చారిత్రక పరిస్థితిని, ఆలోచనా ధోరణిని తెలియజేసేవిగానే వాటిని చూడవలసి వుంటుంది. "కోపోద్రేకము చేత నా చిత్తము నాకు వశము గాక హాస్య రస ప్రవాహము వెల్లువగా బారెను. అందు ఉపయోగించిన నిందాగర్భితములైన వాక్యములు సువిచార స్థితి యందు నేను

ఉపయోగింపదగనివే వున్నవి" అని ఒక సభను ఉద్దేశించి చేసిన ప్రసంగంపై ఆయన రాసుకున్నారు. ఈ లక్షణం ప్రహసన భాషలోనూ అక్కడక్కడ కనిపిస్తుంది.

కొక్కొండ వెంకటరత్నం పంతులు వీరేశలింగం వివేకవర్ధని పత్రికను పరిహసించే ఉద్దేశంతో హాస్యవర్ధని అన్న పత్రికను స్థాపించితే దానికి ప్రతిగా ఆయన తిరిగి హాస్య సంజీవని ఆరంభించారు. వాటిలో వెలువడినవే ప్రహసనాలు. ఉత్తరోత్తరా తెలుగులో హాస్య సంజీవని అన్న మాట కూడా స్థిరపడిపోయింది. అత్యాధునిక నాగరిక కాలమనుకుంటున్న ఈనాటికి కూడా వెన్నాడుతున్న మూఢత్వాన్ని గమనంలో వుంచుకుంటే ఈ ప్రహసనాల ప్రాధాన్యత మరింత బోధపడుతుంది.

ఈ ప్రహసనాలు కొన్ని ప్రస్థానం పాఠకుల కోసం...

## ఆచారము

**(చాదస్తపు చెలమమ్మా, ఆచారపు అన్నమ్మా ప్రవేశించుచున్నారు)**

చెల: అన్నమ్మ తల్లీ ! ఈ కాలపు వాళ్లకు బొత్తిగా ఆచారమన్న మాట లేదు మరీ నా కోడలు కాపురానికి వచ్చిన తరువాత ఇంట్లో వట్టి మాలకూడు కలుస్తూ వున్నది. ఇక మనవంటివాళ్లం బ్రతకకూడదు. ఏమైనా అంటే యెదురుకెదురు నాకే చాదస్తమంటారు.

అన్న: చెల్లమమ్మా ! చెపితే నమ్ముతావో లేదో కాని అరవై యేళ్లుదాటినా మా ఇంటి ఆయన ఇప్పటికీ ఆచారమన్నమాట యెరగడు. నేను మాత్రం ఎలాగోలాగో కొంచెం ఆచారం నిలుపుకొంటూ వున్నాను. మా వీధిలోనుంచి ముట్టువాళ్లు వెళితే రెండు వందలు తిట్టి మా ఇంట్లో కుండలన్నీ తీసిపారవేస్తాను. సగంముప్పాతిక పాళ్లు నా నోటికివెరచి వాళ్లు చాకిరేవుకు అవతలవీధి నుంచి చుట్టు తిరిగిపోతారు. ఉప్పు మొదలుకొని సమస్తవస్తువులూ రోజూ కడిగి శుద్ధిచేస్తాను. మా వారు వీధిలోంచి వచ్చేటప్పటికి యెదురుగుండా చెంబెడు పేణ్నీళ్లు కలుపుకునివెళ్లి మీదపోసి శుద్ధి అయిన తరువాత మరీలోపలికి రానిస్తాను. మొన్న శీతాకాలములో రాత్రి చలివేళ మీద పేడనీళ్లు పోసినానని కోపం వచ్చి నామగడు మూడు నెలలు ఇంటికిరాక లేచిపోయినాడు. పోనీపొమ్మని వూరుకున్నాను. మనకు గోమయం వేస్తేకానీ ఏదీ శుద్ధికాదు కదా?.

చెల: నీవు అదృష్టవంతురాలవు గనుక వొక్క మోస్తరుగా ఆచారం జరుపుకుంటూ వున్నావు. నాకు నీలాగు జరగదు. అక్కడికీ నేను రోజుకు రెండువందల స్నానాలు చేస్తాను. ఈ వేళ మట్టుకు ఇప్పటికి పదిస్నానాలు చేసినాను. తెల్లవారిలేచి దొడ్లోకి వెళ్లినప్పుడు కాలి కింద ఏమో మెత్తగా తగిలితే అది యేమిగుడ్డో అని తలనిండా స్నానము చేసినాను. తరువాత మా కోడలు దగ్గర నుంచి వెళ్లినప్పుడు పైటకొంగు తగిలినట్లు అనుమానం కలిగి మళ్లీ స్నానం చేసినాను. గోదావరికెళ్లి స్నానం చేసి బిందెయెత్తుకొని వస్తూ బట్టలుతుక్కునేవాళ్ల నీళ్లు పడ్డట్లు తోచి మళ్లీ వెళ్లి మునిగినాను. తీరా వడ్డుకు వచ్చేటప్పుడు నీళ్లలో కాలికేదో ఆకుతగిలి అంటతప్పేలాలు తోమేవాళ్లు వేసిన అంటాకని నీళ్లు పారపోసి వెళ్లి మళ్లీ స్నానము చేశాను. తరువాత బిందెత్తుకుని సగం దూరం వచ్చేటప్పటికి ఇరవైగజాల దూరములో మాలవాడు కనబడి నీళ్లు నడివీధిలో పారపోసి వాణ్ని నాలుగు తిట్టి వాడి జీవానికి నసూరు మంటూ మళ్లీ వెనకకు గోదావరికెళ్ళి స్నానము చేసి




నీళ్లు తెచ్చుకున్నాను. ఇంటికి వచ్చిన తరువాత పొయ్యిమీద యెసరుపెట్టి దాసీది తోమితెచ్చిన గరిటె తొలుచుకోబోయి దానిని మసి వదలనందున నూతి దగ్గర మళ్లీ స్నానం చేసినాను. ఆ అంట్లతప్పేలాలలో ఒకటి తీసుకుని వెళ్లి మా కోడలు లోవలపెట్టినందున, ఇంట్లో వస్తువులన్నీ తడుపుకొనేటప్పటికి జాముయినది. తీరా వంట చేసుకుంటూ వుండగా బల్లిమీదపడి వకమాటున్ను, శూద్రవాళ్ల మాట వినబడి వక మాటున్నూ, రెండు స్నానాలు చేసినాను. ఈలోగా అన్నం చిమిడిపోయింది. వేగిరం మునిగివచ్చి అన్నంతప్పేలా దింపి, ఆ పొయ్యి మీద కూరవేసి గంజివార్చుకున్నాను. ప్రొద్దుటి నుంచీ మడికట్టుకుని కూర్చున్నందున కడుపుబ్బి అవతలకు పోవలసివచ్చి, ఆఖరు స్నానము చేసినాను. ఎన్ని స్నానాలయినవో లెక్క పెట్టినావా?

అన్న: చాలా స్నానాలు చేసినావు. నేను నీకంటే పదిరెట్లు

స్నానాలు చేశాను. మా ఇంట్లో కుక్కవచ్చి అప్పుడప్పుడూ యేమైనా ముట్టుకొనిపోతూ వుంటుంది. అప్పుడు వస్తువులన్నీ దూరముగా పారవేసి, ఇల్లు శుద్ధిచేసి గోమయం పూసుకుని నాలుగు స్నానాలు చేస్తాను.

చెల: నేను మునుపెప్పుడయినా మా దొడ్లోకి గాడిద వస్తే రాయిపుచ్చుకుని కొట్టి వూరకుండేదాన్ని. నీవు మొన్న చెప్పినప్పటి నుంచి ఒక వేళ పరాకున మునపటి అలవాటుచొప్పున రాయివిసిరినా వెంటనేపోయి స్నానం చేస్తాను. నీవు మునుపు రోజూ గోమయం తినేదానవు ఇప్పుడు తింటూవున్నావా?

అన్న: పెద్దదాని నయినాను. మునుపటిలాగు తినలేను. అక్కడికీ మూడుపూటలూ కలిపి వుసిరికాయంత ఉండ కళ్లుమూసుకుని మింగుతాను. గోమయం యెంత తింటే అంతపుణ్యము. గోవు అల్పాచమానం చేస్తూవుండగా వెళ్లి తోకతో నెత్తిమీద చల్లుకుని పంచితం మూడుపుడిసిళ్లు లోపలికి పుచ్చుకుంటే మరీ పుణ్యము. అలాగు విడవకుండా ఆరు నెలలు ప్రతిరోజూ పుచ్చుకుంటే బొందెతో స్వర్గం వస్తుందట. అలా ఎవరికీ లభించదు. మొన్న నేతి వారింటికి పొద్దున్నే పేడకు వెళ్లేటప్పటికి వారి తెల్లావు అల్పాచమానం చేస్తూవున్నది. పంచితం నెత్తిమీద చల్లుకోవలెనని వెనుకకు వెళ్లి తోకపట్టుకునేటప్పటికి మొఖంమీద ఒక్క తన్ను తన్నింది. దానితో వెనక్కు పడి ఒక్క బొట్టయినా మీద చల్లుకోకుండానే ఇంటికి వచ్చినాను.

చెల: నీవు మూడుదినాల బట్టీ మొగానికి సున్నపుపట్టు వేస్తూ వున్నావు. అందుచేతనేనా?

అన్న: అవునందుచేతనే. అప్పుడు, నెత్తురువచ్చి గాయమైనది. తడిబట్ట కట్టుకుంటే గాయం చీంపోస్తుంది. పట్టుబట్టకట్టుకోమని మా వారు మూడు రోజుల బట్టీ పోరుతూ వున్నారు. రోజూ ఉతికి ఆరవెయ్యకుండా పట్టుబట్ట మడికి పనికివస్తుందేమో నీకేమైనా తెలుసునా?

చెల: పనికివస్తుందని పెద్దలు చెప్పుతారు. భోజనము చేసి విడిచిన తరువాత దర్భాసనంలో కడితే దానికి యెన్నాళ్లయినా మయిల లేదుసుమా. మా అబ్బాయి పట్టు బట్ట నేను ఆరు నెలలకు ఒక పర్యాయం ఉతుకుతాను. అప్పుడు దానిలోనుంచి నాలుగు కుంచాల మురికి పోయి జిడ్డు నీళ్లల్లో తేలుతుంది.

అన్న: మడి బట్ట అంటే జ్ఞాపకం వచ్చింది. దక్షిణాది వాళ్లకు బొత్తిగా మడిలేదు. ఆ దేశములో శుద్ధ అనాచారం. మొన్న మా ఇంటికి ఒక దక్షిణాది బ్రాహ్మడు భోజనానికి వచ్చాడు. తెల్లగా పువ్వులాగు చాకలిది ఉతికి తెచ్చిన బట్ట కట్టుకుని ఊరంతా తిరిగొచ్చి ఆ బట్టతో విస్తరి దగ్గర కూర్చున్నాడు. ఇదేమంటే తాను కట్టుకున్న తరువాత విడువలేదు. తనది మడిబట్టే అంటాడు. వాడికేమి చేటుకాలం వచ్చిందో కాని ప్రొద్దున్నే గోదావరి ఒండునీళ్లలో ముంచి తెచ్చుకున్న నా పంచెచూచి కావలిస్తే నీది మయిల బట్ట అన్నాడు.

చెల: నీళ్లు లేకపోయినా కానీ ఒక్కసారి బురదలో అయినా ముంచి విడిచి ఆరవేస్తే మడిబట్ట అవుతుంది. ఆ దేశపు వాళ్లకు మడంటే ఏమిటో మయిలంటే ఏమిటో తెలియదు.

అన్న: వుండు నీతో మాట్లాడుతూ పరాకున గోడమీద చెయ్యి వేస్తే బల్లితోక కావల్సును చేతికి తగిలింది. అదుగో గోడమీద మాల బల్లి పాకుతూ వున్నది. నేను వెళ్లి స్నానం చెయ్యవలెను. నాలుక ఇగిరిపోతూ వున్నది. స్నానం చేస్తేనేగాని నోట్లో మంచినీళ్ల చుక్కపోసుకో వల్ల కాదు.

చెల: నీవు నన్ను తగలలేదుగదా నేను కూడా స్నానం చెయ్యవలెను.

అన్న: నేను దూరంగానే ఉన్నాను కాని, అయినా ఎందుకైనా మంచిది గోదావరిలో ఒక్క మునక వేసి నీ సందేహం తీర్చుకుని మరీ వస్తూ

(అని ఇద్దరునూ వెళ్లుచున్నారు).

## అపాత్రదానము

**ప్రదేశము - రాజవీధి**

**(వెంకటావధానులు ప్రవేశించుచున్నాడు.)**

వెంక: (తనలో) భోజనమునకు తడుముకోనక్కర లేకుండా పది గంటల కల్లా వాది రెండు కూరలతో వంట చేయిస్తూవున్నాడు కదా? సాక్ష్యం ఇవ్వడానికి పుచ్చుకున్న నాలుగు రూపాయలలోనూ, ఒక్క చిల్లిగవ్వ ఖర్చు పెట్టను. రాత్రి వెళ్లిన ముండ ప్రతిమాటు పావలాకు తక్కువ పుచ్చుకోదు. దాని దగ్గర సంకటావులున్నవేమోనని భయంగా ఉంది. అయినా కానీ ఫర్వాలేదు. అధమం ఈ రాత్రికి కావలసిన నాలుగు అణాలయినా ఈ పూట ఈ ఊళ్లో సంపాదించవలెను. ఇవాళ సాక్ష్యం అయితే రేపు సాయం కాలానికి మా ఊళ్లో కుశలంగా వుంటాను. ఆ వచ్చే చిన్నవాణ్ణి ఈ ఇల్లు ఎవరిదో అడుగుతాను.

(ఒక చిన్న వాడు ప్రవేశించుచున్నాడు.)

వెంక: అబ్బాయీ! ఈ ఇల్లు ఎవరిది?

చిన్న: కోర్టు నాజరు రామదాసు పంతులుగారిది

వెంక: వారి ఇంటిపేరు ఎవరు?

చిన్న: వాడ్రేవువారు.

వెంక: ఆయన తండ్రి పేరు ఏమిటి?

చిన్న: భీమరాజుగారు కాబోలును. నేను బజారుకెళ్లవలెను.

(అని వెళ్లుచున్నాడు)

వెంక: (లోపలికెళ్లి) అయ్యా ! రామదాసు పంతులుగారండి, నేను చదువుకొన్న బ్రాహ్మణ్ణి తమ దర్శనం నిమిత్తం వచ్చినాను.

రామ: (లోపలి నుండి వచ్చి) మీదేవూరయ్యా?




వెంక: మాది పడమట కృష్ణాతీరమండి. నేను జటాంతమూ వేదం అధ్యయనం చేసినానండి. మా తండ్రిగారు చయనం చేసినారు.

రామ: మీరు ఈ గ్రామం ఎందుకు వచ్చినారు?

వెంక: కాశీయాత్రకు వెళ్లవలెనని బయలు దేరి వస్తుండగా మధ్య యేలూరు దాటిన తరువాత దొంగలు కొట్టి నా దగ్గర వున్న ఝూరీ చెంబూ, నాలుగు బట్టలూ, పది రూపాయల రొక్కమూ దోచుకుని పోయినారండి. నేను ఇప్పుడు కట్టుగుడ్డలతో ఈ గ్రామం వచ్చినాను. చేతిలోకి చెంబులేదండి. తమకీర్తి జగద్విశ్రాంతమైనదండి. మీరు దానకర్ణులు. తమరిని చూస్తే నా దరిద్ర విమోచనం అవుతుందని చంద్రుడికోసం చకోర పక్షులు వెతుక్కుంటూ వచ్చినట్టు నేను మా ఊరు బయలుదేరినప్పటి నుంచీ దోవ పొడుగునా మిమ్మే స్మరించుకుంటూ వచ్చినాను. తమరు బహు దొడ్డ బ్రాహ్మలు.

రామ: మీరు ఇప్పుడు యేమంటారు?

వెంక: చెంబు మాత్రము మీరు కొనిపెట్టవలెను. కాశీ రామేశ్వరముల దాకా రామదాసు పంతులుగారు చెంబు కొని పెట్టినారని చెప్పుకుంటాను. తమ పేరు శాశ్వతంగా వుంటుంది. అయ్యా ! తమకు వాడ్రేపు భీమరాజుపంతులుగారు ఏమవుతారండీ?

రామ: వారు మా తండ్రిగారు.

వెంక: అలా చెప్పండి. భీమరాజు పంతులుగారంటే లోక ప్రసిద్ధి. ఇన్ని దేశములు తిరిగినానుకాని ఆయన వంటిదాతను నేను మరెక్కడా చూడలేదు. మొదటినుంచీ మీ వంశమే అటువంటిది.

రామ: మా అన్నగారు మీ జిల్లాలో తహసీలుదారీ చేసినారు. మీరాయనను ఎరుగుదురా?

వెంక: ఏ తాలూకానండీ?

రామ గుడివాడ తాలూకాకు,

వెంక: వారి నామధేయం?

రామ వెంకటచలంగారు.

వెంక: ఓ హోహో ! వాడ్రేపు వెంకటాచలం పంతులుగారు మీ అన్నగారండీ? వారిని ఎరుగకపోవలెనూ! వారు నిరతాన్న ప్రదాతలు. మా జిల్లాలో అంతటా వారి పేరు వినికిడిమోసినది. ఆయనకు చదువుకున్న బ్రాహ్మణ్ణి అని నాయందు పరమభక్తి. ఆయనది కేవలం ఈశ్వరావతారం.

రామ: ఓయి బంట్రోతు వీధిలో ఎవ్వరో కేకలు వేస్తూ వున్నారు చూడు.

బంట్రో: ఇద్దరు గుడ్డివాళ్లండి. ముష్టి పెట్టమని కేకలు వేస్తూ వున్నారు.

రామ: గాడిదెకొడుకులను అరవకుండా అవతలికికొట్టు. ఈ ఊరు గుడ్డివాళ్లతోను, కుంటివాళ్లతోను నిండిపోయింది. తెల్లవారి లేస్తే ముష్టిముష్టి అని నిలువ నియ్యకుండా వున్నారు.

బంట్రో: అందులో ఒకడు బహు ముసలివాడండి. కప్పుకోవడానికి బట్టసమేతూ లేదండి. చలిచేత వణుకుతూ వున్నాడు.

రామ: ముసలవాడూ లేడు గిసలవాడూ లేదు. వాళ్లను అవతలికి గెంటి ఈ రూపాయ మార్చి ఈ బ్రాహ్మణుడికి పావలాయిచ్చి తక్కిన మూడు పావలాలూ పట్టుకునిరా.

వెంకు: మరొకరి ద్రవ్యం కలవకుండా చెంబుకు కావలసినది తమరు దయచేయించవలెను. ఒక్క రూపాయి పావలా అయితే సరిపోతుంది.

రామ: ఏమిటో మాకు తోచింది మేమిచ్చినాము. తక్కినది మరొక చోట యాచించండి.

వెంక: "యాచ్నా మోఘా పరమ ధిగుణే నాధమే లబ్ధకామా" అన్నాడండి. లేదనిపించుకొన్నా నేను తమవంటి పుణ్య పురుషులను యాచిస్తానుగాని లక్ష వచ్చినా నీచులను యాచించనండి. తమరైతే గొప్ప ధర్మాత్ములే. మీ సొమ్ము నాకింతే ప్రాప్తమున్నది.

రామ: ఈ బ్రాహ్మడికింకో రెండణాలు కూడా ఇవ్వు.

బంట్రో: చిత్తము. (ఇద్దరునూ వెళ్లుచున్నారు.)

వెంక: (వీధిలో) ఈ గచ్చరుగుల ఇల్లెవరిదోయి?

బంట్రో: జోస్యుల-భీమయ్యగారిది.

వెంక: ఆయనకేమి పని?

బంట్రో: ఏమీ పనిలేదు డబ్బుగలవాడు. జూదమాడి రోజుకు నాలుగు రూపాయలు గెలుస్తాడు. నెలకు ఇరవై రూపాయల జీతం ఇచ్చి ముండను వుంచినాడు.

వెంక: ఆ రూపాయి ఈలాగియ్యి. తక్కిన పదణాలూ నేను ఇస్తాను. (అని బొడ్డుకొంగు మూటతీసి చిల్లర ఇచ్చి రూపాయి పుచ్చుకుని బంట్రోతును పంపివేయుచున్నాడు.)

వెంక: (లోపలికి వెళ్లి సావిట్లో కూర్చున్న ఒక నల్లని మనిషిని చూసి) తమరేనా? భీమయ్యగారు? తమ దర్శనం చేసి కృతార్థుణ్ని అయినాను. ఇదివరదాకా తమ ఖ్యాతి వింటూ రావడమే కాని ఎప్పుడూ దర్శనం మాత్రం చెయ్యలేదు. ఇప్పుడు తమ మూర్తిని చూస్తే నాకు విన్నదానికీ ఇప్పుడు చూచినదానికీ సరిపోయినది. వుంటారు లోకములో మహానుభావులు! మీరు చూడబోతే ఇంత వున్నారు. మీ కీర్తి చూడబోతే మూడులోకములూ నిండినదేమండీ?

భీమ: శాస్తుర్లుగారూ! మీదేవూరండీ?

వెంక: పడమట కృష్ణాతీరమండీ. కాశీయాత్ర వెళ్లుచూ వచ్చినానండి. దారిలో దొంగలు కొట్టినారండి. మహారాజులు తమరు ఒక వస్త్రం దయ చేయిస్తారని తమకీర్తి విని వచ్చినాను. నెలకురెండు వందల రూపాయలు తెచ్చుకునే ఉద్యోగస్తులు కూడా దాతృత్వంలో మీలో సహస్రాంశమైనా పోలరు.

భీమ: మీరు చేతిలో డబ్బు లేని సమయంలో వచ్చినారు. నిన్న వచ్చినట్టయితే నేనే మంచి పంచెల సాపు కొనిపెడుదును. అయినా కానీ ఈ రూపాయి పుచ్చుకుని ఒక సైనుపంచె కొనుక్కోండి.

వెంక: చిత్తము. చిత్తము నాకు ఇదే పదివేలు. రామదాసు పంతులు నాజరీ చేస్తున్నాడన్న మాటేకానీ ఒక్క పావలా ఇచ్చేటప్పటికి పెద్దలు దిగి వచ్చినారు. లోకములో దానకర్ణులన్న మాట తమకేచెల్లింది.

భీమ: శాస్తుర్లుగారూ! నమస్కారము.

వెంక: బహుధనకనక వస్తువాహన సమృద్ధిరస్తు. అష్టపుత్ర బహుధనమస్తు. (అని వీధిలోకి వెళ్లి తనలో) కోర్టు వేళ కావచ్చినది. వేగిరం వెళ్లవలెను. ఈ పూట రూపాయి ఆరణాలు దొరికినవి. ఎప్పుడూ నేను బోగందానితో వెళ్లలేదు. ఈ రాత్రి ఈ రూపాయి ఇచ్చి బోగందానితో వెళ్తాను. పట్నవాసాలలో బోగంవాళ్లు బహు అందముగా వుంటారు. ఇంకొక సాక్ష్యం దొరికితే బాగా వుండును. మరి నాలుగు రూపాయిలు సంపాదిస్తును.

(అని వెళ్లుచున్నాడు)

## హిందూ మహాజనుల మత సభ

**(శైవులు, వైష్ణవులు, మాధ్వులు, స్మార్తులు మొదలైన హిందూ బ్రాహ్మణ మహాజనులు సభ చేరియుండగా లౌకిక వ్యవహారములోనున్న ఒక శాస్త్రులవారు ప్రసంగించుతున్నారు)**

శా: ఇంత మంది ఇన్ని తెగలవారు ఒక్క చోట ఈ ప్రకారంగా సమావేశం కావడం చూస్తే హిందువులలో ఉండే ఐకమత్యము మరెవరిలోనూ కూడా లేనట్లు స్పష్టమవుతున్నది. ఇటు వంటి ఐకమత్యం మనలో వున్నది గనుక మధ్య మధ్య ఎన్ని అవాంతరాలు వచ్చినా ప్రభుత్వాలు ఎన్నిమారినా మన వేదచోదితమైన మతం ఎన్ని మ్లేచ్ఛ మతాలవారు పాడుచెయ్యడానికి ప్రయత్నము చేసినప్పటికీ మేరుపర్వతమువలే సుస్థిరంగా వుంది. ఎంతమాత్రం చెడకుండా నేటివరకూ అవిచ్ఛిన్నంగా సాగుతున్నది. అయితే ఇప్పుడు ఫాదరీల వల్లనూ కిరస్తానీ మతబోధనవల్లనూ మిషనరీ స్కూళ్లల్లో చెప్పే మాల చదువుల వల్లనూ మన మతం పాతుకదిలే స్థితి వచ్చేటట్టు కనబడుతున్నది. ఇప్పుడు మనం వెంటనే జాగ్రత్తపడి పునాది బలపరిస్తేనేకాని అంతా చెడిపోతుంది. ఇదివరకు ఎక్కడనో ఎవరో కిరస్తాని మతంలో కలిసినారని చెప్పుకోవడమేకాని ఇప్పుడా గ్రహచారం ప్రత్యక్షంగా మనకే సంభవించింది. వారముదినముల లోపుగా ఎప్పుడూ లేనిది మన ఊళ్లో ఒక వైష్ణవు చిన్నవాడునూ, వైదికపు చిన్నవాడునూ కూడా కిరస్తానీ మతంలో కలిసిపోయినారు. ఈ వారము రోజుల నుంచీ వూరంతా అల్లకల్లోలంగా వున్నది. ఇప్పుడు మనం ఇక్కడ సభ చేసినది ముందు మనం చెయ్యవలసిన పనిఏమిటో ఆలోచించడానికి. కనుక

బుద్ధిమంతులు వారి వారికి తోచినదాన్ని చెప్పుతారని కోరుతాను. రామ చంద్రరావు పంతులుగారు లౌక్యమందూ వైదికమందు కూడా నిధులు వారు మొదట చెపితే బాగా వుంటుంది.

రామ: మన మతం మన కుర్రవాళ్లకు బాగా తెలియకపోవడం చేత వాళ్లు అన్యమతంలో ప్రవేశించడం తటస్థమవుతూ వున్నది. మనం దేవాలయాలలోనో మరియే బహిరంగ స్థలములోనో వారానికి రెండుసార్లు పిల్లలందరూ పోగయ్యేటట్టు చేసి కొంతమంది పండితుల చేత వాళ్లకు మన మతం బోధచేయిస్తూ ఉండవలెను. నేను చెప్పినది బాగా ఉన్నదా?

మహాజనులు: బహుబాగా ఉన్నది. తప్పకుండా రేపటినుంచీ అలాగే చెయ్యవలసిందే. అయితే ఈ మతబోధ ఏ దేవాలయంలో చేస్తే బాగా వుంటుంది? పండితుల్ని ఎవరిని పెడదాము?

వ్యాసరాయాచార్యులు: ఈ వేదశాస్త్ర పాఠశాల ఆంజనేయ స్వామివారి కోవెలలో పెట్టి ముఖ్య ప్రాణాచార్యులుగారిని పండితుల్నిగా ఏర్పరిస్తే బాగా వుంటుంది.

రామానుజాచార్యులు: కాదు, కాదు. శ్రీ కేశవస్వామివారి ఆలయంలో తిరుమండపం మీద పాఠశాల పెట్టించి శ్రీవేదాంత దేశికాచార్యులవారిని పండితులుగా నియమిస్తే బహుదివ్యంగా వుంటుంది.

బసవయ్య అయ్యావార్లు: శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వారిగుళ్లో పాఠశాల పెట్టి వీరభద్రయ్యావార్లంగారిని పండితులుగా పెడితే మరీ బాగా వుంటుంది.

రామ: ఆ గుళ్లో పెడితే మా పిల్లలను మేము పంపము.

బస: మీ గుళ్లో పెడితే మా పిల్లలను మేమంతకుమునుపే పంపము.

పరబ్రహ్మసోమయాజులు: మాకు శివకేశవులు ఇద్దరూ సమానమే. పాఠశాల ఒకరోజు శివాలయంలోనూ, ఒకరోజు విష్ణాలయంలోనూ పెట్టి హరిశ్రాస్తుల వారిని పండితులుగా పెట్టండి. ఎవరికీ ఇబ్బంది లేకుండా వుంటుంది.

రామ: స్మార్తపండితుణ్ని వేస్తే మాకు పనికిరాదు.

వ్యాస: మా కంతకుమునుపే పనికిరాదు.

బస: మాకు బొత్తిగా పనికిరాదు.

రామ: మాకు వైష్ణవ పండితుండే వుండవలెను.

వ్యాస: మాకు మార్ధ్వపండితుండే వుండవలెను.

బస: మాకు శైవపండితుండే వుండవలెను.

వెంకట్రావుపంతులు: మీరూ మీరూ ఏమీ లేనిదే ముందుగానే ఎందుకు దెబ్బలాడుతారు? ఒక స్మార్తపండితుణ్నీ, ఒక వైష్ణవ పండితుణ్నీ, ఒక లింగధారి పండితుణ్నీ, ఒక మార్ధ్వ పండితుణ్నీ వేసి అన్ని మతాలూ కూడా చెపుతాము. మీలో మీరు తగువులాడకండి. స్థలవిషయమై ఏమీ తగాదా రాకుండా దేవాలయాల్లో మానివేసి పాఠశాల కొత్వాలు సావిట్లో పెట్టిద్దాము. ఒక మత విషయంలో ఏమి ముందుగా చెప్పవలెనో ఆలోచించండి.

రామ: ఆలోచించేది ఏమిటి? ముందుగా మన దేవుడు ఎలాగంటివాడో పిల్లవాళ్లకు బోధించవలెను. ప్రతిరోజూ శ్రీస్వామి వారి కోవెలలోకి బాలకులు తప్పకుండా వెళ్లేటట్టు




చేసి మనం చేసే బోధకునూ, వాళ్లు చూచే దివ్య మంగళ విగ్రహానికినీ సరిపడేటట్టుగా దేవుడు చతుర్భుజుడనీ లక్ష్మీసమేతుడనీ శంఖచక్రవిరాజితుడనీ ముఖమునందు తిరుచూర్ణనాము

రంగాచార్యులు: మీరు చెప్పేదాంట్లో చివర స్పష్టంగా లేదు. నామం సంగతిని గురించి చెప్పేటప్పుడు ముక్కు మీద కింద పాదం వుండవలెనో లేదో ఆ సంగతి ఈ సభవారి ముందరనే స్పష్టంగా పరిష్కరించండి.

రామ: ముక్కు మీద పాదం తప్పకుండా వుండవలెను.

రంగా: ముక్కు మీద పాదం సుతరామూ పనికిరాదు. పాదం వుంటే వాడి మొఖమే చూడకూడదు.

రామ: పాదం లేకపోతే తక్కినవెన్ని వున్నా ఏమి ప్రయోజనం లేదు. ఏమండి ఆచార్లవారందరూ మా మాట చౌరకుండా అలా కేకలు వేస్తారు?

రంగా: మీ వాళ్లు కేకలు వేస్తే మా వాళ్లు మాత్రం ఊరుకుంటారా? ఇందులో మాత్రం అంత పౌరుషం చచ్చినవారు ఎవరు?

వెంక: మీ వడఘులి తెంఘులి ఖజ్జాలు కాలిపోను ఇక్కడ దొమ్ములాడకండయ్యా.

బస: వారి తగాదా మాట అవతలవుంచి ముందుగా మేము చెప్పేది వినవలెను. రామానుజాచార్లు చెప్పేదానికి మేమసలే ఒప్పుకోము. దేవుడు త్రినేత్రుడనీ, పార్వతీ సమేతుడనీ త్రిశూల ఖట్వాంగ విరాజితుడనీ విభూతిధారి అనీ బోధించవలెను.

రామా: అలా చెపితే పాఠశాల సాగనేసాగదు. విభూతి రుద్రాక్షలు ధరించి లింగం కట్టుకున్నవాణ్ని చూస్తే సచేల స్నానం చేసి చాంద్రాయణ వ్రతం చెయ్యవలెను.

బస: తిరుమణి తులసిపూసలు ధరించి చక్రాంకితాలైన వాణ్ని చూస్తే భూప్రదక్షిణం చేసివచ్చి పాపం పోవడానికి వందమంది మహేశ్వరులకు భోజనం పెట్టవలెను.

వ్యాస: చక్రాంకితాల మాట ఎత్తితే మీకూ మాకూ బాగా జరగదు. జాగ్రత్త దేవుడి ముఖానికి అంగారం పెట్టి పంచ ముద్రలూ వుంచవలెను.

పర: దేవుడికి ఏ చిహ్నాలూ వద్దు. స్మార్తాచారాలు తెలిసి నిత్యమూ పిల్లవాళ్లు స్నానసంధ్యాదనుష్టానాలు చెయ్యడానికి శ్రుతి స్మృతులూ వాటి భాష్యాలూ చెప్పించి జీవేశ్వరులకు భేదం లేదన్న అద్వైత సిద్ధాంతం బోధిస్తే సరిపోతుంది.

వ్యాస: అద్వైత సిద్ధాంతం మాలో ఎవరికీ పనికిరాదు. స్మార్తుల మొఖం చూస్తే సచేలస్నానం చెయ్యవలెను.

రామా: స్మార్తుల మొఖం చూస్తే చాంద్రాయణం చెయ్యవలెను.

బస: స్మార్తుల మొఖం చూస్తే భూప్రదక్షిణం చెయ్యవలెను.

వెంక: మీరు నిష్కారణంగా స్మార్తులను ఎందుకు దూషిస్తారు? మనం వచ్చిన పని చేసుకోవలెను. ఈ ప్రకారంగా మీరందరూ దొమ్మిగా మాట్లాడక మీలో పెద్దలు ఎవరో వారిని మాట్లాడమనండి.

రామా: మాలో ఆ మూలకూర్చున్న గండభేరుండా చార్యులవారు భాగవతాగ్రేసరులు.

వెంక: వారు ముఖానికి వినకర్ర అడ్డం పెట్టుకున్నారేమి?

రామా: వారు స్మార్తుల ముఖమునూ, శైవుల ముఖమునూ చూడరు. అందుకోసం అడ్డం పెట్టుకున్నారు.

బస: మాలో చిక్కయ్య అయ్యవార్లంగారు కేవలమూ ప్రమథగణాలలోనివారు. ఈ సభకు వైష్ణవులు వస్తారని వారు ఇక్కడకు విజయం చేయలేదు.

రంగా: ఏడవలేకపోయినాడు.

బస: మీ ఆచార్లు మొత్తుకోలేకపోయినాడు.

రంగా: మీ శైవులు శక్తి పూజ పేరుపెట్టి తాగుతారు.

బస: మీ వైష్ణవులు రామానుజ కూటమని పేరు పెట్టి తాగడమే కాకుండా మాంసం కూడా తింటారు.

రంగా: (లేచి) ఆరి గాడిదె కొడుకా! మా వైష్ణవులను దూషిస్తావురా?

బస: (లేచి) ఆరి లంజెకొడుకా! మా శైవులను దూషిస్తావురా!

రంగా: వైష్ణవమతమందు అభిమానం వున్న వాళ్లంతా లెండి ఎవరు గెలుస్తారో చూతాము.

బస: శైవ మతమందభిమానమున్న వాళ్లంతా నడుం కట్టుకునిలుచోండి. ఎవరు గెలిచేదీ కనబడుతుంది.

పర: హరిశాస్త్రుర్లుగారు మాలో బ్రాహ్మణ్యులు.

వెంక: వూరుకోవయ్యా ! బ్రాహ్మణ్యులూ లేదు గిహ్మణ్యులూ లేదు. వూరుకోకుంటే ఇప్పుడు మేజస్ట్రీటు జరుగుతుంది. ఆచార్లుగారూ ! మీరు ఇంటికి వెళ్లండి. అయ్యవార్లంగారూ ! మీరింటికి విజయం చెయ్యండి. ఈసారి చాలించి మరొకసారి మళ్లీ సభ చేతాము.

(అని బతిమాలుకుని అందరినీ ఇళ్లకు పంపివేస్తున్నారు).

## లోకోత్తర వివాహము

రంగము: కరుణాకర శాస్త్రిగారు వీధియరుగు.

(కరుణాకరశాస్త్రిగారునూ, కుక్షింభర సోమయాజులు గారును ప్రవేశించుచున్నారు.)

కరు: సోమయాజులుగారూ! మన ముసలయ్య తాతగారికి ఆస్తియే మాత్రం వుంటుందయ్యా?

కుక్షిం: అంతా యాభై వేల రూపాయల ఆస్తికి పైగా వుంటుందని చెప్పుకుంటారు. మాన్యాలమీదనే పాలుకు వెయ్యిరూపాయలు వస్తవి.

కరు: ఇంత ఆస్తి ఎలా సంపాదించినాడయ్యా?

కుక్షిం: ఈయన ముప్పయి యేళ్లు యేకాధ్వర్యంగా అములోదారీ చేసినాడు. ఆ కాలంలో అందరికీ కొయ్యపుస్తెలు కట్టించి తాలూకా అంతా దోచుకున్నాడు. ఇప్పటికి పింఛన్ పుచ్చుకునే ముప్పయి యేళ్లయినది. వెనుకపోయిన ఇద్దరు భార్యలూ పాడుచేశారుగాని లేకపోతే లక్ష రూపాయల ఆస్తి పైగా వుండును.

కరు: ఈయనకు అన్నీ ఎన్ని పెళ్లిళ్లు అయినాయి?

కుక్షిం: ఐదు పెళ్లిళ్లు అయినవి. ఈ మహానుభావురాలు ఐదో పెళ్లాము. ఈవిడ అందరకూ ధర్మసత్రం చేసింది.

కరు: ఎక్కడనో ఒక్కొక్క పతివ్రత తప్ప ముసలిమగనిని చేసుకున్నవాళ్లంతా ఇలాగే వుంటారు. ఈయనకు ఒక్క భార్య వల్లనూ సంతానము లేదుగదా?

కుక్షిం: ఈయన పడుచుతనంలో పెళ్లాన్ని వదిలివేసి పోకిరీగా తిరిగి అనేక జాడ్యాలు తగిలించుకున్నాడు. ప్రథమ భార్య ఈ విచారం చేతనే చచ్చిపోయిందని మా నాయనగారు చెప్పుతుండేవారు. రెండో భార్యను నేనె యెరుగుదును. ఆవిడ బహుపెద్ద మనిషి. ఆమెకు సంతానం కలిగిందికాదని పింఛన్ పుచ్చుకున్న తరువాతనే మూడో పెళ్లి చేసుకున్నాడు. ఆమె బహుప్రసిద్ధురాలు. ఆమె కాలంలో వీరి ఇల్లు వెనుక ఈయన అమల్‌దారీ చేసిన కాలంలో వుండేటట్టు ఆమె ఆశ్రితులతోను ఉమేజువారులతోను నిండివుండేది. ఆమె దానగుణం చేత ఇల్లంతా ఇతరులకు దోచిపెట్టింది. పోతు పోతూ ఒక్క కొడుకును మాత్రము కని మరీ పోయింది. ఆమె పోయిన సంవత్సరములోనే రెండో భార్య కూడా పోయింది. తరువాత




ఈయన నాలుగో పెళ్లి చేసుకున్నాడు. ఆమె కూడా బహుప్రసిద్ధురాలే. అయితే అందులో ఆమెకొంచెం ప్రతివ్రత. ఒక్క వంట బ్రాహ్మణ్నో చాకల వాణ్నో ఇంట్లో వుండే వాణ్నో ఎవరినో ఒక్కరినే నమ్ముకుని వాళ్లనే అందినంతమట్టుకు పెట్టిబాగు చేసింది. ఈయన కొడుకూ కోడలూ పెద్దవాళ్లయి ఆమెతో పడక పొట్లాడి లేచిపోయి మేనమామగారి ఇంటివద్ద వుండి ఇద్దరూ కూడా మరిడీ జాడ్యం చేత కాలం చేసినారు. తరువాత ఈ ఐదో ఆవిడ చరిత్ర రెండేళ్ల బట్టి మీరు చూస్తూనే వున్నారుగదా?

కరు: ఈమె విస్తారం ఖాయిలాగా వున్నట్టున్నది. ఈమె ఇంతటితో సెలవు పుచ్చుకుంటేనే బాగుండును. ముసలయ్యా తాతగారు ఈ సారైనా మంచిదాన్ని పెళ్లి ఆడుతారు.

కుక్షిం: శతవృద్ధు ఇంకా ఆయనకు ఎవరు పిల్లనిస్తారు?

కరు: ఏ మహానుభావులయినా ఇస్తారు. సహస్రమాసజీవి ఆయనకు పిల్లనివ్వడమే ఇవ్వడము. అటువంటి వాడు అల్లుడు కావడం భాగ్యం ఎంత పుణ్యం చేస్తే వస్తుంది? అదిగాక ఎవరికైనా డబ్బు చేదా ఏమిటి? డబ్బు చూస్తే కొండమీది దేవుడు దిగివస్తాడు. అంతగా ఎవరూ పిల్లనియ్యకపోతే మా అమ్మాయిని ఇచ్చి ఆ కన్యాధాన ఫలము నేను దక్కించుకుంటాను. కన్యనిచ్చి డబ్బు పుచ్చుకుంటే పాపం వున్నదికాని సాలంకార కన్యాదానం చేస్తే వెయ్యి యజ్ఞాలు చేసిన ఫలం వస్తుందని శాస్త్రాలు చెప్పుతున్నవి.

కుక్షి: మీరు ఊరికే వేళాకోళానికి అంటున్నారుగాని లేక లేక పుట్టిన ఒక్క చిన్నదాన్ని మీరు మాత్రం ఇస్తారా?

కరు: ఇస్తే ఏమి తప్పా? నా ప్రతిజ్ఞ వినండి. పంతం వచ్చిందంటే నాతో సమానమైన సాహసంగలవాడు మరొకడు లేడు. నేనే గనుక పిల్లనియ్యకపోతే నా చెవులవి కుండలాలుగావు నేను చదువుకున్నది శాస్త్రం కాదు.

కుక్షి: ఇస్తే తప్పిదమని కాదు. అటువంటి వారికి కన్యాదానం చెయ్యడము కేవలము పరమార్థం. తమవంటి పండితులైన మహానుభావులకెవరికో తప్ప ఈ కలికాలంలో పరమార్థచింత లేదు. మీరు చిన్నదాన్ని ఇదివరకే ఎవరికో ఇవ్వడానికి నిశ్చయించినట్టు విన్నానే!

కరు: ఇంకా ప్రధానం కాలేదు. దత్తామపిహరేత్పూర్వాచ్ఛ్రే యాంశ్చేద్వర అవ్రజేత్. అని మంచి వరుడు దొరికినట్టయితే ఇచ్చినదానినైనా మళ్లీ పుచ్చుకొమ్మని యాజ్ఞవల్క్యులవారు ధర్మ శాస్త్రంలో సెలవిచ్చినారు. మొన్న దశమినాడే వివాహము కావలసినది. ఇంతలో ముసలయ్య తాతగారి భార్య ఖాయిలా మాట విని ఇది ఏదీ తేలిందాకా నిలుద్దామని మా ఇంట్లో మయిలవచ్చిందని బొంకి రెణ్నాళ్లు వట్టిదే మయిలబొట్టు పెట్టినాను. వివాహ కార్యంలో అబద్ధమాడితే దోషం లేదు. నూరుకల్లలాడి ఒక్క ఇల్లు నిలబెట్టుమన్నారు. అంతేకాకుండా శ్రీమద్భాగవతంలో "వారి జాక్షులందు వైవాహికములందు ప్రాణవిత్తమానభంగమందు చకితగోకులాగ్ర జన్మరక్షణ మందు బొంకవచ్చు నఘము పొందదధిప" అని శుక్రాచార్యులవారు వివాహ కార్యంలో అబద్ధమాడవచ్చునని మొదటనే స్పష్టంగా చెప్పి వున్నారు. "ప్రాణ హాని వచ్చుచో నిబరినయమున" అని

పంచమ వేదమైన శ్రీ మహాభారతంలో వేద వ్యాసులవారు కూడా బొంకితే పాపం లేదని ఆనతిచ్చినారు. అంతగా వాళ్లు చిక్కులు పెట్టి బాధిస్తే వాళ్ల వద్ద పుచ్చుకున్న సొమ్ము గిరగిర తిప్పి వాళ్ల ముఖం మీద పారవేస్తాను. మా పెత్తండ్రిగారి కుమారుడు ఇప్పటి శంకరాచార్యులవారు తన కూతురు విషయంలో అలాగే చేసినారు.

కుక్షిం: మీ దివ్య సంకల్పం వల్ల ఆ చిన్నది జీవించదు. నేడో రేపో అన్నట్టు వున్నది. మీ కర్మిష్టతయేమి? మీ తప్ప ప్రభావమేమి? మీ శిష్టత్వమేమి? సిద్ధ సంకల్పులు మీవంటి బ్రాహ్మణ్యుల కోరిక పూరికేపోతుందా? మీకు భాగ్యం వచ్చిన తరువాత బంధువుణ్ని బీదవాణ్ని నన్ను ఒక్క కంటజూచి కనిపెడుతూ వుండవలెను సుమండి?

కరు: అది మీరు నాతో చెప్పవలెనా? ముసలయ్య తాతగారికి పళ్లు వూడిపోయినవి. ఇంద్రియ పటుత్వము పోయినది. చెవులు తిన్నగా వినబడవు. చూపు తిన్నగా కనబడదు. తలవణుకుతూ వున్నది. నెత్తియేకులబుట్టలాగు అయినది. భర్తృహరి చెప్పినట్టు అన్నీ ముసలివైనవిగాని ఒక్క ఆశ మాత్రం ముసలితనం పొందకుండా రోజుకు రోజు పడుచుదవుతూ వున్నది. ముసలయ్యగారు అధాత్తుగా యేవేళనో గుటుక్కుమనకుండా ముందుగా ఈ ముండపోయిన పదమూడోనాడయినా ముడిపడితే ఆస్తి అంతా మనకే దక్కుతుంది. ఆవిడకు వైద్యం ఎవరు చేస్తున్నారూ? అది నేను విచారిస్తానులెండి. మయిల పది రోజులు లేకుండా వుంటే బాగా వుండును. ఐదో పెళ్లానికి ఒక్క రోజుతో సరి అని కారిక తీసుకొస్తే పనికి వస్తుందా? ఈలోగా కర్మలు చేసేటప్పుడు స్నానాలలో ప్రాణం ఎక్కడపోతుందో.

కుక్షిం: ఇవన్నీ సరేకాని బుద్ధి వచ్చినపిల్ల మీ కుమార్తె ఒప్పుకుంటుందా?

కరు: ఒప్పుకోక ఏమి చేస్తుంది? కుశ్శంకలు చేసి అడ్డాలు పెట్టి పోతుందేమో అనే మా పిల్లను నేను గరల్సు స్కూలుకు పంపినానుకాను. ఒప్పుకోవడానికీ ఒప్పుకోకపోవడానికీ దానికి స్వతంత్రం ఎక్కడిది? "న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి" అని మనుస్మృతిలో వున్నది. మీరు వినలేదా? "పితారక్షతికౌమారే" అన్నాడు. గనుక తండ్రి శవానికి కట్టిపెట్టినా కూతురు చచ్చినట్లు ఒప్పుకోవలెను. దానికి మాత్రం డబ్బుచేదా ఏమిటి? కాస్త ప్రాణమూ గుటుక్కుమన్న తరువాత డబ్బుపెట్టుకుని హాయిగా సీమరాణివలె, సమస్త సుఖాలూ అనుభవించవచ్చును. దాని సుఖానికి తల్లిండ్రులము మేము మాత్రం అడ్డం పెడతామా ఏమిటి? ఎవరు వచ్చినా చూచీ చూడనట్టు వూరకుండి యెప్పుడైనా ఇబ్బంది వస్తే పాప పరిహారార్థం శిశుయజ్ఞం చేసి కులం చెడకుండా మాత్రం చూస్తాము. ఈ కలియుగంలో నరమేధ యాగాలు ఎందుకు లేకుండా చేసినారయ్యా?

కుక్షిం: మీరు సెలవిచ్చినట్టు అమంత్రకంగా రహస్యముగా జరుగుతవని సమంత్రకముగా మానివేసినారు. ఇదీ మతంలో చేరినదే. ఈ శిశుమేధం చేస్తేనే కులంలో ప్రతిష్ట చెయ్యకపోతే కులం చెడిపోతుంది. కులకట్టుబాటు అలాగుండవలెను.

కరు: సోమయాజులుగారూ! మీరు సోమం చేసినారుగదా? అశ్వమేధాంతమూ శ్రౌతము చేయిస్తారుగదా? ఈ నరమేధయాగము క్రియ మీకెక్కడయినా వచ్చినదా?

కుక్షిం: ఈ క్రియ నాకు రాలేదు. ఇది ఆయుర్వేదములో కాబోలును వున్నది. వైద్యశాస్త్రం తెలిసినవారి నడిగితే తెలుస్తుంది. ఈ యాగాలలో వారే అధ్వర్యులు. హోతలు మొదలయిన వారంతా స్త్రీలు, ఇందులో స్త్రీల యాజమాన్యం విస్తారం.

కరు: ఆ మాట అవసరం వచ్చినప్పుడు విచారింతాముకాని ముసలయ్య తాతగారి భార్య సంగతి మాత్రం విచారిస్తూ వుండవలెను.

కుక్షిం: అది విచారింపనక్కరలేదు. ఆ చిన్నదిపోయినట్టే ఎంచుకుని మీ ప్రయత్నంలో మీరువుండండి. ఆవిడ రేపో మాపో స్వర్గానికి వెళ్లి భర్త కోసం ప్రతి నిమిషమూ ఎదురు చూస్తూ వుంటుంది. ఆయనకూ వుబ్బసపుదగ్గు. జాతి వైద్యం మంచిది కాదని తెనుగు వైద్యం చేస్తున్నారు. 'నా చేతిమాత్రా వైకుంఠయాత్రా' అన్నట్టు ఈ వైకుంఠ వైద్యుని చేతిలోపడ్డారు. ఎవ్వరూ స్వర్గలోక సుఖానికి వెళ్లకుండా ఈ పాడులోకంలో చిరకాలం కష్టం అనుభవిస్తూ వుండరు. కొన్నాళ్లు హెచ్చుతగ్గుగా ఈ దంపతులను ఇద్దరనూ ఈయనే మాట దక్కించుకుంటారు.

కరు: అలాగయితే మీరెలాగయినా బతిమాలుకుని మూడు ముళ్లు పడేవరకూ ముసలాయనకు మాత్రం ఔషధం ఇవ్వకుండా జాగ్రత్తపెట్టండి. సప్తపది అయిన తరువాత కావలిస్తే కావలసినన్ని మందులు ఇవ్వవచ్చును. సప్తపదితో వివాహం పూర్తి అయి ఆస్తి వస్తుంది కాదండీ?

కుక్షిం: మీకా తొందరయేమి? నాగవల్లి అయినదాకా కూడా మందు ఇవ్వకుండా ఆపుదాము. తరువాత గృహ

ప్రవేశమహోత్సవమూ, దినవారమహోత్సవమూ ఒక్కసారే కావచ్చును. ఖర్చులో ఖర్చు కలిసివస్తుంది.

కరు: మీనోటి వాక్యాన అంతటి భాగ్యం పట్టవలెనుగాదూ? ఈ ముసలి ముండాకొడుకు తనచేతిమీదుగా ఎందరినో భార్యలను చంపినాడు. ఇంకా తీసుకుంటూ ఇలాగే బ్రతుకుతాడేమో!

కుక్షిం: ఈసారి బ్రతుకకుండా నాది పూచీ. మీ కన్యాదాన ఫలం వూరికేపోదు. డబ్బు పుచ్చుకోకుండా కన్యాదానం చేస్తే ఈ మాత్రం ఫలం కలగకపోతే ఇక మన శాస్త్రాలన్నీ వట్టివే కావలెను. మీరు కూడా ఇంట్లోనే వుంటారు గనుక ఇక ఆయన దినాలు వేళ్లమీద లెక్క పెట్టవలసినదే.

కరు: పెళ్లిలో మాత్రం విస్తారం ఖర్చు కాకుండా చూడండి. పైన చెప్పిన ఇబ్బంది ఏమీ రాకుండా దేవాలయంలో ముడిపెట్టి ఒక్క పూటలో పెళ్లికానిస్తే అంతా పదిరూపాయలలో అవుతుంది అవతల ఏమైనా ఫర్వాలేదు.

కుక్షిం: అలాగే చూతాము. ఇప్పుడు పని వున్నది. నేను వెళ్లి మళ్లీ వస్తాను.

కరు: చిత్తము వెళ్లిరండి. కార్యమైన దాకా ఇది బ్రహ్మ భేద్యంగా వుండవలెను సుమండీ.

(అని ఇద్దరూ వెళ్లుచున్నారు.)

## ముసలయ్య గారి గది

(ముసలయ్య గారు యేడ్చుతుండగా కుక్షింభర సోమయాజులుగారు ప్రవేశించుచున్నారు.)

కు: పోయిన దానికోసం మీరు ఏడిస్తే కార్యం లేదు. బహు పెద్దలైనారు. గట్టిగా ఏడిస్తే మీకెక్కడ సోషవస్తుందో. మొగవాళ్లు మీరన్ని విధాలా అదృష్టవంతులే. అనుభవించవలసిన యోగం లేక అదే మన్నుకొట్టుకుని లేచిపోయింది. కాని ఇష్టం వుంటే భాగ్యవంతులు మీకు రేపే ఈపాటికి ఇంతకంటే మంచి పెళ్లాము వస్తుంది.

ముస: లోకానికి కొంచెం పైకి ఏడవకపోతే బాగావుండదు. ముందుగా మీ మనసు తెలియక ఏడవకపోతే మీరేమనుకుంటారో అని పైకి కంటతడి పెట్టినట్టు నటించినాను కాని ఈ ముండపోవడం మనసులో నాకు సంతోషంగా వున్నది. పైకి చెప్పుకుంటే అప్రతిష్ట ఈ ముండ నన్ను గర్భాధానం నాడైనా పైన చెయ్యి వెయ్యనిచ్చింది కాదు. నాకు అసలే దీని వెనుకటి దానికాలం నాడే కామం పోయింది. అయినప్పటికీ వెనుక అనుభవించి అలవాటుపడి వున్న వాసన చేత యెప్పుడైనా కొంచెం భ్రమపుట్టి మీద చెయ్యి వెయ్యబోతే ముసలికంపని కస్సుమని కాట్లకుక్కలాగు కరవ వచ్చేది. అసలది తిన్నగా పడుకోవడానికి గదిలోకే వచ్చేది కాదు. ఎప్పుడైనా తప్పిదారి వచ్చినా వెంటనే దీపం తీసివేసి మళ్లీ బయట తలుపు గొళ్లెము పెట్టిపోయి అవతల పడుకుండేది. కడుపుబ్బుకుని వచ్చి అల్పాచమానానికి వెళ్లడానికి వల్లకాక ముసలిముండాకొడుకును లోపల ఒక్కణ్ణే చీకట్లో చచ్చిపోయేవాణ్ణి. గృహచ్ఛిద్రం వెల్లడి చేసుకోరాదు.

కు: అలా కాదు. నేను మీస్వజనంలో వాణ్ణి. నాతో చెపితే ఏమి రహస్యభంగం వుండదు.

ముస: అందుచేతనే ఇదంతా నీతోచెప్పినాను. దీనికి కడుపు వచ్చినప్పుడు నాకు మరీ అసహ్యం వేసినది. ఒకరోజు ఒళ్లుమండి కడుపుదింపుకొమ్మని అల్లరిచేతామన్నంత కోపం కూడా వచ్చింది. మళ్లీ కడుపు చించుకుంటే కాళ్లమీద




పడుతుందని నాలో నేనే పస్తాయించుకుని వూరుకున్నాను. ఆ కడుపు పుణ్యంగా ఒక్కరోజు రాత్రి వచ్చి నామీద చెయ్యివేసి కౌగిలించుకుని పడుకుంది. నాకక్కడికే బ్రహ్మానందమైంది. నా సత్యంగా చెపుతాను. జన్మానికల్లా శివరాత్రి ఇంతకుతప్ప నేను దానిమీద ఎప్పుడైనా చెయ్యి వేసిన పాపానపోతే మాతృద్రోహం చేసినట్టు.

కు: సరిసరి మీరు ఒట్టుపెట్టుకోకపోతే మాత్రం మీ మాట నేను నమ్మనాయేమిటి? మీరు చెప్పినవన్నీ వేదవాక్యాలు.

ముస: తరువాత, వృద్ధాప్యంలో మంచిపుత్రుడైనా పుడుతాడని ఆశపుట్టి మీవంటి వారినందరినీ విందుకు పిలిచి మహావైభవంతో పుత్రోత్సవం చెయ్యవలెననుకుంటూ వుండగా ఆరో నెలనే కడుపు దిగబడిపోయింది. నిరుడు ఈ కడుపు రాకమునుపు దీని మనసులో మరొక దుర్బుద్ధి కూడా వుండేది.

ఎందుకదంతా ఇప్పుడు?

కు: సందేహించకండి. అదేమిటో నాతో సెలవియ్యండి నేను రహస్యం ఎవరికైనా వెల్లడిచేస్తాననుకున్నారా ఏమిటి?

ముస: నేను వేగిరం చచ్చిపోతే ఈ డబ్బు పట్టుకునిపోయి మళ్లీ ఎవరినైనా పడుచువాణ్ని పెళ్లి చేసుకోవలెనని దాని మనసులో ఉండేది. విధవ వివాహాలు చెయ్యడం బాగా వున్నదని ఒకనాడు అది అనడం చేత నేను దాని మనసులో అభిప్రాయం కనిపెట్టినాను.

కు: బుద్ధిమంతులు అంతమాత్రం మీరు కనిపెట్టలేరూ? అసలు మీరు ఆవలిస్తే పేగులు లెక్కపెట్టేవారు. మీ బుద్ధికి బృహస్పతి కూడా చాలడని నా అభిప్రాయం. ఎంత బుద్ధిమంతుడూ కాకపోతే బృహస్పతి లేచిపోయిన భార్యను కడుపుతో ఉన్న దాన్ని తెచ్చి ఇంట్లో పెట్టుకుని అంతసహనం వహించగలడా?

ముస: ఆడవాళ్లు మహా చెడ్డవాళ్లు. ఎంత చెడ్డవాళ్లూకాకపోతే "తలతడివి బాసచేసిన జలజాక్షుల నమ్మరాదు సారంగధరా" అన్నమాట ఊరికే పుట్టిందా? వాళ్లకున్నంత కామము లోకములో ఎవరికీ లేదు. అందుచేతనే శాస్త్రకారుడు "సాహసం షడ్గుణంబైన కామంచాష్టగుణంభవేత్" అని చెప్పినాడు. స్త్రీలను కోసి వుప్పుపాతరలో పూరవేసినా పాపం లేదు. వాళ్లను చిన్నప్పుడే తలగొరిగించి ముసుగు వేసి మూలకూర్చుండబెట్టి తిన్నగా తిండిపెట్టక బ్రతికి వున్నంత కాలమూ మాడ్చి చంపవలెను. అలా చేసినా వీళ్ల కామంపోక అడ్డమైన అకార్యాలూ చేస్తున్నారు. ఇప్పుడు స్త్రీ పునర్వివాహ సమాజాలంటూ మనపాలిటికి మృత్యుదేవతలు వలె ఒకటి పోగయినది. చిన్న పిల్లలను చేసుకున్న నా వంటి ముసలివాళ్లకందరికీ వాటిపేరు చెపితే వొళ్లు దడయెత్తుతుంది. ఆడముండలకు రెండో పెళ్లి ఏకాలంలోనైనా వున్నదటయ్యా ఇప్పుడీ మాల ప్రభుత్వం మూలంగా అన్నీ విడ్డూరాలు పుడుతున్నవి. మహాకలి ప్రవేశించింది. ఇక వర్ణాశ్రమధర్మాలు నిలిచేయోగం లేదు. వెధవముండలపాలింటికి మనస్వాముల వార్లున్నూ పండితులున్నూ చేరి ఇలాగు పని చేస్తుండబట్టి కాని లేకపోతే వాళ్లందరూ ఒక్క దెబ్బను పెళ్లి చేసుకోరా?

కు: తమరు ముందు కార్యం సంగతి చూడవలెను.

ముస: ఏది వివాహ కార్యం సంగతా ఏమిటి? ఎవరైనా నాకు ఇప్పుడు పిల్లనిస్తారా? శాస్త్రుర్లగారి కూతురట ఎవరో ఈ మధ్య పదేళ్ల పిల్ల మనయింటికి వచ్చినది ఆ పిల్లను మనకిస్తే మహా బాగా వుండును.

కు: ఆ విషయం నేను కృషి చేస్తాను. మీకు పెళ్లి కూతురిని సంపాదించడము పూచీనాదీ.

ముస: ఏదో ఒక పిల్లకాదు. నేను ఇప్పుడు చెప్పిన పిల్లే బహు బాగా వుంటుంది. కామం వుడిగిన వాడికి నీకు పెళ్లిఎందుకంటారేమో వినండి. "ధర్మ ప్రజాసంపత్యర్థం" అని వివాహములో సంకల్పం చెపుతారు. కొందరు దానికర్థము ధర్మ సంతానము నిమిత్తమంటారు. కొందరు ధర్మము నిమిత్తమూ సంతానము నిమిత్తమూ కూడా అంటారు. అందులో ఎలాగైనా ధర్మం ముఖ్యము. వెధవ వివాహాలు కామం నిమిత్తం చేసుకునే వివాహాలు వివాహాలే కావు.

కు: అవును మీరు కేవలము ధర్మము నిమిత్తమే వివాహమాడబోతున్నారు. వివాహం కర్మలు నిలవడానికి కాని కామం కోసం కాదు. మీ పూర్వజన్మపుణ్యం వల్లనో చేసుకున్నదాని పతివ్రతా మహత్యం వల్లనో కలిగితే సంతానమూ కలుగవచ్చును.

ముస: అవును కలిగితే కలుగవచ్చును. ముసలవాళ్లకు పడుచుతనం వచ్చే ముందు ఏమైనా వున్నదేమో మన వైద్యుణ్ని అడుగవలెను.

కు: అటువంటి మందులు గోసాయిలవద్ద వుంటవి. పూర్వం యయాతికి వచ్చినట్టు మీకు ముసలితనం పోయి ఎప్పుడైనా పడుచుతనం రావచ్చునేమో? మీ అదృష్టం ఎవరు చూచినారు?

ముస: మన వూరికి గోసాయిలు వచ్చినప్పుడల్లా నాతో చెపుతూ వుండండి. ఏ పుట్టలో ఏ పామున్నదో ఎవరు చూచినారు? అందరినీ అనుసరిస్తూ వుంటే ఏ మహానుభావుడైనా అనుగ్రహం వచ్చి పడుచుతనం వచ్చేమందో మంత్రమో ఉపదేశం చేస్తాడు. లేకుంటే యోగం నేర్చుకుని ఎల్లకాలమూ బ్రతికే సదుపాయము ఆలోచింతునా?

కు: అది సర్వోత్తమమైనది. రోజూ వూపిరి బిగపట్టడం అభ్యాసం చేస్తే ఎల్లకాలమూ బ్రతుకవచ్చును.

ముస: తరువాత ఏమి చేసినా ముందుగా పెళ్లి చేసుకుంటే ఎందుకైనా మంచిదే. నాలుగు కొట్టినా తిట్టినా స్వతంత్రంగా చేసుకున్న పెళ్లాము వంటిది ఒకటి కాదు. పెళ్లామని ఒకటి వుంటే ముసలివాడికి కాళ్లుపడుతుంది. చేతులు పడుతుంది. ఇందులో కర్మలు నిలవడం మరీ ముఖ్యము.

కు: అలాగైతే మళ్లీ పెళ్లి అయిన తరువాత అవుపోసనమూ

అగ్నిహోత్రాలూ వైశ్వదేవమూ వుంచండి.

ముస: అబ్బో ! అన్ని నేను వుంచలేను. లౌక్యాగ్ని హోత్రాలు నాకుఎప్పుడూ వున్నవి. ఈ వుబ్బసపు దగ్గు మూలంగా రాత్రీపగలూ మరీ అవిచ్ఛిన్నముగా జరుగుతున్నవి. ఈ చిల్లరవన్నీ మానివేస్తే నాకు ఒక్క యజ్ఞం చెయ్యవలెనని వున్నది. యజ్ఞం చేస్తే రంభా సంభోగం కలుగుతుందట కాదూ? నాకు రంభను వెళ్లి కౌగలించుకోవలెనని మహా ఆపేక్ష వున్నది. నేనయితే భోగం వాళ్లను చాలామందిని వుంచుకున్నాను కాని వాళ్లు ఎవళ్లూ చక్కదనానికి రంభకు చాలరట! యజ్ఞం చేస్తే ఒక్క రంభేనా ఇంకా అక్కడ వున్న వాళ్లు ఎవళ్లయినా కూడా వస్తారా?

కు: యజ్ఞం చేస్తే రంభా మేనకా ఊర్వశీ మొదలైన అప్సరస స్త్రీలందరూ కూడా వస్తారు.

ముస: ఊర్వశి కూడా తప్పకుండా వస్తుందిగదా? ముసలివాణ్ణి అని ఒకవేళ రాదేమో! తీరా స్వర్గానికి వెళ్లిన తరువాత అప్పుడు రాకపోతే నేనేమి చెయ్యను?

కు: మీరు అధైర్యపడకండి. మీరు ఇంకా నూరేళ్లు బ్రతికి వెళ్లినా యజ్ఞం చేస్తే వాళ్లు మీరు ఎప్పుడు వస్తారా అని ఎదురు చూస్తూ వుంటారు. మన శాస్త్రాలు అలాగు చెపుతున్నవి. అవి ఎన్నటికీ అబద్ధాలు కావు.

ముస: అలాగైతే మన శాస్త్రాలు బహుమంచి శాస్త్రాలు. వాటితో సమానమైనవి జగత్తులో లేవు. నాకు తప్పకుండా నేను చెప్పిన పిల్లను ఈ మధ్యాహ్నం వివాహం చేయించండి. వెంటనే యజ్ఞం చేసివేస్తే ఈ లోకంలో భార్యతో సుఖం లేకపోయినా స్వర్గ లోకంలో అయినా రంభతో సుఖపడతాను. రంభ నాతో కుదురుగా వుంటుందా ఇంతలో యజ్ఞం చేసిన వాడు మరెవడైనా వచ్చినాడని పరుగెత్తుతుందా పోనీ దాని ముఖం చూస్తేనే చాలును. నిమిషాల మీద పెళ్లి కానియ్యండి.

కు: శవం ఇంకా ఇంటి నుంచి కదలలేదాయెను. మయిల పదిరోజులూ వెళ్లకుండా పెళ్లి యెలాగవుతుంది? పదమూడో రోజు దాకా వోపిక చెయ్యండి.

ముస: అయ్యోముండా! బ్రతికీ చచ్చీ కూడా నన్నేడిపిస్తూ వున్నావు? చచ్చేముండ మయిల లేకుండానైనా చావరాదా? నేను ఉత్తరక్రియలు మానివేస్తే మయిల రాకుండా వుంటుందా?

కు: అలామాని వెయ్యడం శాస్త్ర విరుద్ధం. మీరు మయిల పట్టి కర్మ ఆచరించవలెను.

ముస: మయిల పట్టవలెననీ కర్మ చెయ్యవలెననీ కూడా మీరు ఇందాక చెప్పిన శాస్త్రములోనే ఉన్నదా?

కు: ఆ శాస్త్రంలోనే ఉన్నది.

ముస: అలాగైతే మనవి వొట్టి వెధవ శాస్త్రాలు. ఆ శాస్త్రాలు చేసినవాళ్లందరూ కేవలము బుద్ధిహీనులు. వాటినన్నింటినీ కట్టకట్టి ఒక్కమాటు తగలపెట్టించండి. శాస్త్రములు ఏమిటి? ముసలముండా కొడుకును పెళ్లి చేసుకోకుండా పెళ్లాము పోయిన తరువాత పదిరోజులు ఆగమనడం ఏమిటి? నేను ఈలోగా పోతే నా యజ్ఞమూ రంభా సంభోగమూ అన్నీ మన్నుకొట్టుకుని పోవలసినదేనా?

కు: మీరు సిద్ధసంకల్పులు. మీ ఇష్ట ప్రకారమే జరుగుతవి. యోగులకీ కర్మ కాండ ఏమీ అక్కరలేదుగాని సంసారములో వుండేవారికి ఈ లోకం కోసం అన్నీ కావలెను.

ముస: అలాగైతే నేను ఇకను సంసారం విడిచి వైరాగ్యం అవలంబించి ఇప్పుడే యోగినవుతాను. నాకీలోకంతో సంబంధం లేదు. ఈ మధ్యాహ్నం పెళ్లి చేయించండి. గడ్డమూ, గోళ్లూ ఒక్కసారిగా పెరిగి తలజడలు కట్టిపోతే ఒక్కసారిగా యోగినయిపోదును.

కు: శవం దాటిపోయిన తరువాత ఆ ప్రయత్నం చేతాముకాని ముందుగా శవము కదిలే ఉపాయం చూడండి. బంధువులందరూ ఈ సంగతి కనిపెట్టి ముందుగానే ముఖాలు చాటువేసినారు. పదిరూపాయలు ఖర్చు చేసి పీనుగను బయలుదేరతీసి దహనం చేసి వస్తేనేకాని భోజనాలు కూడా లేవు.

ముస: నాకు పెళ్లికి ముఖ్యంగా ఆ శాస్తుర్లుగారి కూతురే కావలెను సుమా. ఆ పిల్లకు మయిల వచ్చి మొన్న దశమినాడు ముహూర్తం తప్పిపోవడం మన అదృష్టం. ఆ శాస్తుర్లు వెయ్యేళ్లు తలక్రిందుగా తపస్సు చేసినా మనవంటి అల్లుణ్ని సంపాదించలేడు. ఆ చిన్నదాన్ని వివాహమాడితే తండ్రి మంచి పండితుడు గనుక ఒకవేళ నేనేమై పోయినా కూతురికి మళ్లీ పెళ్లి చెయ్యడు. అతడికి కొంచెం వేదం ముక్కలు వచ్చి అర్థం తెలియకుండా వుంటే మరీ బాగా వుండును.

కు: నాకు వెయ్యి రూపాయలు ఇస్తే ఆ పిల్లను మాట్లాడి తప్పకుండా ఇప్పిస్తాను.

ముస: అలాగే ఇస్తాను. నీకూ నాకూ ఇదే ఖరారు. నీవు వాహకుల కోసం వెళ్లేటప్పుడు పిల్లదాని తండ్రితో మాట్లాడి మరీ వెళ్లు.

(ఇద్దరూ వెళ్లుచున్నారు.)

## వర్షము

**(గణపతిరావు కూర్చుండి చదువుకుంటుండగా శంకరశాస్త్రిగారు ప్రవేశించుచున్నారు.)**

గణ: శాస్త్రుర్లుగారు ! నమస్కారమండి.

శంక: దీర్ఘాష్యమస్తు ! వంశాభివృద్ధిరస్తు! రాజద్వారే రాజభవనే సర్వదా దిగ్విజయమస్తు!

గణ: అప్పుడే ఆశీర్వచనమంతా అయిపోయిందండీ? ఇక మీకు మరేమీ రావండీ?

శంక: ఈ ఇంగ్లీషు చదువుకునేవాళ్లకు మమ్మల్ని చూస్తే వేళాకోళంగా వుంటుంది.

గణ: వేళాకోళం కాదండీ. మీరు తాతగారవుతారు గనుక హాస్యానికన్నాను. కోపం వుంచకండి.

శంక: చిన్నవాడవు నీవొకమాటన్నా కానీ నాకు కోపం లేదు నాయనా! నీవు చదువుకునే పుస్తకం పేరు ఏమంటారు?

గణ: దీనిపేరు "ఫిజికల్ జాగ్రఫీ" అంటారు.

శంక: అందులో ఏమి వుంటాది?

గణ: అందులోనా? భూమిని గురించీ, వాయువు గురించీ, సముద్రాన్ని గురించీ అనేక సంగతులు వుంటాయి.

శంక: నీవు ఇప్పుడు చదివే భాగం దేన్ని గురించి?

గణ: వర్షాన్ని గురించీ మేఘాల్ని గురించీ చదువుతున్నాను. అది మాకు ఇవాళ పాఠం.

శంక: వర్షం ఎందుకు వస్తుందని చెప్పుతాడు? ఇంగ్లీషు పుస్తకాల ప్రకారం మేఘం అంటే ఏమిటి?

గణ: సూర్యకిరణాల వేడిమి చేత సముద్రములోనూ నదులలోనూ మడుగులలోనూ వుండే నీరు ఆవిరిరూపంగా పయికిలేచి ఒకచోట కూడుకుని పైనగాలిలో మేఘంగా ఏర్పడి బరువు ఎక్కువయినప్పుడు నీరు కిందపడుతుంది. దాన్నే వర్షమంటారు.

శంక: అంతేకాని మేఘాలకు ప్రాణం వుండడమూ ఇంద్రుడికి వాహనాలు కావడమూ అంతా అబద్ధమే అంటారా?

గణ: నిస్సందేహంగా అబద్ధమే. మేఘాలకు ఏమిటి? ప్రాణం వుండడం ఏమిటి? వాటిలో పొగా ఆవిరీ గాలి తప్ప మరేమీ వుండదు.

శంక: నీవు చెప్పింది ఎంతమాత్రమూ నమ్మతగి వుండలేదు. మేఘాలకు తప్పకుండా ప్రాణం వుంటుంది. పూర్వం యక్షుడి పెళ్లాం దగ్గరకు రాయభారం కూడా పట్టుకు వెళ్లినవి. మేఘాలు సముద్రంలోకి వెళ్లి నీళ్లు తాగుతుండగా అనేకులు చూచినారు. అలా నీళ్లు తాగివచ్చి అల్పాచమానం చేస్తే ఆ నీరు వర్షరూపంగా భూమి మీద పడుతుంది. అందుచేతనే వర్షపునీరుకు భూమి మీద పడితేనేకాని శుద్ధిలేదు.

గణ: మేఘాలు సముద్రంలోకి వెళ్లి నీళ్లు తాగుతుండగా మీరెప్పుడైనా చూచారా? పామరులు చెప్పవలసిన మాట పండితులై వుండి మీరు కూడా విశ్వసిస్తారేమి? మేఘము లేమిటి? నీళ్లు తాగడం ఏమిటి?

శంక: అయ్యయ్యో! నా మాట నమ్మకపోతే నేను ఏమి చెప్పను? మేఘములు వచ్చి సముద్రములోనే కాకుండా దాహం వేసినప్పుడు కోయవాళ్ల కుండల్లో కూడా కొండలమీదకి వచ్చి నీళ్లు తాగిపోతవి. కోయవాళ్లు పొంచివుండి నీళ్లు తాగడానికి కుండలలో దూరి నీళ్లు కతుకుతూ ఉన్నప్పుడు




చటుక్కున మూతవేసి కుండకింద మంటపెట్టి మేఘాలను వండుకుని తింటారు. ఈ సంగతి మా మేనమామ చూచినాడు.

గణ: ఆయనను అడిగితే ఆయన కూడా తన మేనమామ చూచినాడని చెప్పుతాడు. ఈలాంటి పిచ్చి కథలన్నీ అంధపరంపరగా వ్యాపించి మూఢులు నమ్ముతారు. ఎవరూ ఏమీ చూచినవారుండరు. కోయవాళ్ల మాటెందుకు? మీరు ఎవరూ ఇంట్లో లేనప్పుడు మీ బిందెలలో మంచినీళ్లు మా ఇంట్లో పోసుకుని ఆ నీళ్లు మేఘములు తాగిపోయినవనీ మా మేనమామ చూచినాడనీ మా దొడ్లో వాళ్లు మేఘాన్ని వండుకు తిన్నారనీ నేను చెపితే మీరు నమ్ముతారా?

శంక: మీరు లక్ష చెప్పండి. వెయ్యి చెప్పండి. మేఘాలు జంతువులు కావడానికి సందేహం లేదు. ఎండకాక చేత నీళ్లు పయికి వెళ్లి కింద పడుతూ వుండడమే వర్షమయితే రోజూ వర్షం కురుస్తూనే ఉండును. మేఘాలకు యజమానులు వున్నారు. వాళ్ల సెలవైతేకాని అవి వర్షం కురియవు.

గణ: మీరు చెప్పిన ప్రకారం అల్పాచమానం చెయ్యడానికి కూడా యజమానులు శలవు కావలెనా ఏమిటి? అలాగైతే మహాగొప్ప యజమానులు దొరికినారు.

శంక: నేనూ అనేక శాస్త్రాలు చదివిన ముండాకొడుకును. నా మాట బొత్తిగా తీసివెయ్యకండి. కావలిస్తే మీకు కావలసినన్ని శాస్త్ర ప్రమాణాలు కనపరుస్తాను. మేఘాలకు వరుణ దేవుడూ ఇంద్రుడూ ఇద్దరు యజమానులు. వారి సెలవైతేనే కాని వర్షం కురియదు. అందుచేతనే కొన్ని దేశాల్లో వర్షం కురియక క్షామం పడుతుంది. పూర్వం ద్వాదశవర్ష క్షామాలు ఎందుకు వచ్చేవి?

గణ: జనుల తెలివి తక్కువ చేత వచ్చేవి. ఆనకట్టలు కట్టి కాలువలు తవ్వించి దేశమంతా నీరు ప్రవహించేటట్లు చేస్తే ద్వాదశ వర్షక్షామాలూ, గీమాలూ కూడా హడిలి పారిపోతవి. ఇప్పుడీ కాలువలు తవ్వించిన తరువాత ద్వాదశ వర్షక్షామాలు ఎప్పుడైనా రాగా మీరు చూచినారా?

శంక: అబ్బాయీ ! చిన్న వాడవు నీకేమీ తెలియదు. పూర్వ కాలపువారిని పెద్దలను అలా తిరస్కరించరాదు. వారు సర్వజ్ఞులు ఏమీ లేకపోతే వారు నిష్కారణంగా దేవతలున్నారని చెప్పరు.వర్షాలు లేనప్పుడు వారు వరుణమంత్రాలు చదివి ఒక్క నిమిషంలో వర్షాలు కురిపించేవారు. దేవతలందరూ వారికి ప్రత్యక్షం. వర్షాలు లేనప్పుడు జనులందరూ వెళ్లి బ్రాహ్మల కాళ్లు పట్టుకుని వారిని సంతోషపరిస్తే తమ మంత్రశక్తి చేత వర్షం కురిపించి లోకానికంతటికీ సంతోషం కలుగచేసేవారు. బ్రాహ్మల వద్ద అలాంటి మహత్యము ఉన్నది గనుకనే అందరూ వారిని భూ దేవతలని పూజ చేస్తారు.

గణ: అదంతా బ్రాహ్మలు తమ ఆధిక్యం నిలవడానికి పన్నిన ఎత్తుగడ. ఆ దేవతలు బ్రాహ్మలకు ఎంత ప్రత్యక్షమో శూద్రులకూ అంతే ప్రత్యక్షము. బ్రాహ్మలు కోరితే వర్షం కురిసేటట్టయితే శూద్రులు కోరినా వర్షం కురుస్తుంది.

శంక: అబ్బాయీ! బ్రాహ్మణ దూషణ నీకు శ్రేయస్కరం కాదు. బ్రాహ్మలయందు తప్పకుండా గొప్ప మహత్యం వున్నది. ఇప్పుడు కూడా బ్రాహ్మలకు డబ్బు ఇచ్చి వారిచేత వరుణమంత్రాలు చదివించి సహస్రఘటాభిషేకాలు చేయిస్తే ఎలా వర్షాలు కురుస్తవో చూచినావా? నిరుడు సంవత్సరం పెన్నేటి గ్రామంలో కాపులంతా పోగయ్యి నూరు రూపాయలు చందాలు వేసుకుని బ్రాహ్మల చేత సహస్రఘటాభిషేకం చేయిస్తే అది వరకు ఒక్క చుక్క పడనిది మూడు రోజుల కల్లా వర్షం కురిసింది.

గణ: ఇదంతా బ్రాహ్మలు జనులను తెలివితక్కువవాళ్లను చేసి వాళ్ల డబ్బు కడతేర్చడానికి పన్నిన మంత్రం కాని అంతకంటే వేరేమీ లేదు. ఆ వెయ్యి కుండల నీళ్లూ గుళ్లో పోయించడం కంటే తమ పొలాల్లో పోయించుకుంటే పొలాల్లో కొంత భాగమైనా తడిసిపోను. ఆ నూరు రూపాయలూ ఖర్చు పెడితే శుభ్రంగా ఒక మోటనుయ్యి వచ్చును. ఆ నూరు రూపాయలూ కూలీవాళ్లకు ఇచ్చి నీళ్లు తోడించి పోయించినా బహుబాగా పొలాలు పండేవి. మూఢులుగనుక వాళ్లు నిష్కారణంగా నూరు రూపాయలు బ్రాహ్మల పొట్ట పెట్టి పాడు చేసినారు. నిరుటి సంవత్సరం మన ఊళ్లో సహస్రఘటాభిషేకం చేస్తే పయినుంచి ఒక్క చుక్క నీరు పడ్డది కాదు. వీధులు మాత్రం రొచ్చుపడి పదిరోజులు నడవడానికి వల్ల అయింది కాదు.

శంక: మంత్ర ప్రభావం కాకపోతే రెండో ఊళ్లో కురవడానికి కారణం ఏమిటి? నాకు తోచక అడుగుతాను చెప్పండి.

గణ: మంత్ర ప్రభావం అయితే ఈ ఊళ్లో కురవకపోవడానికి కారణం ఏమిటో మీరు చెప్పండి చూతాము. ఈ సహస్రఘటాభిషేకాలు వేసవి కాలంలో వర్షాలు కురిసేముందు చేస్తారు. వాటంతట అవి వర్షాలు కురిస్తే బ్రాహ్మలు అవి తమ మహత్యం వల్లనే అంటారు. కురియకపోతే కన్నంలో దొంగలు తేలుకుట్టినట్లు మాట్లాడక వూరుకుంటారు. తరువాత వర్షాలు కురిసినా కురియకపోయినా ముందుగా బ్రాహ్మలకు సంభావనలూ సంతర్పణలూ తప్పవు. ఇది అంతా పట్టపగలు అందరూ మేలుకుండగా చేసే మోసము.

శంక: అబ్బాయీ! ఈ ప్రసంగం ఇక చాలించు. అంతకంతకు బ్రాహ్మణ దూషణ ఎక్కువ అవుతున్నది. బ్రాహ్మ ద్వేషం ముదిరిన తరువాత ఇక వాడితో మాట్లాడరాదు. ఇప్పుడు ఇంగ్లీషు చదువు వచ్చి ఈ మాలచదువు మూలంగా శాస్త్రాలూ, ఆచారాలూ మన్నుకొట్టుకుని అంతా భ్రష్టయిపోతున్నాయి. ఇంగ్లీషు చదువుకున్న వాళ్లు వట్టికిరస్తానీ ముండావాళ్లు అన్నింటికీ కుశ్శంకలు చేసి లోకమంతా మాల కూడుచేసి పాడుచేస్తున్నారు. రామరామ రామరామా! ఇక ఈ మాటలు వింటే పాపం వస్తుంది.

(అని చెవులు మూసుకుని లేచిపోవుచున్నాడు.) ◆

# కవిచరిత్ర పరిశోధన

- మల్లంపల్లి సోమశేఖరశర్మ




*కవుల రచించిన కృతులన్నీ ఒక్కచోట దొరికితేనేకాని వారి చరిత్ర వ్రాయడం సాధ్యంకానిపని. శ్రీ వీరేశలింగంగారి కాలానికి ఆంధ్ర గ్రంథాలస్థితి ఎట్లా ఉందో తెలుసుకోవడం చాలా అవసరం. అది తెలిస్తేనేకాని వీరేశలింగంగారు కవుల చరిత్ర ఎట్లా రచింపగలిగినారో మనకు విశదం కాదు.*

చరిత్ర పరిశోధన అనేది – అది దేశ చరిత్ర పరిశోధన కానీండి, వాఙ్మయ చరిత్ర పరిశోధన కానీండి – చాలా కష్టతరమైన కార్యం ఇప్పటికీని. అటువంటప్పుడు పందొమ్మిదవ శతాబ్ది కడపటి దశకాలలో కందుకూరి వీరేశలింగంగారు పరిశోధన కావించి ఆంధ్ర కవుల చరిత్ర వ్రాయగలిగారంటే అది లోకోత్తరమైన అపూర్వ విషయం. అది వారి పరిశోధనా పాటవానికీ, ఆంధ్ర వాఙ్మయాభిమానానికి నిస్తులమైన తార్కాణం.

వాఙ్మయ చరిత్ర వ్రాయాలంటే ముందు ఆయాకవుల, వారు రచించిన కృతుల కాలం నిర్ణయించడం అత్యంతావసరం. ఇది ముందు నిర్ణయమైతేనేకాని మన ఆంధ్ర సాహిత్య క్రమ పరిణామం తెలుసుకొనేందుకు వీలుపడదు. ఒక్క వాఙ్మయ చరిత్రకే కాదు, దేశ చరిత్రకైనా కాల నిర్ణయ ప్రణాళిక చాలా అవసరం. కాల పరిగణనలోని ముందు వెనుకలు, పూర్వోత్తరాలు నిర్ణయమైతే కాని జాతి ఏయే కాలాలలో ఎట్టెట్టి పరిణామ, వికాసాలు పొందిందో, భాషా వాఙ్మయాలలోను, మతంలోను, కళలలోను ఎప్పుడెప్పుడెట్టి మార్పులు వచ్చినవో, ప్రజాభిరుచి ఎట్లా మారుతూ వచ్చిందో తెలియదు. కాల పరిగణన విద్య చరిత్రకు వెన్నెముక వంటిది. ఆంగ్ల విద్యాగంధం అబ్బిన తరువాతనే దేశీయులైన ఆంగ్ల విద్యాధికులు ఈ కాలనిర్ణయావశ్యకతను ఎక్కువగా గ్రహించారు. అంతకు పూర్వము కవులను గూర్చి, వారి కృతులను గూర్చి పిట్ట కథలవంటి కట్టుకథలే ప్రచారంలో ఉంటూ వచ్చేవి. కవి వ్రాసిన గ్రంథాలే అన్నీ తెలియనప్పుడు కవి జీవిత విశేషాలేమి తెలుస్తాయి?

కవులు గ్రంథాలైతే వ్రాశారుకాని వారు తమ జీవిత చరిత్రలు వ్రాసుకోలేదు. వారు తమ జీవిత చరిత్రల కంటెను తమ కృతులకే ప్రాధాన్యం ఇచ్చారు. ఎందుకంటే కృతి సప్త సంతానాలలో ఒకటి; అది పుణ్యకార్యమూ, కీర్తిదాయకమూ గనుక, కొందరు కవులు తమ కృతులను తమ యిష్టదైవముల పేర చెప్పినా చాలా మంది తమ కాశ్రయ మిచ్చినవారికి, తమ్ము పోషించినవారికి అంకితమిచ్చి కావ్య ప్రారంభంలో సువర్ణతిలకాయమానంగా ఉండేటట్టు కృతి భర్తృవంశాన్ని అభివర్ణిస్తూ వచ్చారు. దాన్ని అనుసరించి – మనకు దేశ చరిత్ర లేకపోయినా కొందరు కృతి భర్తలైన భూపతుల చరిత్రలు తెలుస్తాయి. కొందరు కవులను గురించి, వారి పోషకులను గురించీ – నిజమో అబద్ధమో తెలియని – కొన్ని కథలూ, గాథలూ ప్రచారంలో ఉండేవికదా. వాటిని తగిన ఆధారాలతో పరిశీలించి సాధ్యమైనంతవరకు అబద్ధపు కథలూ, గాథలనూ విడదీసి నిజమయిన వాటిని స్వీకరించడం కవి చరిత్రకారుల విద్యుక్తధర్మాలలో ఒకటి.

కవుల రచించిన కృతులన్నీ ఒక్కచోట దొరికితేనేకాని

వారి చరిత్ర వ్రాయడం సాధ్యంకానిపని. శ్రీ వీరేశలింగంగారి కాలానికి ఆంధ్ర గ్రంథాలస్థితి ఎట్లాఉందో తెలుసుకోవడం చాలా అవసరం. అది తెలిస్తేనేకాని వీరేశలింగంగారు కవుల చరిత్ర ఎట్లా రచింపగలిగినారో మనకు విశదం కాదు.

మనదేశంలో పూర్వకాలమందు - పద్దెనిమిదవ శతాబ్దం వరకూ కూడా గ్రంథాలన్నీ తాటియాకులమీద గంటంతో వ్రాయడం పరిపాటిగా ఉండేది. గ్రంథాలేకాదు అన్ని విధాలైన పత్రాలకు తాళపత్రాలే వాడకం. కారణం అప్పటికి ఇంకా మన దేశానికి కాగితం రాకపోవడమే. వచ్చినా అది అరుదుగా దొరికే పీచుకాగితం, ధర ఎక్కువ. తాటాకుకమ్మలు రెండు కొట్టి తీసుకువస్తే కృతి రచించుటకు కావలసినంత ఆకు. ఇది ఎక్కడపడితే అక్కడ దొరికే వస్తువు; కానీ కర్చులేనిది. ఎటువచ్చీ ఆకులు చక్కగా కత్తిరించి రచన చేయుటకు తగినట్లు అందంగా వాటిని సంతరించాలి. వ్రాయుటకనువుపడే తాళపత్ర గ్రంథనం కూడా పూర్వం ఒక కళగా రాటుదేరింది. దక్షిణ భారతంలో పూర్వప్రబంధాలన్నీ తాళపత్రాలమీద వ్రాసినవే. భారత, భాగవత, రామాయణాదులకు తరువాత ప్రజాహృదయాకర్షకములైనవి ప్రబంధాలూ, శతకాలున్ను, అట్టి కృతులు చదవాలని ఆశగొన్న సంపన్నులు లేఖకులకింతయని ధాన్యభృతియిచ్చి మాతృకలకు ప్రతికలు వ్రాయించుకొని చదువుకొనేవారు. చదవాలని ఆసక్తి ఉన్న వారికే గ్రంథం దొరకేది; అదయినా చాలా కష్టంమీద. ఈ విధంగా పూర్వకాలంలో తాటాకులమీద గంటంతో ముద్దులు మూటగట్టేటట్టు ముచ్చటగా వ్రాయగల ముసద్దీ వ్రాయసకాండ్రకు విలేఖకత్వం ఒక వృత్తిగా ఏర్పడింది.

మనదేశంలో ముద్రణ యంత్రం వచ్చిన తరువాత ఈ కష్టం తీరిపోయింది. అప్పటినుంచి ఒక్కొక్క గ్రంథానికి కావలసినన్ని ప్రతులు తయారయి సులభమైన మూల్యానికి దొరుకుతూ వచ్చాయి. మద్రాసులో 1772వ సంవత్సరంలో ముద్రాయంత్రం ప్రతిష్ఠితమైనా 1800ల ప్రాంతానగాని తెలుగులో పుస్తకం అచ్చువలేదు. అచ్చయినవైనా క్రైస్తవమత గ్రంథాలే. మొట్టమొదట ముద్రణ యంత్రాన్ని మనదేశానికి తీసుకువచ్చినవారు మిషనరీలే; అది క్రైస్తవమత ప్రచారం కోసమే. తరువాత మన దేశంలో ఉన్నతోద్యోగాలు చేయవలసి వచ్చిన సివిలియన్లు తెలుగు నేర్చుకోవలసిన అవసరం కలగడంవల్ల ఆంగ్లేయులు వ్రాసిన తెలుగు వ్యాకరణాలు అచ్చవుతూవచ్చాయి. మరో మూడు నాల్గుదశాబ్దులకుగాని ఆంధ్రులు అచ్చు ఉపయోగం తెలుసుకోలేకపోయారు. అప్పుడయినా దాన్ని మాస, వార, పక్ష పత్రికల కెక్కువగా ఉపయోగించుకొన్నారుకాని తమ గ్రంథాల ముద్రణకుకాదు. ముందుగా అచ్చయినవి భారత, భాగవతాలే. అందువల్ల 1850 నాటికి అచ్చయిన తెలుగు కృతులు మృగ్యంగానే ఉంటూ వచ్చాయి.

ఇక తాళపత్రి గ్రంథాలు సంపాదించదమంటే బహువ్యయప్రయాసలు, ఇప్పటివలె అప్పుడు పుస్తక భాండాగారాలు ఉండేవికావు. తంజావూరు నాయకరాజులు స్వయంగా కవులూ, కవిజనాశ్రయులూ అయినందువల్ల ఆంధ్ర భాషాభిమానులైన వారు స్వోపయోగం నిమిత్తం కొన్నికొన్ని ప్రాచీనాంధ్ర కావ్యాలూ, ఇతర గ్రంథాలూ సేకరించీ, ప్రతులు వ్రాయించీ ఉంచారు. వారి అనంతరం తంజావూర రాజ్యం పరిపాలించిన మహారాష్ట్ర మహీపతులు కూడా తమ రాజ్యంలో తెలుగు రాజభాష అయినందువల్లనూ, సంగీతాని కనువైన భాష అవడంవల్లనూ సంగీత, సాహిత్యాభిమానులైనవారు తెలుగు నేర్చుకొని, తెలుగులో గ్రంథాదులు రచించి ప్రాచీనాంధ్ర తాళపత్ర గ్రంథాలను ఇమ్మడిగా, ముమ్మడిగా సంపాదించీ, మాతృకలకు పుత్రికలు వ్రాయించీ తమ సరస్వతీ మహాలు పుస్తక భాండాగారంలో పదిలపరిచి సంచయాన్ని అభివృద్ధి చేశారు.

ఈ విధంగానే కల్నల్ కాలిన్ మెకెంజీ తన సొంత సొమ్ము వ్యయపరచి దేశభాషలలో రచించిన తాళపత్ర గ్రంథాల నన్నిటినీ కొని కుంపిణీ ప్రభుత్వం వారు మద్రాసు సెంటుజార్జి కోటలో జాగ్రత్త చేశారు. తరువాత చార్లెస్ ఫిలిప్ బ్రౌను అనే కుంపిణీ సివిలు ఉద్యోగి తెలుగుభాష నేర్చుకొని దాని మాధుర్యాది గుణాలకు ఉల్లసిల్లి సొంతధనం వెచ్చించి తెలుగులో ఉన్న కావ్యాలను కొన్నిటిని కొనీ, మరికొన్నిటిని పండితులకు బత్తెకర్చులిచ్చి పంపి వాటికి పుత్రికలు వ్రాయించి తెప్పించి చాలా సేకరించారు. జీర్ణావస్థలో ఉన్న తాళపత్ర గ్రంథాలకు కొన్నిటికి ప్రతులు వ్రాయించాడు; పండితులను పెట్టి నిర్దుష్టపాఠాలు నిర్ణయించి కొన్ని కావ్యాలు పరిష్కరించాడు. ఇవన్నీ మద్రాసు తాళపత్ర లిఖిత గ్రంథ భాండాగారంలోనే ఉన్నాయి. వీరేశలింగంగారు 1887లో ఆంధ్రకవుల చరిత్ర వ్రాయుటకుపూర్వమే పూర్వ కవికృత గ్రంథాలు కొంతవరకు ఈ విధంగా ఒక చోటికి చేరినవి.

ఇట్టి స్థితిలో మనముందు, అనగా 1876-1880ల

మధ్య "ఆంధ్ర కవి జీవితములు" అను పేరుతో విడివిడిగా చిన్న పొత్తములుగాను, పెద్దాపురంనుంచి వస్తూవుండే ప్రబంధకల్పవల్లి అనే పత్రికలోను ప్రచురించారు. శ్రీ గురజాడ శ్రీరామమూర్తిగారు. వారు జీవితాలు వ్రాసిన కవులు చాలా కొద్దిమంది. వారు ఆయా కవుల కాలాన్ని నిర్ణయించుటలో కంటే చాలాకాలంనుంచి ఆ కవులను గురించి ప్రచారంలో ఉంటూవచ్చిన కథలను, గాథలను సేకరించి వ్రాయుటలో ఎక్కువ శ్రద్ధవహించటంవల్ల వారి "కవిజీవితా"లకు వీరేశలింగంగారి "ఆంధ్రకవుల చరిత్రకు" వచ్చిన పేరు దానికి రాకుండాపోయింది.

"పూర్వకాలమునుండియు మనదేశములో జరిత్రములను వ్రాసెడి యాచారమంతగా లేదు. అందుచేత కవుల చరిత్రమును వ్రాయుట యెంతో కష్టసాధ్యమయ్యెను. ఎవ్వరో నలుగురైదుగురు తప్ప కవులెవ్వరును దమ వంశవర్ణనములలో దాము పుట్టిన కాలమునైనను దెలుపుకొనలేదు. గ్రంథరచన చేసిన కాలము నంతకుముందే తెలుపుకొనలేదు. గ్రంథకర్త లనేకులు తమ గ్రంథములను రాజులు మొదలైన వారి కంకితము గనుగొనవలసి యుండుటచేత రాజుల కాలమును గనుగొనుటకైన మనలో చరిత్రములు లేవు. తాము బ్రాహ్మణులకు భూదానాదులను జేసినప్పుడును, గుళ్ళుగోపురములు కట్టించినప్పుడును తామ్రశాసనములను, శిలాశాసనములను వ్రాయించుచు వచ్చిరి. ఆ శాసనములలో సాధారణముగా దాము దానాదులు చేసిన కాలమును వేయించుకొనుచు వచ్చుటచేత తమ్మూలమున రాజుల కాలనిర్ణయమును, వారు కృతులనందుటచేతఁ దద్వారమున గృతికర్తల కాలనిర్ణయమును చేయవలసి వచ్చెను."- (స్వీ.చ; భా. 2; 3వ ముద్రణము; పుట 229).

రాజులు మొదలైనవారికి అంకితమియ్యని కవుల కాలమును కనిపెట్టుట అంతకంటెను కష్టం. అట్టివారి కాలనిర్ణయం ఎట్లా చేయవలసి వచ్చెనో వీరేశలింగంగారే ఇట్లా వ్రాస్తున్నారు:

"కృతకర్తలలో నధిక సంఖ్యాకులు తమ గ్రంథములను రాజుల కంకితమొనర్పక దేవతల కంకితము చేయుచు వచ్చిరి. అట్టివారి కాలమును గనుగొనుటకయి వారు తమ గ్రంథములయందు పూర్వకవులనుగా బేర్కొని స్తుతించినవారి నామములు తక్క వేఱాధారము లేవియు కనబడలేదు. ఆ యల్పాధారమునుబట్టి సరిగా వారి కాల నిర్ణయము చేయుటకు వీలుకలుగలేదు. కొందఱు కవులు తాము ఆధునికులయ్యును భారతకర్తలయిన కవిత్రయమునదక్క నిటీవలివారి నెవ్వరిని కవిస్తుతిలో బేర్కొనకుండిరి. కవుల కాలనిర్ణయమును జేయుటలో లక్షణ గ్రంథములు కొన్ని కొంతవరకు సాయపడినవి. లక్షణ గ్రంథములను జేసినవారు కొందరు తాము చెప్పిన లక్ష్యములుగా పూర్వకావ్యములనుండి పద్యముల నుదహరించుచువచ్చిరి. అప్పకవి తాను గ్రంథరచన కారంభించిన కాలమును దన పుస్తకమునందే వ్రాసికొనియున్నాడు. ఇట్లాతని కాలము తెలియుటచేత నప్పకవీయమునందు బేర్కొనబడిన కవులందరును నాతనికి బూర్వమునందుండినవారగుట నిశ్చయమేయైనను, వారిలో నెవ్వరెంత పూర్వులో తెలుసుకొనుట కా పుస్తకము సహితము సహకారి కాలేదు. ఇట్టెన్నియో కష్టములున్నను నే నెంతో శ్రమపడి కాల నిర్ణయమును గొంతవరకు జేయగలిగినాడను"-(స్వీ. చ; భా. 2; 3వ ముద్రణము. పుటలు 229-30)

ఆంధ్రకవుల చరిత్ర వ్రాయుటకు వీరేశలింగంగారు పడ్డశ్రమ అంతా కాలనిర్ణయాన్ని గురించే. పూర్వ కవి కృత గ్రంథాలు చాలావరకు మద్రాసులోనూ, తంజావూరులోను దొరుకుటవల్ల వారి ప్రయత్నానికి మంచి ప్రోత్సాహం కలిగింది. ఆయా పట్టణాలకు వెళ్ళి నెలలకొద్ది ఉండి అచటి గ్రంథభాండాగారాలలో ఉదయం 10 మొదలు సాయంత్రం 5 గంటల వరకు కూర్చుని తాళపత్ర గ్రంథాలు చదివి వాటిలో తమకు కావలసిన భాగాలు వ్రాసుకొంటూ వారు చాలా శ్రమపడ్డారు. వారు చాలా శ్రమపడి వ్రాసుకొన్న భాగాలుగల పుస్తకం ఒకమారు పోవడం కూడా తటస్థించింది. వారే చెపుతున్నారు చూడండి :

"ఒకనాడు ట్రాముబండిలో నెక్కిపోయి సముద్రతీరమున (మద్రాసులో) దిగి పుస్తకభాగములను వ్రాసికొనవలెనన్న యుద్దేశముతో నక్కడినుండి కోటకు నడిచిపోయి, కావలసిన పుస్తకమును పుస్తక భాండాగారమునుండి పైకి తీయించి వ్రాసికోబోగా నాకంచుకకోశము(చొక్కా జేబు)లోని వ్రాతపుస్తకము కనబడలేదు. ట్రాముబండిలో దానిని విడిచివచ్చితినని వెంటనే మరల సముద్రతీరమునకు బోయి మరియొక్క

ట్రాముబండినెక్కి విద్యుద్భలోత్పాదక స్థానమునకువెళ్ళి యచట మొదటనెక్కి వచ్చిన బండిని నడుపువాని కనుగొని యడుగగా నత దేదో వ్రాత పుస్తకము బల్లమీదనుండగ క్రింద పారవైచితినని చెప్పెను. అతని బండిలో మరలనెక్కి యాతడు పుస్తకము పారవేసితినన్న స్థలమునకు వచ్చి దిగి యీ సమీపమున వెదకి చుట్టుపట్టులవారిని విచారించి పుస్తకమిచ్చినచో సొమ్మిచ్చెదనని యాశపెట్టితినిగాని పుస్తకముజాడ యెక్కడను కానరాలేదు. పుస్తకము తెచ్చియిచ్చినవారి కిరువదియైదు రూపాయలు పారితోషిక మిచ్చెదనని ప్రకటించినను కార్యము లేకపోయెను. ఇందుమూలమున నేను నెల దినములు పడిన కష్టమంతయు నిష్ఫలమయ్యెను." – (స్వీ. చ.; భా. 2; 3వ ముద్రణము, పుట. 231)

తెలుగు కావ్యముల, లక్షణ గ్రంథములమాట అటుంచి తెలుగు కృతులు అంకితం గొప్ప రాజుల మొదలైనవారి కాలము తెలుసుకొనుటకు పూర్వులు రచించిన చరిత్ర గ్రంథములు లేకపోవడంచేత మరింత కష్టమైనది. ఇందుకు కావలసిన ప్రధానసామగ్రి శాసనాలు. ఇవి శిలాశాసనాలు, తామ్రశాసనాలు అని రెండు విధాలు. సర్వ సాధారణంగా శిలాశాసనాలు దేవాలయాలలోని ప్రధాన దేవతలకు చేసిన దానాలను, తామ్రశాసనాలు శాస్త్ర పండితులైన బ్రాహ్మణులకు చేసిన దానాలను తెలిపే నేటి దానపత్రాలవంటివి. వాటిలో చెప్పిన దానకాలాన్ని అనుసరించి – వీరేశలింగంగారు తెలిపినట్లు – రాజకాల నిర్ణయం, తద్వారా అంకితమిచ్చిన కృతికర్త కాలనిర్ణయం చేయాలి. కాని అప్పటికీ నాటివలె ప్రభుత్వ శాసనశాఖ ఏర్పడలేదు – శాసనాలు సంపాదించుటకు ఎక్కడెక్కడ ప్రాచీన నిర్మాణాలు, శాసనాలు ఉన్నాయో విచారించి వాటికన్నిటికీ పట్టికలు తయారుచేయవలసిందని మద్రాసు ప్రభుత్వంవారు జారీ చేసిన ఉత్తర్వు ననుసరించి 1875లో రాబర్ట్ సూయెల్ దొర స్థానికాధికారుల సాయంతో వాటిని గురించిన వివరాలు సంపాదించి List of Antiquarian remains of the Madras Presidency అనేపేరుతో రెండు సంపుటాలు ప్రకటించాడు. వీటివల్ల ఏయే గ్రామాలలో ఏయే శాసనాలున్నాయో అవి ఎవరివో ఏకాలానివో తెలియడమే కాకుండా ఆ శాసనాల నాధారం చేసుకొని వ్రాసినకొన్ని పూర్వపు రాజ్యాల, సంస్థానాల చరిత్ర కూడా అరకొరలుగా అయినా కొంత విశదమవుతుంది. అప్పటికి బయలుపడిన తామ్రశాసనాలను, తెలియవచ్చిన శిలాశాసనాలను పురస్కరించుకొని కుంఫిణీ ప్రభుత్వోద్యోగీ, సంస్కృతాంధ్ర పండితుడూ అయిన బుక్కపట్నం రాఘవాచార్యులుగారు చెన్న రాజధాని కౌన్సిలు సభ్యుడుగా ఉండిన డి.యస్. కార్మికేలుదొర ఉత్తర్వును అనుసరించి వ్రాసిన ఆంధ్రదేశ చరిత్రకూడా అముద్రితంగా ఉంది. ఇవన్నీ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలోనే ఉండేవి. ఇన్ని వచ్చినా తెలుగుదేశ చరిత్రకు చట్రమైనా ఏర్పడలేదు. అన్నీ లొసుగులే. అయినా వీరేశలింగంగారు లభ్యమైన ఈ లిఖిత పుస్తక సంచయాన్నంతను పరిశోధించి రాజుల కాలనిర్ణయం ఒక రీతిని కుదుర్చుకొని ఆంధ్రకవుల చరిత్ర రచించారు. తాము పడిన కష్టమును గురించి ఇట్లా వ్రాసికొన్నారు.

"ఇప్పటివలె అప్పుడు గ్రంథాలయములు లేవు. ఇప్పుడు ముద్రింపబడి యెల్లవారికిని సుసాధ్యములయియున్న గ్రంథములలో నూరులకొలది కాకపోయినను పదులకొలదియైనను తెలుగు గ్రంథములప్పుడముద్రితములై తాళపత్రిక శరణ్యములయి దుస్సాధ్యములయియుండెను. ఇప్పుడు ప్రకటింపబడియున్న శిలా, తామ్రశాసనాదులలో ననేకములప్పుడు ప్రకటింపబడ కుండెను. ఇట్టి స్థితిలో కవుల చరిత్రమును వ్రాయుట యప్పుడెంత కష్టకార్యముగా నుండునో నేను చెప్పనక్కర లేకయే బుద్ధిమంతులూహించుకో వచ్చును. అయినను నేను వ్యయ ప్రయాసలకు వెనుక దీయక పుస్తక సంపాదనమునకై చెన్నపురి, తంజావూరి మొదలైన దూరపుదేశములకు సహిత మరిగి, యిచ్చినవారి యొద్దనుండి తాళపత్ర పుస్తకములను సంపాదించియు, గొన్నిటికి మాతృకలకు పుత్రికలు వ్రాయించియు, నియ్యనివారికడ జీర్ణతాళపత్ర పుస్తకముల నెరవుగ గొని చదివి వానినుండీ కావలసిన చరిత్రాంశములను వ్రాసికొనియు.. నా కప్పటికి లభించిన పరికరసహాయ్యమున నాంధ్ర కవులను గూర్చి యేదో తోచిన దానిని వ్రాసి ప్రకటించి కవులచరిత్ర మనిపించితిని."

ఇంతగా కష్టపడి రచించిన గ్రంథము గనుకనే ఆయన తాను చేసిన గ్రంథాలలో నెల్ల ఆంధ్రకవుల చరిత్రే ప్రధానమయినదని చెప్పుకొన్నారు. నిజమే అప్పటికే కాదు మొన్న మొన్నటిదాకా కూడా. కొంచె మించుమించుగా ఇప్పటికీ కూడానేమో ఆయన రచించిన ఆంధ్రకవుల చరిత్రే

### పనిలోనే ఒరిగిన శిఖరం

ఏప్రిల్ 15న బయలుదేరి చెన్నపురి వెళ్లి కొమర్రాజు లక్ష్మణరావుగారి ఇంట్లో ఉన్నారు. వెళ్లిన దగ్గర్నుంచీ కవుల చరిత్ర రెండో భాగం పునస్సంశోధిత ముద్రణం తీసుకు రావాలనే తపనతో ఓపికలేకపోయినా పని చేశారు. 1919 మే 27న కొమర్రాజు గారి ఇల్లు 'వేదవిలాస్'లో కవుల చరిత్రకు సంబంధించిన శ్రీకృష్ణదేవరాయల చరిత్ర ప్రూఫులు దిద్దుతూ కుర్చీలో ఒరిగిపోయారు.

1919 మే 28న పంతులుగారి భౌతికకాయానికి దహన సంస్కారాలు చేశారు. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, చెన్నాప్రగడ భానుమూర్తి మొదలయినవారు శవవాహకులుగా ఉన్నారు. రుద్రభూమిలో కందుకూరి వారి ఆత్మశాంతి కోసం ఎంతో మంది ప్రార్థనలు చేశారు.

తన దేహాన్ని, గేహాన్నీ, కాలాన్నీ, ధనాన్నీ – యావత్తూ సంఘసంస్కరణ కోసం ధారపోసిన మహనీయుడు శాశ్వత నిద్రపోయాడు.

**– ఆచార్య పర్వతనేని సుబ్బారావు** *(ఆంధ్ర సాహితీ స్రోతస్విని – తెలుగు మహాజన సమాజం స్వర్ణోత్సవ ప్రత్యేక సంచికలోని 'కందుకూరి భాషా సేవ' వ్యాసం నుండి)*

పరమప్రామాణిక గ్రంథంగా ఉంటూ వచ్చింది. ఆ గ్రంథం ప్రతి పుటలోను ఆయన పడ్డశ్రమ గోచరిస్తూనే ఉంటుంది. ఓపిక, కార్యదీక్ష, సత్యాసత్య వితర్కవివేకము, సత్యం మీద లక్ష్యము, గుణదోష విచారము, న్యాయబుద్ధి, ఇవి పరిశోధకుని కుండవలసిన ప్రధాన గుణాలు. ఇవి వీరేశలింగంగారికి సహజములైనవి. ముందేర్పరచుకొన్న యభిప్రాయానికి అనుగుణంగా సాధనకలాపాన్ని మలచి సిద్ధాంతం చేయడం, అనుచితమైన అభినివేశం, దురభిమానం – ఇవి పరిశోధకుని ప్రామాణికతకు భంగం తెచ్చేవి. వీరేశలింగంగారికి సత్యం మీదే లక్ష్యం కాని ప్రతీది మనదే గొప్పదన్న దురభిమానం లేదు. అందువల్లనే ఆయన పరిశోధన మండలికి అప్పటికీ ఇప్పటికీ పూజ్యుడయినాడు. పందొమ్మిదవ శతాబ్దం కడపటి దశకాలలో ఆయనను మించిన – కాదు, ఆయనతో సరిసమానుడయిన పరిశోధన పండితుడు ఆంధ్రులలో లేడు. మన దేశంలో పరిశోధన జ్యోతిని వెలిగించిన ఆంధ్రులలో ఆయన ప్రథముడూ, ప్రముఖుడూను. ఆయనతోనే తెలుగు దేశంలో పరిశోధన ప్రారంభం అసదృశమైన ఇతర కార్యకలాప భారాన్ని తలకెత్తుకొని ఇంతటి పరిశోధన కార్యాన్ని ఎట్లా నిర్వహించాడో ఆయన అని ఆశ్చర్యం కలుగుతుంది. ఎందుచేతనంటే ఏకాగ్రత ఉంటేనేకాని సాగేపని కాదు ఈ పరిశోధన.

వీరేశలింగంగారు అంత శ్రమపడి వ్రాసిన ఆంధ్రకవుల చరిత్రలో తప్పులున్నవని నిశితముగ దానిని విమర్శించిన వారున్నారు. అంత శ్రమపడి వ్రాసిందిగనుక దానిని విమర్శింపకూడదని కాదు. దోషములెక్కడ ఉన్నా విమర్శనీయములే. కాని విమర్శనము సహృదయ సహముగా ఉండాలి; పరిశోధన అనేది ఎంతపాతదో అంత కొత్తది. కొత్త శాసనములు, కొత్త గ్రంథములు బయలు పడుటచేత ఇదివరలోచేసిన పాత సిద్ధాంతములు మారిపోవచ్చును, అదివరకు వ్రాసినదానిలో కొన్ని సవరణలు చేయవలసిన అవసరం కలుగవచ్చును. అంతమాత్రంచేత ఆధునిక పరిశోధకులు అంతకుపూర్వపు పరిశోధకులు వ్రాసినవి తప్పులతడికలనీ, చేసిన సిద్ధాంతము లవసిద్ధాంతాలనీ ఆదిక్షేపణచేసి, తామేమో వారికంటే అధికులైనట్లు భావించుట అహంభావ మనిపంచుకొనును కాని వివేకమనిపించు కొనదు. అది పరిశోధన స్వభావము నెరుగని అజ్ఞానవిలసనము. వెనుకటివారి పరిశోధనా ఫలితములు తరువాతి వారికి సోపానాలవంటివి. వెనుకటి పరిశోధకుల తమకుదొరికిన సాధనకలాపముతో తమకుతోచినట్లు, ఆ గ్రంథాదులు రచించారుగనుకనే ఆధునిక పరిశోధకులు కొత్తగా లభించిన విషయాన్ని సమన్వయ దృష్టితో పరిశీలించి కొత్త సిద్ధాంతాలు చేయుటకు, కొత్త విషయాలు చెప్పుటకు అవకాశం కలిగింది. ఇంతకూ శ్రీ వీరేశలింగంగారు చెప్పినట్లు కొత్తగాపూనుకొని ఒక పనిచేయడం కష్టం, చేసినదానికి వంకలు పెట్టి దానిలో తప్పులు పట్టడం సులభమే.

ఆంధ్రకవుల చరిత్ర మొదటిభాగంవలె మిగిలిన రెండు భాగాలూ ఆయన చేతిమీదుగా సంస్కరింపబడకపోవడం ఆంధ్రుల దురదృష్టం.

***(ఆంధ్రకవుల చరిత్రము పుస్తకం ముందుమాట – విశాలాంధ్ర ప్రచురణ)***

❖

# ఆంధ్రుల ఆలోచనా ధోరణిపై వీరేశలింగంగారి ప్రభావం

- కొడవటిగంటి కుటుంబరావు



*నేటి రాజకీయ సంఘర్షణ అనివార్యంగా వచ్చిపడింది. చివరకు స్వాతంత్ర్యం కూడా వచ్చింది. కాని ఈ స్వాతంత్ర్యాన్ని అందిపుచ్చుకున్న వారికి వీరేశలింగంగారి సంస్కృతిలో శతాంశం లేకపోయింది. వీరేశలింగం హేతువాది; మూఢభక్తిని, స్వార్థంతో కూడిన ప్రార్థనలను, ధనదాహాన్ని, అధికార దుర్వినియోగాన్ని తీవ్రంగా ద్వేషించిన వాడు; సర్వతోముఖాభివృద్ధి గురించి స్పష్టంగా చెప్పినవాడు; కులతత్వాలను ఖండించిన వాడు.*

*ఈ జాడ్యాలను నిర్మూలించడానికి మన పాలకులు ఎలాంటి కృషి చేయపోగా, వీటన్నింటినీ పెంపొందించే భౌతిక జీవిత పరిస్థితులను ప్రోత్సహించారు.*

ఒక్కొక్క జాతి అంధకారంలో మునిగి అధోగతి పాలైనప్పుడు ఆజాతి భవిష్యత్తు మూర్తీభవించినట్టుగా ఒక్క మహాపురుషుడు పుట్టుకొస్తాడు. ఆంధ్రజాతి పురోభివృద్ధికి ప్రతిరూపంగా నిలచి ఉద్బోధించి, పోరాడి హెచ్చరించి ఆంధ్రుల భావి సంస్కృతికి పునాదులు వేసినవాడు కందుకూరి వీరేశలింగం. ఆంధ్రుల జీవితంలో ఏ ఒక్క రంగాన్నీ ఆయన ఉపేక్షించలేదు. "ఇంచుమించుగా వున్న విషయముల యందును సమానముగా వృద్ధినొందుచుండుటమే అభివృద్ధి యగును; గాని తక్కిన విషయముల యందధమ దశలు నుంచి విషయమునందు మాత్రము వృద్ధి చెందడం నిజమైన యభివృద్ధి కాదు" అన్నది ఆయన మతం.

ఈ "అభివృద్ధి" కోసం పాటుపడడంలో ఆయన రెండు విధాల "పూర్ణత్వం" ప్రదర్శించాడు. చివరిదాకా ఆయన అభివృద్ధి పొందవలసిన రంగాలను అన్వేషిస్తూనే వచ్చాడు. ఆయన వ్యవహారిక భాషావాదాన్ని బలపరచటం ఇందుకు ఉదాహరణ. మరొకటి ఏమంటే, తాను చేపట్టిన ప్రతి కృషిని, తన సర్వశక్తులను ధారపోసి కొనసాగించాడు. అనేక రంగాలలో ప్రసిద్ధి సాధించిన వారందరికీ అభ్యంతర జీవితమంటూ వుంటుంది. వీరేశలింగంగారికి దాదాపు అలాటిది లేనట్టే కనిపిస్తుంది. మామూలు సంసార తాపత్రాయలన్నీ ఆయన ఉద్యమంలో లీనమైపోయాయి. తన పిల్లల కోసంగాని, డబ్బు పోగుచేయడంకోసం గాని ఆయన సొంత తాపత్రయంగా భావించలేదు. ఆంధ్రజాతే ఆయన పిల్లలు, తన సంపాదన అంతా వారి భవిష్యత్తుకే అంకితమయింది. ఆంధ్రులకు ఆయన తండ్రే - ఆదర్శమైన తండ్రి కూడాను.

ఈ సందర్భంలో ఆయన పూర్ణత్వానికి తోడ్పడిన మరో అంశం కూడా వున్నది. జాతిని సంస్కరించడానికి పూనుకొన్న వీరేశలింగం తనను తాను సంస్కరించుకుంటూ వచ్చాడు.

ఆయన సాగించిన సంస్కరణోద్యమం సాగాలంటే ఆత్మబలం కావాలి. పై వాళ్ళ సపోర్టు కూడా కావాలి. తమ విశ్వాసాలలో తనకుగల బలమైన విశ్వాసం. అనన్యమైన కార్యదీక్ష, మొండితనం, ధైర్యసాహసాలు ఆయనకు ఆత్మబలం చేకూర్చాయి. విద్యార్థులు, సంస్కారహృదయులు ఆయనను బలపరిచారు. నాయకుడికి వుండదగిన అన్ని లక్షణాలు వీరేశలింగంలో వుండడం గొప్ప విషయం. ఒక నాయకుణ్ణి అనుసరించగోరేవారు ఆ నాయకుడి బలం గుర్తించి తాము బలం పొందుతారు. ఎంత మందికైనా బలాన్నివ్వగల శక్తి ఆయనలో వున్నట్లు కనిపిస్తుంది.

దేవులపల్లివారు ఒకసారి "వీరేశలింగం రాక్షసుడు" అన్నారు. అవును. అంచనాలకు అందనిది రాక్షసబలమే. అందుకే ఆయన తన శత్రువులను హడలగొట్టగలిగారు.

వీరేశలింగం అభ్యుదయం కోసం సాగించిన అపారకృషిని గురించి ఇక్కడ వివరించనవసరంలేదు. ఈ సావెనీర్ చదివిన వారందరికి ఆ వివరాలు తెలుస్తాయి.

ప్రస్తుత సమస్య ఏమిటంటే - ఈ సమస్య సావెనీర్‌లోని వ్యాసాలలో తల యెత్తుతున్నది. వీరేశలింగంగారి కృషికి పర్యవసానం ఏమిటి? దీని గురించి అభిప్రాయ భేదాలువున్నాయి.

"Veeresalingam pantulu worked miracles in the field of social reform particularly. But it will be wrong to

suppose that this was the last word in the field... The efforts of Veeresalingam pantulu and his friends should not be taken as anything more than pioneering and experimental or symbolic endeavours at best". అన్నారు గోష్ఠి సుబ్బారావుగారు.

"వీరేశలింగంగారే లేకపోతే తెలుగుదేశం ఎంత అధోగతిలో వుండి వుండేదే ఊహించడం కష్టం" అన్నారు మంత్రి వాసుదేవరావుగారు.

"ప్రస్తుతం సమాజంలో వస్తున్న మార్పులను వీరేశలింగంగారి కృషి కోణాల నుంచే మేము కొలవకపోలేదు కాని వచ్చిన మార్పు, జరిగిన చైతన్యం బహు కొద్ది పాటిది మాత్రమే కాదా?" అని అడ్డుమిల్లి పూర్ణచంద్రరావుగారు అడుగుతున్నారు. "మన స్వాతంత్ర్యోద్యమం ఒక విధంగా సాంఘిక సంస్కరణోద్యమాన్ని నీరుగార్చినదేమోనని అనిపిస్తున్నది" అని కూడా వారు సంశయించాడు.

ఇదొక ప్రశ్న. వీరేశలింగంగారు చించి చెండాడిన దుష్ట సాంఘికాచారాలలో చాలా భాగం ఈనాడు మరింత తీవ్ర రూపంలో మన ఎదుట వున్నాయి. అయితే, ఆయన కృషి వృథా అయిందనాలా"?

ఈ ప్రశ్నకు తారకంగారు ఒక సమాధానం ఇచ్చారు: "సంఘస్కరణకు అంతులేదు. సమాజంలో ఎప్పటికప్పుడు ఆచారాలు వెర్రితలలు వేస్తూనే వుంటాయి. ఏ మహానుభావుడో వీటిని నిర్మూలించడానికి జన్మిస్తూనే వుంటాడు."

దీనికి ఒకటే అభ్యంతరం: అన్నప్పుడల్లా ఒక వీరేశలింగం జన్మించడు. అంతదాకా జాతి రొచ్చులో పొర్లవలసిందేనా?

నాకు ఒకటి తోస్తుంది. వీరేశలింగంగారు సంఘ సంస్కరణలను స్వాతంత్ర్యానికి ముందు మెట్టుగా భావించారు. తన వంటి సంస్కారి సిగ్గుపడదగిన స్థితిలో వున్న జాతి స్వాతంత్ర్యాన్ని ఎలా జీర్ణించుకుంటుంది? ఇది ఎంతైనా సమర్థనీయం.

రెండో సంగతి ఏమంటే, సంస్కర్తలు ప్రారంభించిన దాన్ని రాజకీయవాదులు పూర్తి చెయ్యాలి. వీరేశలింగంగారి సంస్కరణోద్యమం కొనసాగినంత వరకు ఆయనకు అధికారుల అండ వుంటూ వచ్చింది. ఆయన ప్రారంభించిన సంస్కరణ, సంఘర్షణ రాజకీయ సంఘర్షణ రూపం దాల్చనేలేదు.

నేటి రాజకీయ సంఘర్షణ అనివార్యంగా వచ్చిపడింది. చివరకు స్వాతంత్ర్యం కూడా వచ్చింది. కాని ఈ స్వాతంత్ర్యాన్ని అందిపుచ్చుకున్న వారికి వీరేశలింగంగారి సంస్కృతిలో శతాంశం లేకపోయింది. వీరేశలింగం హేతువాది; మూఢభక్తిని, స్వార్థంతో కూడిన ప్రార్థనలను, ధనదాహాన్ని, అధికార దుర్వినియోగాన్ని తీవ్రంగా ద్వేషించిన వాడు; సర్వతోముఖాభివృద్ధి గురించి స్పష్టంగా చెప్పినవాడు; కులతత్వాలనుఖండించిన వాడు.

ఈ జాడ్యాలను నిర్మూలించడానికి మన పాలకులు ఎలాంటి కృషి చేయపోగా, వీటన్నింటినీ పెంపొందించే భౌతిక జీవిత పరిస్థితులను ప్రోత్సహించారు. అది వీరేశలింగంగారి తప్పు ఎలా అవుతుంది? అందుచేతనే అడ్డుమిల్లి పూర్ణచంద్రరావుగారన్నట్లు "విప్లవం, ఒక సాంఘిక విప్లవం, ఒక సాంస్కృతిక విప్లవం, ఒక మానసిక విప్లవం మనకిప్పుడవసరం. ఈ విప్లవాలకు పాలకులు ఎంతవరకు సహకరిస్తారు. మన పాలకులు "ప్రయారిటీలు" జనసామాన్యానికి అర్థం కావు. టూరిస్టు హోటళ్ళ నిర్మాణానికి కోట్లకొద్ది ఎందుకు ఖర్చవుతున్నదో ఇళ్లు లేని జనానికి ఏం తెలుస్తుంది? ఏ క్షణాన ఏ రాజకీయ బురఖా తగిలించుకుంటారో తెలియనివాళ్ళకు ఎలా ఓటు వెయ్యాలో చదువుకున్నవాడికి కూడా తెలియదుగదా; మంత్రులు, శాసనసభ్యులు తిరుపతి యాత్రలు చేస్తుంటే వీరేశలింగంగారి ఉపదేశాలు ఎవరు పాటించేటట్టు?

ఇంకొకటి కూడా జరిగింది. తెలుగు వాళ్లు వీరేశలింగాన్ని విస్మరించారు. ఆయన రచనలన్నీ కాకపోయినా ఆయన ప్రబోధాలన్నీ ప్రతి తెలుగువాడు అనుక్షణం మనసులో వుంచుకుంటే వాటి ప్రభావం మన రాజకీయ జీవితంపైన ఎంతైనా వుండేది. అది జరగలేదు.

వీరేశలింగంగారి "ఆత్మకథ" ప్రచారంలో వున్నట్టు కనబడదు. కాని, నార్ల వారు సాహిత్య అకాడమీ వారికి వీరేశలింగం మీద ఒక అద్భుతమైన, క్లుప్తమైన పుస్తకం రాసిపెట్టారు. అది తెలుగులో అచ్చువేసి బైబిల్‌లాగ పంచదగిన పుస్తకం. ఆ నార్లవారే అంతకన్న సంగ్రహంగా వీరేశలింగం మీద ఇంగ్లీషులో ఒక వ్యాసం రాసి ఈ సావెనీర్‌కు ఇచ్చారు. అది వ్యాసాలన్నిటికి మణిపూసలా వున్నది. ఆంధ్రులందరు కనీసం ఈ వ్యాసం చదివినా చాలుననిపిస్తుంది.

నార్లవారి వ్యాసం తరువాత మరో అరడజను ఇంగ్లీషు వ్యాసాలు, ఒక డజను తెలుగు వ్యాసాలూ, ఒక అరడజను పద్యాలు ఈ సావెనీర్‌లో వున్నాయి. వ్యాసాలలో కొంత పునరుక్తి తప్పనిసరి అయినా, సంకలనం చక్కగానే జరిగిందని చెప్పాలి.

వీరేశలింగంగారిలాగే టాగోర్‌గారు కూడా దేశానికి సంఘ సంస్కరణ ఎక్కువ అవసరమన్నారన్న సంగతిని ఎన్.బి.వి.పట్టాభిరామారావుగారు గుర్తు చేస్తూ, స్వాతంత్రోద్యమంలో "రివైవలిజం" అంతర్భాగంగా వుండిన సంగతిని ప్రస్తావించారు. స్వాతంత్ర్యం వచ్చాక, సంఘ

సంస్కరణ లేని ప్రాంతాలలో మతమౌఢ్యం మరింత విస్తరించడం. మత ప్రాతిపదికపైన ఏర్పడిన రాజకీయ పార్టీలు బలపరచడం మనకు తెలుసు. కొద్ది విషయాలలో సంఘ సంస్కరణోద్యమం స్వాతంత్ర్యోద్యమంతో ఏకీభవించింది. పట్టాభిరామారావుగారన్నట్టు గాంధీగారి కన్నచాల ముందే వీరేశలింగంగారు అస్పృశ్యత పైన ధ్వజమెత్తాడు. కొంతవరకైనా పరిష్కారం కావడానికి కారణం సంస్కరణోద్యమం అయివుండవచ్చు.

స్త్రీల ఉన్నతికి వీరేశలింగం చేసిన కృషి గురించి ఆవుల సాంబశివరావుగారు ప్రస్తావించారు. ప్రజలలో వుండే రకరకాల మౌఢ్యాన్ని వీరేశలింగం ఎలా ప్రతిఘటించినదీ మాలకొండయ్యగారు వివరించారు.

"With the astonishing means he achieved in all his crusades against our cruel customs. Veeresalingam has proved to the successive generations that the toleration of any custom which does not stand to reason leads to social anarchy."

అని వీరేశలింగం జీవితం నుంచి మనం నేర్చుకోదగిన గుణపాఠాన్ని ఒక్క ముక్కలో చాల చక్కగా చెప్పారు. మూడు తరాలవాళ్ళు ఈ గుణపాఠాన్ని నేర్చుకోకపోవడం చేతనే ఇవాళ సాంఘిక అవ్యవస్థ పెచ్చుమీరింది.

వీరేశలింగంగారి నాటక రచన గురించి కూర్మా వేణుగోపాలస్వామిగారు రాశారు. నాటకస్రష్టగా వేణుగోపాలస్వామిగారు మరింత హెచ్చుగా అంచనా వేశారేమో. "శాకుంతలం" అనువాదం ఒకటే నిజమైన విజయం సాధించినట్టు కనబడుతుంది. నాటకాలలో పాత్రోచిత భాష ప్రవేశపెట్టడానికి వీరేశలింగంగారు చేసిన కృషిని కాదనడానికి వీలులేదు. అయితే అలాంటి భాషను సాధారణంగా హాస్యానికి వాడేవారు. నా చిన్నతనంలో ఒక నాటకంలో ఈ సంభాషణ ఉండేది. "అగేయిస్సమ్మ; అనికోర్టు ప్యూను మూడు సార్లు పిలుస్తాడు. "ఆశమ్మా పిలుస్సున్నారే." అంటుంది సాక్ష్యం చెప్పే వితంతువు. నాటకం పేరు గుర్తులేదు కాని, వ్యావహారిక భాషావాదం తల ఎత్తక ముందు వ్రాసిన నాటకమే. దాన్ని మా మేనమామలు ఆడారట. మా రెండో మేనమామ నాటకాలలో హాస్య పాత్రలు ధరించి, మామూలు భాష మాట్లాడి జనాన్ని నవ్వించే వాడట.

వీరేశలింగంగారు అనేక పరువునష్టం దావాలకు గురికావటమూ, నవలలను ధారావాహికంగా అచ్చువేసే విధానం ప్రారంభించటమూ బి.వి.చలపతిరావుగారూ గుర్తుచేశారు.

తెలుగు వ్యాసాలలో డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారు తమ వ్యాసంలో హెచ్చుగా కవుల చరిత్రలు రాయటంలో గల కష్టాలను పేర్కొన్నారు.

అద్దుమిల్లి పూర్ణచంద్రరావుగారి వ్యాసం ఈనాటి పరిస్థితులను తూర్పారబడుతున్నది. ఆనాడు వీరేశలింగం ఒక్కడు సాగించిన కృషి ఈనాడు మేధావులు కనీసం సమష్టిగానైనా సాగించవచ్చునని ఆయన సూచన. ఈనాడు దేశంలో ఇంత రాజకీయ చైతన్యం ఉండి సాంఘిక చైతన్యం లేకపోవడం ప్రజా జీవితం పట్ల ఎవరికీ శ్రద్ధ లేకపోవడం చిత్రమే.

వీరేశలింగంగారి "త్రికరణశుద్ధి"ని మెచ్చుకుంటూ డాక్టర్ అక్కిరాజు రామాపతిరావుగారు "గొప్ప మానవతావాది పంతులు గారు. దీనుల పట్ల కరుణతో మనస్సు కరిగిపోగా, చేతగానితనంతో చేతులు ముడుచుకుని కూర్చోలేదు. ఒంటరిగా రంగంలోకి దూకి, మహా భయంకరంగా యుద్ధం చేశాడు" అన్నారు. ఈనాడు మానవతావాదులైతే చాలామంది ఉన్నారు. వారు మిగిలిన విషయాలలో పంతులుగారిని అనుకరించడానికి సిద్ధంగా లేదు. ప్రారబ్ధం!

"పౌరాణికయుగం, ప్రబంధయుగాల నాటి పాండిత్యానికి, రచనా కౌశల్యానికి ఏమాత్రం తీసిపోని ప్రతిభ ప్రకటించి కూడా, ప్రజానీకానికి అందుబాటులో వుండే సరళమైనశైలిలో, తేటతెల్లమైన తెలుగులో రకరకాల జ్ఞానాన్ని, వాఙ్మయాన్ని, ఆంధ్రులకు అందిచ్చాడు" అన్నారు తారకంగారు.

ఒక్క భాషా, వాఙ్మయాల విషయంలోనే కాదు. మతాచారాల విషయంలో కూడా వీరేశలింగం అనేక యుగాలు దాటి భవిష్యత్తులోకి అడుగుపెట్టిన అసాధారణ జీవి. ఆయన పాండిత్యానికి ఉద్వాసన 'సులభ గ్రాంధికం" అవలంబించి గిడుగు వారి వ్యావహారిక భాషావాదానికి రంగాన్ని సిద్ధం చేశారు. ఆయన భాషలో తెచ్చిన ఈ మార్పు భాషాతత్వ జ్ఞానం వల్ల వచ్చినది కాదు. ప్రజలకూ, సాహిత్యానికి ఉండవలసిన సాన్నిహిత్యాన్ని పురస్కరించుకుని వచ్చినది. ప్రజలకు సన్నిహితంకావటం అభ్యుదయానికి మార్గమని ఇదే రుజువు చేస్తుంది. అంతేగాని సిద్ధాంతాలను వల్లె వేసిన మాత్రన ప్రజలు సన్నిహితులు కారు. "మనదేశాభివృద్ధికిపుడు పని కావలెనుగాని యది లేని పొడి మాటలు కావలసి యుండలేదు." అని వీరేశలింగం గారే అన్నారు. మన దురదృష్టంకొద్దీ ఈనాడు"పొడిమాటలు" జాస్తిగానూ, పని చాలా తక్కువగానూ ఉండడం జరుగుతున్నది. (ఆంధ్రజ్యోతి దినపత్రిక, 18-10-1970) (కొడవటి కుటుంబరావు సాహిత్య వ్యాసాలు పుస్తకం నుండి) ◆

# తెలుగు సమాజం - కందుకూరి వీరేశలింగం

- వకుళాభరణం రామకృష్ణ




***1920 దశకంలో జాతీయోద్యమ విజృంభణ తర్వాత సంస్కరణోద్యమాలు క్షీణించినా, వాటి ప్రభావం ఆంధ్రదేశపు మేథోవాతావరణంలో ఒక భాగంగా వుండి, ఆ తర్వాత తలెత్తిన కమ్యూనిస్టు ఉద్యమం ఆ వారసత్వాన్ని పుణికి పుచ్చుకొని సంఘసంస్కరణ ప్రాముఖ్యాన్ని పునరుద్ఘాటించింది. ఆనాటి నుండి నేటివరకు వీరేశలింగం నిర్వహించిన ఉద్యమ ప్రభావం ఆంధ్రదేశంపై కొనసాగుతూ వుండడం ఆయన మిగిల్చిపోయిన వారసత్వానికి నివాళి.***

వీరేశలింగానికి జీవితంలో లభించిన గొప్ప సానుకూలత ఆయన అర్థాంగి రాజ్యలక్ష్మమ్మ. అంత మరీ బాల్య వివాహం కాకున్నా చిన్నవయస్సునే వారిద్దరికి పెండ్లి జరిగింది. పెళ్ళినాటికి ఆమెకు చదువు లేదు. వీరేశలింగం ఆమెకు విద్యాబుద్ధులు గరపి తాను చేపట్టిన కార్యకలాపాలకు చేదోడు వాదోడుగా చేసుకున్నాడు. వితంతు వివాహాల సందర్భంగా ఆమె వీరేశలింగానికి పూర్తి బాసటగా నిల్చింది. స్వీయచరిత్రలో వీరేశలింగం ఆమెను గురించి ఇలా రాసుకున్నాడు.

"అయిదవ వివాహమునకు వంట బ్రాహ్మణులు లేచిపోగా నా భార్యయే గోదావరి నుండి నీళ్ళు మోసుకొని వచ్చి వంట మొదలైన పనులెల్లను స్వయముగా చేసి ఎంతో కష్టపడవలసినదయ్యెను... నా భార్యయొక్క యానుకూల్యమే లేక యుండినయెడల నేనిన్ని కార్యములను నిరంతరాయముగా నిర్వహింపలేక యుందునేమో". వీరేశలింగం వితంతు వివాహ కార్యక్రమానికి పూనుకొన్నప్పుడు ఆమెను ఆయనకు సహాయపడకుండా ఉండేందుకు బంధువులు తీవ్రంగా ప్రయత్నించారు. దాన్ని గురించి స్వీయచరిత్రలో ఈ విధంగా వీరేశలింగం వివరించాడు.

"ఈ కార్యము నుండి నన్ను మరలింప సర్వవిధముల ప్రయత్నించి చూచి దారి కానక కడపటి వుపాయంగా నా భార్యను పట్టుకొనిరి. కాని అక్కడనూ కార్యసాఫల్యము కలుగలేదు...'ఆయన పూనినది మంచి కార్యమని నేనునూ నమ్ముచున్నదాన నగుటచే నాకాయనతో వలదని చెప్పక పోవుటయే గాక ఎన్ని కష్టములు వచ్చిననూ నేనాయనను విడువక తోడ్పడియుంద'నని దృఢముగా చెప్పెను. అప్పుడందరును చేరి మమ్మందరను విడిచిపెట్టెదవాయని యేడ్వజొచ్చిరి. 'నేనా పనియు చేయజాలనని మొగమాటమేమియు లేక తెలియజెప్పి వారిని నిరాశులను జేసి పంపివేసెను." ఎక్కడెక్కడ నుండో వివాహము చేసుకొనుటకు లేదా సంరక్షణ కొరకు వారింటికి వచ్చిన బాల వితంతువులను చేరదీసి వారిని రాజ్యలక్ష్మమ్మ ఆదరించేవారు. వారికి చదువుతో పాటు జీవితంలో మెలగాల్సిన పద్ధతులను ఆమె నేర్పేది. జాతి, కుల భేదాలు మరచి ఆమె అందరిని సమానంగా చూసే దయామయి. వారి ఇంటిముందు నడివీధిలో వేసవి తాపానికి తట్టుకోలేక సొమ్మసిల్లి పడిపోయిన ఒక

దళితుడిని చేరదీసి, అరుగుపై కూర్చుండబెట్టి సపర్యలు చేసిన ఘటనను వీరేశలింగం స్వీయచరిత్రలో పేర్కొన్నాడు. స్త్రీ ప్రార్థనాసమాజాన్ని ఆమె స్థాపించింది. అందులోని సభ్యులకు ఆటపాటలతో పాటు కుట్లు, అల్లికలు రాజ్యలక్ష్మమ్మ నేర్పేది. ఆనాడున్న సాంఘిక వాతావరణంలో ఆమె పడిన కష్టాలు ఇంతింత కాదు.

1910 సంవత్సరంలో రాజ్యలక్ష్మమ్మ కాలం చేసింది. వీరేశలింగానికి ఇదొక ఘోర విపత్తు. మనసా, వాచా, కర్మణా ఆమె వీరేశలింగానికి సహధర్మ చారిణిగా మెలగింది. ఆయనతో పాటు ఆమె కూడా అస్తికత్వాన్ని అవలంభించింది. అనేక ప్రార్థనా గీతాలను రచించింది కూడా. రాజ్యలక్ష్మమ్మ అంత్యక్రియలు వారి తోటలో జరిపించి, రాజ్యలక్ష్మీ నివాసమనే ఇంటిని అక్కడే కట్టించి, దానిలో పాలరాతితో నిర్మించిన సమాధిలో రాజ్యలక్ష్మి అస్థికలను భద్రపరిచాడు.

వీరేశలింగం కన్నా 9 ఏండ్ల ముందే రాజ్యలక్ష్మమ్మ చనిపోయింది. ఆ తర్వాత ఆలనా పాలనా లేక ఆయన అనేక కష్టాలకు గురయ్యాడు. అప్పటి తన జీవితాన్ని 'అసహాయ దశ' అనే శీర్షికతో స్వీయచరిత్రలో వివరించాడు. పండిత శివనాథశాస్త్రి రాజమండ్రికి వచ్చి కొన్నాళ్ళున్నాడు. ఆయన తన 'ఆత్మ చరిత్'లో రాజ్యలక్ష్మమ్మ గురించి ఇలా రాశాడు.

"Veeresalingam's wife is a memorable person. On one hand firm, energetic and dutiful and, on the other, tender - hearted and charitable. My friend Veeresalingam had achieved much despite social oppression because he had a wife like her" ఆమె మరణించినప్పుడు రాజమండ్రి పట్టణం దుఃఖించింది. 'ది హిందూ' పత్రిక ఇలా రాసింది.

"She toiled hard in the cause of social reform encountering excommunication and social persecution and her labours contributed largely to the success of the widow marriage movement".

0వీరేశలింగం బెంగాలులోని రాజా రామ్మోహన్ రాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్; మహారాష్ట్రలో పూలే, రనడే; ఉత్తర భారతదేశంలో దయానంద సరస్వతి మున్నగువారితో పోల్చదగ్గ గొప్ప సంస్కర్త. ఆయన సంస్కరణలు చేపట్టేనాటికి దక్షిణ భారతదేశంలో చెప్పుకోదగ్గ సంస్కర్త లేదు. ఆయన సాగించిన సామాజిక కార్యకలాపాలకు, ప్రజాహిత సేవలకు, సాహిత్యకృషికి వారి సమకాలికులు ఎంతగానో ప్రస్తుతించారు. ఎన్నో బిరుదులిచ్చారు. అప్పట్లో ఘనంగా ఎంచబడిన 'రావుబహదూర్' బిరుదాన్ని ప్రభుత్వం 1893లో బహూకరించింది. 1898లో "Fellow of Madras University'గా ప్రభుత్వం వీరేశలింగాన్ని నియమించింది. గోదావరి మండల సాంఘిక సభలు 1897లో ఏలూరులో జరిగినప్పుడు వీరేశలింగం ఆ సభలకు అధ్యక్షత వహించాడు. స్థానిక స్వపరిపాలనా సంస్థలైన మున్సిపల్ కౌన్సిల్, తాలూకా బోర్డు, జిల్లా బోర్డుల్లో సభ్యులుగా ఉండి ప్రజా సమస్యల పరిష్కారానికి పాటుపడ్డాడు. విశ్వవిద్యాలయ పరీక్షకులకు పరీక్షాధికారిగా వీరేశలింగం దాదాపు 25 ఏండ్లు పనిచేశాడు. ఆయన రచించిన అనేక గ్రంథాలను ప్రభుత్వ విశ్వవిద్యాలయ పరీక్షలకు పాఠ్యగ్రంథాలుగా నిర్ణయించారు.

గ్రంథ ప్రచురణల నిమిత్తం వీరేశలింగం మద్రాసులో ఉన్నప్పుడు అక్కడి సంఘ సంస్కరణ సమాజానికి, దక్షిణ భారత దేశ బ్రహ్మ సమాజానికి అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. వారిని మద్రాసు పాఠశాల పుస్తక దేశభాషా సంఘం వారు కార్యనిర్వాహక సభ్యుడిగా చేర్చుకున్నారు. టెక్స్ట్‌బుక్ కమిటీలో కూడా సభ్యుడిగా నియమింపబడ్డాడు. వీరేశలింగం జీవితంలో చెప్పుకోదగ్గ గౌరవ పురస్కారం 1898లో మద్రాసులో జరిగిన భారతదేశ సాంఘిక మహాసభకు అధ్యక్షులుగా ఎన్నుకోబడుట. ఈ సభలోనే మహాదేవ గోవింద రనడే వీరేశలింగానికి 'దక్షిణ దేశ విద్యాసాగరుడు' అనే బిరుదాన్ని యిచ్చాడు. 1902లో కాకినాడలో జరిగిన మద్రాసు ప్రెసిడెన్సీ సాంఘిక మహాసభకు, 1903లో బెజవాడలో జరిగిన కృష్ణామండల సభకు, అదే సంవత్సరంలో మద్రాసులో జరిగిన భారతదేశ ఆస్తిక సభకు వీరేశలింగం అధ్యక్షత వహించడం విశేషం.

1908లో 60 ఏండ్లు నిండిన సందర్భంగా వీరేశలింగానికి షష్టిపూర్తి మహోత్సవం రాజమండ్రిలో ఘనంగా జరిగింది. ధర్మపత్ని చనిపోయాక వీరేశలింగానికి సరైన పోషణ లేకపోయింది. వితంతు శరణాలయంలోనివారే కొంతవరకు వారి సంరక్షణకు పూనుకున్నారు. కానీ మొత్తంమీద వారి జీవితం ఒడిదుడుకులకు లోనైంది. భార్యావియోగం ఒకవైపు; కార్యభారమింకొకవైపు, సంరక్షణ సరిగ్గా లేకపోవుట వేరొకవైపు, ఇవి ముప్పేటగా కలిసి వీరేశలింగం జీవితాన్ని

మరింత కష్టాలపాలు చేశాయి. తుదకు 1919 మే నెల, 27వ తేదీన రాజమండ్రిలో వారి ఆనందాశ్రమంలో తుదిశ్వాస విడిచారు.

ఆధునిక ఆంధ్రదేశ యుగకర్తగా వీరేశలింగాన్ని పరిగణిస్తున్నారు. ఆయన అనుసరించిన భాషాశైలి సరళగ్రాంథికం. వీరేశలింగం సాహిత్యకృషి ప్రారంభించినప్పుడు గ్రాంథికమే వాడుకలో ఉండేది. తొలిదశలో వీరేశలింగం గ్రాంథికశైలి ననుసరించే కావ్యాలు రాసినా ఆ తర్వాత, సాహిత్యాన్ని సంస్కరణల కొరకు ఉపయోగించే సాధనంగా వాడుకోదలచుకొన్నందున ఆయన శైలిలో మార్పు వచ్చింది. గ్రాంథికశైలి స్థానే సరళగ్రాంథికాన్ని వాడడంలో వీరేశలింగం ప్రజాస్వామిక వైఖరిని ప్రదర్శించాడు. అవసానదశలో వీరేశలింగం వ్యావహారిక భాష వైపు పూర్తిగా మొగ్గాడు. వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజానికి అధ్యక్షుడిగా నియమితుడైనాడు. దురదృష్టవశాత్తు ఆ వెంటనే మరణించాడు.

19వ శతాబ్దాంతానికి సమాజంలో ప్రజా సంబంధిత విషయాలపై ఆసక్తి మరింతగా పెరిగింది. ఇది క్రమేపి రాజకీయ స్పృహకు దారి తీసింది. మత గురువులు, కులపెద్దలు వలస పాలనలో వచ్చిన మార్పుల్ని అర్థం చేసుకోలేక పోయారు. దీనికి విరుద్ధంగా వీరేశలింగం ఈ మార్పులను ఒకవైపు అర్థం చేసుకుంటూ, మరోవైపు వలస పాలకుల అండదండలతో తన సంస్కరణ ప్రయత్నాలను సాధించుకోగల్గాడు.

వీరేశలింగంపై ఆనాటి సామాజిక పరిస్థితుల ప్రభావం ఒకవైపు, బెంగాల్ సంఘ సంస్కర్తల ప్రభావం మరోవైపు ఉండినాయి. హేతువాదంపై, విజ్ఞానవ్యాప్తిపై ఆయన శ్రద్ధ చూపాడు. విద్యావ్యాప్తి ఆయన దృష్టిలో కేవలం సాహిత్య విద్యకే పరిమితం కాలేదు. ప్రజల మనసులను వికసింపచేసి సమాజంలో పునరుజ్జీవనానికి తోడ్పడే విద్య కావాలని కాంక్షించాడు. 19వ శతాబ్దపు ఇతర సంస్కర్తలలాగే ఆయన ఆంగ్లపాలనపై భ్రమలు పెట్టుకున్నాడు. ఆ విధంగా వలస పాలన సృష్టించిన బూటకపు చైతన్యానికి లోబడ్డాడు. భావాలు వాటంతటవి శక్తిని సమకూర్చుకొని మార్పులకు దోహదం చెయ్యవు. వాటిని ఆచరణలో పెట్టాలి. వీరేశలింగం చేసిందదే. కేవలం బోధకుడుగా గాక ఆచరణాత్మక మేధావిగా కృషి సాగించాడు. ఆచరణ ద్వారా తన భావాలను పరీక్షించుకొని వాటికి మరింత పదును పెట్టాడు. అవసరమని తోస్తే, వాటిని మార్చుకునేవాడు కూడ. తన భావ వ్యాప్తికి, సఫలతకు యువకులపై, ముఖ్యంగా విద్యార్థులపై ఆధారపడ్డాడు. సంఘసంస్కరణలను వ్యతిరేకించే ఆనాటి సమాజంలో ఆదర్శాలతో కూడి మార్పునుకోరే యువతపై విశ్వాసాన్ని వుంచడంలో వీరేశలింగం దూరదృష్టి గోచరిస్తుంది.

వీరేశలింగం గావించిన కృషిపై అనేక విమర్శలు ఆయన జీవిత కాలంలోనూ, ఆ తర్వాతా వచ్చాయి. ఇందులో కొన్ని వ్యక్తిగత విమర్శలూ ఉన్నాయి. వ్యక్తిగత విమర్శలు కేవలం ఆయనపై వ్యతిరేకతతోనో, ద్వేషంతోనో చేసినవే. నిజానికి వాటికి సరైన ఆధారాలు లేకపోవడంతో ఆ విమర్శలు తీవ్ర ఖండనలకు గురైయ్యాయి. ఇలాంటి విమర్శలు చేసినవారిలో ఆయన సమకాలికులైన నాళం కృష్ణారావు, టంగుటూరి శ్రీరాములు (టంగుటూరి ప్రకాశం పంతులు సోదరుడు) ఉన్నారు. నాళం కృష్ణారావు, వీరేశలింగం మరణించాక, తన తప్పును గుర్తించి 'అనుతాపం' ప్రకటించాడు. ఇక శ్రీరాములు చేసిన అభియోగం ప్రకాశం పంతులు జోక్యంతో ఉపసంహరించబడింది. ఆయనపై ప్రధాన విమర్శ వీరేశలింగం జాతీయవాది కాదన్నదే. ఈ అంశాన్ని గూర్చి ముందు అధ్యాయాల్లో చర్చించుకున్నాం. అయినా ఇక్కడ పునరుద్ఘాటించ దలచుకొన్నది ఆయనలోని మితవాద జాతీయభావాల గురించి మాత్రమే. ప్రజల గూర్చి, అభివృద్ధి గూర్చి, దేశం గూర్చి అనేక సందర్భాల్లో ఆయన ప్రస్తావించినా ఆయన జాతీయవాది కాలేకపోయాడని కొందరు చరిత్రకారులు అభిప్రాయపడుతున్నారు. వీరేశలింగం కాలానికి, ముఖ్యంగా ఆయన చేపట్టిన సంస్కరణల తొలిదశ నాటికి, జాతీయోద్యమం విజ్ఞానపరులకు, మహజర్లకు, తీర్మానాలకు పరిమితమైంది. కాకుంటే వీరేశలింగం ఆంగ్ల పాలనలోని ధనాంశాలను మరింత ప్రస్ఫుటంగా పేర్కొన్నాడు. 1907లో బెంగాల్ నాయకుడు, అతివాది బిపిన్ చంద్రపాల్ తెలుగు జిల్లాలో పర్యటన తర్వాత వీరేశలింగానికి సహాయ సహకారాలందించిన యువకులు, ఆయనకు దూరమయ్యారు. ఒంటరివాడుగా వీరేశలింగం మిగిలిపోయాడు.

ఆంధ్రోద్యమ స్థాపకుల్లో ఒకరైన జొన్నవిత్తుల గురునాథం, 1911లో వీరేశలింగం జీవించియున్న కాలంలోనే, ఆయన

జీవితచరిత్రను ప్రకటించాడు. ఇందులో వీరేశలింగం సంస్కరణ భావాలను విమర్శించాడు. అదే సమయంలో వీరేశలింగం తెలుగు సాహిత్యానికి ప్రత్యేకించి తెలుగు వచనానికి చేసిన సేవలను, తాను నమ్మిన సిద్ధాంతాలను ఆచరించడంలో ప్రదర్శించిన తెగువను కొనియాడాడు. వీరేశలింగాన్ని ఆంధ్రదేశంలో సాంఘిక జీవనానికి ఆద్యుడిగా పేర్కొన్నాడు. 19వ శతాబ్దంలో ఆంధ్రదేశంలో పుట్టిన మహోన్నత వ్యక్తిగా వర్ణించాడు. తద్వారా ప్రత్యేక ఆంధ్రోద్యమానికి వీరేశలింగం వారసత్వాన్ని తెలివిగా ఉపయోగించుకున్నాడు. తెలుగువారి అభ్యుదయానికి కృషి చేసిన ప్రథముడుగా కూడా గురునాథం అభివర్ణించాడు.

సర్వేపల్లి రాధాకృష్ణన్ వీరేశలింగాన్ని ''దక్షిణ భారతదేశంలో హేతువాద బద్ధమైన మార్పులకోసం కృషిచేసిన తొలితరం మార్గదర్శకులలో వీరేశలింగం పంతులుగారు ముఖ్యులు" గా అభివర్ణించారు. ప్రముఖ విద్యావేత్త, సాహిత్య విమర్శకుడు కట్టమంచి రామలింగారెడ్డి యిలా నివాళు లర్పించాడు. "పంతులుగారి వంటి ధైర్యం, ఉత్సాహం, కార్యశూరత మనం దేశీయులలో ఎప్పుడు నాటగలమో అప్పుడే పంతులుగారికి తగిన చిహ్నమును స్మరింపగలిగిన వారమవుదమని నా అభిప్రాయం". "శ్రీ వీరేశలింగం పంతులుగారు నిశ్చయంగా మహాపురుషులు. సాహిత్యంలో ఒక శాఖను ప్రారంభించి సంఘంలో పురోభివృద్ధి పంథా లేవదీసినవారు" అని గురజాడ అప్పారావు ప్రస్తుతించారు.

**"తన దేహము, తన గేహము,**
**తన కాలము, తన ధనమ్ము**
**తన విద్య జగజ్జనులకు వినియోగించిన**
**ఘనుడీ వీరేశలింగకవి జనులారా!" అని చిలకమర్తి లక్ష్మీనరసింహం నివాళులర్పించాడు.**

వీరేశలింగం చేపట్టిన ఉద్యమాలు పరిమిత విజయాలను సాధించాయన్నది నిర్వివాదం. దీనికి కారణాలుగా రాజకీయోద్యమాలు, సంస్కరణల పరిమిత పరిధి, స్వభావం లాంటివి ఉండగా, మరోవైపు వీరేశలింగం వ్యక్తిత్వం కూడా దీనికి దోహదం చేసింది. ఆయన పెత్తందారీ ధోరణి అనుసరించాడని, మిత్రుల, సహచరులపై పూర్తి విశ్వాసాన్ని వుంచలేకపోయాడని, వారి కృషిలో జోక్యం చేసుకునేవాడని ఆయన సమకాలికుల్లో కొందరు అభిప్రాయపడ్డారు. అంతేకాదు వలసవాద సమాజంలో సహజంగా వుండే పరిమితుల్లో సంస్కర్తలు ఉద్యమాలు నడిపారు. తాము తలపెట్టిన సంస్కరణలను సాధించడానికి పరాయి పాలకులపై ఆధారపడ్డారు. సంస్కర్తల భావాలూ, కార్యాచరణ మధ్యతరగతుల వరకే ఎక్కువగా ప్రభావాన్ని చూపాయి. అందువల్ల వారికి సామాన్య ప్రజల నుండి సహాయ సహకారాలు అందలేదు. వీటన్నింటికంటే గమనంలో ఉంచుకోవాల్సిన మరో ముఖ్యాంశం, భూస్వామ్య వ్యవస్థ అవసానదశలో వున్నప్పటికీ, అప్పటికింకా దాని ప్రభావం బలంగా వుండింది. ఫ్యూడల్ భావజాలం సమసిపోలేదు. ఇక వలస వాదులు తమ అస్తిత్వం కోసం యథాతథ స్థితిని కొనసాగించటానికే (వలసవాద మూడవదశలో, 1857 తర్వాత) నిర్ణయించుకున్నారు. అంతర్జాతీయంగా ఇంగ్లండుకు పోటీగా, జర్మనీ, ఇటలీ దేశాలు శక్తిమంతమైన రాజ్యాలుగా రూపుదిద్దుకోవడంతో, ఆంగ్లపాలకులు తమకు అండగా నిలబడే సంప్రదాయ అభివృద్ధి నిరోధక వర్గాలను దూరం చేసుకోదలచుకోలేదు.

సంస్కరణోద్యమాలకు ప్రతిచర్యగా పునరుద్ధరణ వాదపు పెరుగుదల కూడా ఆ ఉద్యమాల క్షీణతకు తోడ్పడింది. అప్పటి సంస్కర్తలు తమ సంస్కరణలు జాతీయ వారసత్వానికి భిన్నం కాదని నచ్చజెప్పడానికి ప్రయత్నించారు. కుల సంఘాల ఆవిర్భావం, 1910 దశకం తర్వాత, సంస్కరణ ఉద్యమాన్ని కొంతవరకు దెబ్బతీసింది. అప్పటి సంస్కరణల దశ ఫ్యూడల్ ఆర్థిక వ్యవస్థ నుండి పెట్టుబడిదారీ ఆర్థికవ్యవస్థ, అలాంటి అభివృద్ధితో సంబంధం గల సామాజిక పొరల పెరుగుదలా లేకపోయినందువల్ల సంస్కరణోద్యమాల వృద్ధికీ, విజయానికీ అవసరమైన అండదండలు లభించలేదు. అందుకే 19వ శతాబ్దపు పునరుజ్జీవ ప్రక్రియ అసంపూర్తిగా ఉండిపోయింది. 1920 దశకంలో జాతీయోద్యమ విజృంభణ తర్వాత సంస్కరణోద్యమాలు క్షీణించినా, వాటి ప్రభావం ఆంధ్రదేశపు మేధోవాతావరణంలో ఒక భాగంగా వుండి, ఆ తర్వాత తలెత్తిన కమ్యూనిస్టు ఉద్యమం ఆ వారసత్వాన్ని పుణికి పుచ్చుకొని సంఘసంస్కరణ ప్రాముఖ్యాన్ని పునరుద్ఘాటించింది. ఆనాటి నుండి నేటివరకు వీరేశలింగం నిర్వహించిన ఉద్యమ ప్రభావం ఆంధ్రదేశంపై కొనసాగుతూ వుండడం ఆయన మిగిల్చిపోయిన వారసత్వానికి నివాళి.

**(కందుకూరి వీరేశలింగం– వకుళాభరణం రామకృష్ణ. ప్రచురణ: నేషనల్ బుక్‌ట్రస్ట్ 2008)**

❖

# బ్రహ్మసమాజోద్యమం : వీరేశలింగం



- కనుపర్తి విజయలక్ష్మి

**1906లో ఆయన జందెం విసర్జించి అనుష్ఠాన బ్రాహ్మదవ్రటం, బ్రాహ్మమత పద్ధతిలో కొన్ని వివాహాలు జరిపించటం, సర్వకులాలవారితో సహపంక్తి భోజనాలు ఆయన చేపట్టిన కార్యక్రమాలు. జీవితాంతం ఆయన తాను నమ్మిన సిద్ధాంతాలకు కట్టుబడి ఉండటమే కాక, మరణానంతరం ఆయన సమాధిమీద చెక్కబడిన *'A Sincere Theist'* అనే మాటలు కూడా పరిశుద్ధాస్తిక మతం పట్ల ఆయనకు గల విశ్వాసం, ఆదరణను వ్యక్తం చేస్తున్నాయి.**

ఆంధ్రదేశంలో బ్రహ్మసమాజ ఉద్యమం వ్యాప్తి చెందటానికి మూలమైన వారిలో వీరేశలింగం ఒకరు. ఆయన రాజమండ్రి, మద్రాసు, బెంగుళూర్లలో ప్రార్థనామందిరాలు కట్టించారు. కేశవచంద్రసేనుని ఉపన్యాసాలను చిన్నప్పుడే చదవటం ఆ తర్వాత ఆత్మూరి లక్ష్మీ నరసింహమనే బ్రాహ్మసమాజాభిమాని వీరేశలింగానికి ఉపాధ్యాయుడుగా రావటం వల్లను బ్రహ్మసమాజ భావాలు ఆయనలో మరింత బలంగా నాటుకొనడానికి దోహదపడ్డాయి. ఆయన స్వీయ చరిత్రలో తనకు బ్రహ్మసమాజం పట్ల గల అభిమానాన్ని పలుమార్లు వ్యక్తం చేసాడు.

"సంఘసంస్కరణ సమాజ కార్యముల యందును. బ్రహ్మసమాజ ధర్మ వ్యాసనము నందును. నాకు విశేషాభిమానము. ఈ విషయములో సహితము నాకు కార్యశూరత ప్రియము. క్రియాశూన్యమైన కేవల వాక్సూరత నాకు అప్రియము"

వీరేశలింగం పంతులు చేపట్టిన కార్యకలాపములను పరిశీలించి చూచినట్లయితే ఆయన పైన పేర్కొన్న మాటల్లో అసత్యం కొంచెం కూడా లేదని తెలుస్తుంది. 1906లో ఆయన జందెం విసర్జించి అనుష్టాన బ్రాహ్మదవ్రటం, బ్రాహ్మమత పద్ధతిలో కొన్ని వివాహాలు జరిపించటం, సర్వకులాలవారితో సహపంక్తి భోజనాలు ఆయన చేపట్టిన కార్యక్రమాలు. జీవితాంతం ఆయన తాను నమ్మిన సిద్ధాంతాలకు కట్టుబడి ఉండటమే కాక, మరణానంతరం ఆయన సమాధిమీద చెక్కబడిన 'A Sincere Theist' అనే మాటలు కూడా పరిశుద్ధాస్తిక మతం పట్ల ఆయనకు గల విశ్వాసం, ఆదరణను వ్యక్తం చేస్తున్నాయి.

తాను నిర్మించిన పాఠశాలల్లో బాలురచేత కావించబడే ప్రార్థనా విధానం కూడా ఆయన నమ్మిన సిద్ధాంతానికి అనుగుణమైనదే . కలకత్తా బ్రహ్మసమాజ ప్రముఖులతో ఆయనకు చక్కటి సంబంధాలుండేవి. పండిత శివనాధశాస్త్రి (సాధారణ బ్రహ్మసమాజం) రాజమండ్రికి విచ్చేయటం. వీరేశలింగం దంపతులు ఆయనతో కలిసి కలకత్తా బయలుదేరటం, అక్కడ వారికి అన్ని బ్రహ్మసమాజాల వారు సన్మానం చేయటం మున్నగునవి ఆయన స్వీయ చరిత్ర ద్వారా తెలుస్తున్నాయి.

వీరేశలింగం పంతులు సంఘసంస్కరణ కార్యకలాపాల్లో మధ్యందిన మార్తాండుని వలె ప్రకాశించటానికి కారణం బ్రహ్మమత మందించిన ఉదార ఆశయాల ప్రభావం వల్లనే అని చెప్పవచ్చు. స్త్రీ విద్య, స్త్రీ జనోద్ధరణ పట్ల ఆయనకు గల అత్యంత అభిమానానికి కారణం బ్రహ్మసమాజంలో ఉన్న సంస్కరణల ఛాయలే అని అనవచ్చు. బ్రహ్మసమాజాన్ని ఒక సంస్కరణోద్యమంగా పేర్కొంటు డా॥ సి.నారాయణరెడ్డి - "వీరేశలింగం గారి ఏకేశ్వరారాధన తత్త్వ ప్రచారముతో చిల్లర దేవుళ్ళను పట్టుకొని వ్రేలాడు మనస్తత్వము కొందరు

దేశీయులలో కొంతవరకు సన్నగిల్లినవి. పాశ్చాత్య నాగరికత పట్ల కొందరికున్న ఛాందస దృష్టి తొలిగిపోయింది. ఆనాటి యువకుల మనఃపరివర్తనమనకి సంస్కరణోద్యమమెంతో ఉపకరించినది. వారి హృదయములందు క్రొత్త గవాక్షములు తెరిచినట్లైనది. వారికి క్రొత్త ఊపిరి పోసినట్లైనది"

ఆయన స్వీయచరిత్ర పంతులుగారి జీవిత క్రమాన్నే కాక ఆనాటి సాంఘిక, మత పరిస్థితులనన్నిటిని చక్కగ తెలియచెప్పే చరిత్ర గ్రంథమనవచ్చు– "సంఘ దురాచార సంస్కరణమును, పరిశుద్ధ మత ధర్మ ప్రకటీకరణమును బాయుకుండును గాన నేనే పుస్తకమును జేసినను దానిలో నవకాశమున్న యెడల నేసందర్భము నైనను వానిని చొప్పించు చుందును'' పంతులుగారు చెప్పుకొన్నట్లు బ్రాహ్మధర్మ అభిప్రాయాలు ఆయన రచనల్లో ప్రతిఫలించిన తీరుతెన్నులు చూడవలసి ఉంది.

బ్రహ్మసమాజాన్ని రాజమహేంద్రిలో ప్రారంభించటానికి పూర్వం వీరేశలింగపంతులు, మరికొందరు మిత్రులు సమావేశమై ప్రార్థనలు చేస్తుండేవారు. ఆ సమావేశంలో పార్థసారథినాయుడు గారనే ఆయన కీర్తనలు పాడితే, వీరేశలింగం ధర్మోపదేశాలు వ్రాసి చదువుతుండేవారు. ఇవి తర్వాత పుస్తకరూపంలో వెలువడ్డాయి. ఆ విధంగా వచ్చిన గ్రంథాల్లో 'Caste' (వర్ణము), ఈశ్వరోపాసనము. ప్రార్థన, విగ్రహారాధనము, జన్మాంతరము, మానుషధర్మము, మనుష్య జీవితముయొక్క పరమార్థము. విద్యార్థికుల ధర్మములు ముఖ్యమైనవి. అవికాక కొన్ని ఉపన్యాసాలు ప్రార్థనాసమాజంలో చేసినవి.

వర్ణభేద నిరసన బ్రహ్మసమాజ కార్యప్రణాళికలో ప్రధానమైన ఒక అంశం. ఆయన తాను చెప్పదలచుకున్న విషయాల ప్రామాణ్యాన్ని శాస్త్రాల నుండి గ్రహిస్తూనే, వాటిని సహేతుక దృష్టితో విమర్శించేవారు. ఉదాహరణగా ఆయన 'వర్ణము' అనే విషయంలో చేసిన ఉపన్యాసంలోని ఒక అంశాన్ని పరిశీలిస్తే వెల్లడవుతుంది.

సహస్ర శీర్షాపురుష సహస్రాక్షస్సహ ప్రపాత్

సభూమిం విశ్వతో వృత్యా అత్యతిష్ఠద్దశాంగుళమ్

అనే పురుషసూక్తాన్ని అనుసరించి సహస్రశీర్షము లున్నప్పుడు సహస్రాక్షములు కాక ద్విసహస్రాక్షములుండవలెనని బాలురు సహితమాక్షేపించటానికి అవకాశముందని" అంటారు అనేక ఉదాహరణలను ఉపనిషత్తుల నుండి, భారతం నుండి ఇస్తూ, పూర్వకాలంలో కేవలం జన్మం చేతగాక బ్రాహ్మణేతరులు కూడ గుణముల చేత, పనుల చేత బ్రాహ్మలగుచు వచ్చారని చెప్పారు.

ఎన్నో స్మృతులను ఆధారంగ తీసికొని వివాహ విషయంలో బ్రాహ్మణ్యులు అన్యవర్ణానికి సంబంధించిన కన్యలను వివాహమాడే పద్ధతి ఉండేదని. భోజనాధికములను కూడా బ్రాహ్మణుడు ఇతర కులాల నుండి స్వీకరించవచ్చని అన్నారు. శాస్త్ర ప్రమాణాల ఆధారంగ వర్ణభేదాన్ని నిరసిస్తూ, దానివల్ల దేశానికి కలిగే నష్టాలను చెప్పారు. "మన దేశమునందిప్పుడు నీతి యడుగంటి దాని స్థానమున జాతి కట్టుబాటులే పరమాదరణీయములయినవి'' మానవునికి సహజంగ ఉండవలసిన దయాగుణం లేకుండా పోవటానికి కారణం వర్ణపిశాచం యొక్క ప్రేరణ మాత్రమే అన్నారు.

బ్రహ్మధర్మానికి ఆయువుపట్టు ప్రార్థన. ఈ ప్రార్థన ఏకాంత ప్రార్థన, కుటుంబ ప్రార్థన, సమాజ ప్రార్థన అని మూడు విధాలు. పంతులుగారి మాటల్లో అశ్రద్ధతో జాముసేపు చేసే ప్రార్థన కంటె శ్రద్ధాభక్తులతో చేసే ప్రార్థన క్షణకాలమైన శ్రేష్ఠతరమయినదిగా ఆయన వర్ణించారు. అంతేకాక మనుష్యభావము నిలుపుకొనుటకు ప్రార్థన మావశ్యకమని, ప్రార్థన లేనిచో మనుష్యుడు మృగతుల్యుడగుటకు సందేహము లేదని ప్రార్థన అనే ఉపన్యాసంలో అభిప్రాయపడ్డారు.

విగ్రహారాధనము అనే ఉపన్యాసంలో ప్రతిమార్చనకు తీవ్రంగ నిరసించారు. బ్రాహ్మమత సిద్ధాంతాల్లో ముఖ్యమయింది. విగ్రహారాధనకు ఆమోదించకపోవటం బ్రహ్మసమాజ స్థాపకుడైన రాజారామమోహనరాయలు ఆనాటి పండితులతో ఈ విషయమై ఎన్నో వాదోపవాదాలు కొనసాగించాడు. వీరేశలింగం గారు విగ్రహారాధనకు ప్రబల వ్యతిరేకి; కాబట్టి విగ్రహాలను గూర్చి చెప్పేటపుడు "కుత్సిత ప్రతిమలు" "తుచ్చములయిన విగ్రహములు" "జడములయిన ప్రతిమలు" అని పేర్కొన్నాడు. హిందువులందరి చేతను సర్వోత్కృష్ట ప్రమాణంగా అంగీకరింపబడిన వేదమే ప్రతిమార్చనం వద్దని బహుముఖాలుగా ఘోషిస్తోందని అన్నారు. ఆయన తన వాదనకు బలంగా ముండకోపనిషత్తు. శ్వేతాశ్వేతరోపనిషత్తు నుండి వాజసనేయోపనిషత్తు నుండి అనేక ఉదాహరణలిచ్చారు. పురాణాల్లో సహితం విగ్రహారాధన నిరసించబడిందని శైవ, వైష్ణవ పురాణాలనుండి కొన్ని ఉదాహరణలిచ్చారు. విగ్రహారాధన అనే వ్యాసంలో "ప్రతిమా స్వల్ప బుద్దీనాం: సర్వత్ర విదితాత్మనా" అన్న ఉత్తర గీతా వచనము వల్ల దేవుడు బుద్ధిహీనులకు ప్రతిమల యందును. తెలిసిన వారికి సర్వత్రనున్నాడని దేవుడు

మూఢులకు "కాష్టలోష్టములయందును" వివేకులకు మనస్సునందును ఉండు నన్న వాక్యము చేత కేవల మూఢులకే గాని, జ్ఞానలేశము కలవారికి బింబోపాసనము తగదని స్పష్టపరచారు.

దేవుని మనుష్య రూపానికి దింపి అంతటితో తృప్తిపడక మృగ, పక్షి, క్రిమికీటక రూపాలను చివరికి జడరూపాన్ని కూడ కల్పించి కొలుచుటను తీవ్రంగా విమర్శించాడు. గరుడాది పక్షులను సేవించటం, పాములను పూజించటం, జెఱ్ఱులను మ్రొక్కటం, అశ్వత్థాది వృక్షాలను ప్రదక్షిణం చేయటం చివరికి సన్నికండ్లను, గోడలకు బొట్లుపెట్టి పూజచేయటం విగ్రహాలకు అలంకారాలు చేసి, వివాహాదులను చేయటం, మేకపోతులు, దున్నపోతులను బలి ఇవ్వటం మానివేసి వేదాల్లో చెప్పబడినట్లు ఈశ్వరుడు కేవలం మానసౌకవేద్యుడని గ్రహించాలని ఆశించారు.

విజ్ఞానశాస్త్రంలో ఎంత వృద్ధి చెందినప్పటికీ మనిషికి ఆత్మజ్ఞానం పెంపొందించలేదని విజ్ఞానాభివృద్ధితో పోల్చి చూస్తే మనుష్యునికి తెలిసిన దానిలోకెల్లా తనను గూర్చి తెలిసికొన్నదే మిక్కిలి తక్కువగా కనబడుతుందన్నారు.

"నీతియే మనుష్యనకు పరమధర్మము.. జ్ఞానమునందును నీతియందు వృద్ధిలేక పోవుటయే మానుష ధర్మమునకు భంగము కలుగుట.. నీతి యందభివృద్ధి నొందుటయే మనుష్యునిలోని దేవాంశమును వృద్ధినిందించుట" నీతి మానుషలక్షణ మనియు, నీతిలేకపోవుట పశులక్షణమని చెప్పారు. "నీతి" యనునది చిన్నపదం కాదని దానిలో ఎంతో అర్థం ఇమిడే ఉన్నదని, చిన్నపదంలో సత్యం, కారుణ్యం, క్షమ, పరోపకారం మొదలైన గుణాలనేకాలు చేరి ఉన్నాయని నీతి బలాన్ని బట్టి అధమ జాతి వాడును పూజనీయుడగుచున్నాడని "నీతి" పట్ల తనకు గల మమకారాన్ని ప్రదర్శించారు. వీరేశలింగం లోకోపయుక్త కార్యాలనెన్నింటినో ఒక్కరుగా నిలిచి చేసారు. ఆయన ఎలాంటి విపత్కర పరిస్థితుల్లోను ఎవరికీ వెఱువలేదు. ఈ విషయాన్నే ఆయన తన ఉపన్యాసంలో "లోకమునకు మనము చేయబూనిన యుపకారమునకు మనము జనుల వలన ప్రత్యుపకారము గాని, కృతజ్ఞతను గాని, శ్లాఘనను గాని యపేక్షింపక ఫలనిరపేక్షముగా పరమేశ్వర ప్రీతికయి యది ధర్మమును బుద్ధితో చేయవలెను" ఈ మాటల వల్ల ఆయన ప్రతిఫలమేమి ఆశించక పరమేశ్వర ప్రీత్యర్థమే సర్వకార్యాలు నిర్వహించినట్లు స్పష్టమవుతుంది.

వీరేశలింగం ఉపన్యాసాలన్ని ఆయా సమయాల్లో పఠించిన తర్వాత కనిపించకుండా పోయే విధంగా గాక పుస్తక రూపంలో రావటం విశేషం ఆయన ప్రతి ఉపన్యాసాన్ని వ్రాసి చదవటం వల్ల అవి పుస్తకరూపాన్ని పొందటానికి చక్కగ ఉపకరించాయి. ఈ ఉపన్యాసాల ప్రాధాన్యాన్ని వివరిస్తూ డా॥ కొలకలూరి ఇనాక్ తమ "తెలుగు వ్యాస పరిణామం"లో ఈ యుగంలో ప్రధానంగా ఉపన్యాసం ప్రవర్తిల్లింది. వ్యాసంగా తరువాత గుర్తింపబడ్డ ఉపన్యాసం సాంఘిక అవసరంగా ఆవిర్భవించింది. ఉపన్యాసం సారస్వత ప్రక్రియగా రూపొందించిన వ్యక్తి కందుకూరి వీరేశలింగం పంతులు.. ఏకసమయంలో శబ్దరూపంలో ఉపన్యాసంగా, అక్షర రూపంలో వ్యాసంగా ఒకే రచన గ్రహించబడింది.

ఈ కాలంలో ఏ ప్రక్రియా సాధించలేని సాంఘిక చైతన్యాన్ని ఉపన్యాసం తీసుకవచ్చింది. అందువల్ల ఉపన్యాసం సాంఘికావసరంగా రూపొంది, సంఘచైతన్య సాధనమయి, సారస్వత ప్రక్రియగా ఏర్పడింది... ఈ ఉపన్యాసం ప్రధానంగా కందుకూరి వీరేశలింగం పంతులు సృష్టి.... కందుకూరి ఉపన్యాసాలు వేదికల మీద సభల్లో గతించిపోలేదు. పుస్తకాలలో జీవించి వ్యాసాలుగా నిలిచాయి. ఆంగ్లం నుంచి తెలుగులోకి అవతరించిన "ఎస్సే" ఈ కాలంలో ఉపన్యాసంగానే సంభావ్యమయింది"

వీరేశలింగం ఒక్క మత విషయానికి సంబంధించినవే కాక స్త్రీ పునర్వివాహ విషయక ఉపన్యాసాలను కూడ ఎన్నింటినో చేసారు. అవి పుస్తకరూపాన్ని పొందాయి. ఆయన కావించిన ఉపన్యాసాల్లో మత విషయికమైనవి 34 వ్యాసాలు.

పంతులుగారు కావించిన అనేక ఉపన్యాసాల్లో (వ్యాసాల్లో) కేశవచంద్రసేనుడు వ్రాసిన వ్యాసాల ప్రభావం కనబడుతుంది. వీరేశలింగం ధర్మోపన్యాసాలను వందలకొలది జనులు వచ్చి విని ఆనందించి పోవటమే కాక, కొందరు ఎన్నో సత్కార్యాలకు పూనుకోవటం పూర్వాచార పరాయణులు సహితం గుడ్డివాండ్రకు, కుంటివాండ్రకు చేసిందే ఉత్తమదానం అనుకోవటం జరిగిందని తన స్వీయచరిత్రలో వ్రాసారు. ఈ సమాజం వల్లనే మొదటిసారిగా బీదలకు రాత్రి పాఠశాలలు స్థాపించటం జరిగిందని వ్రాసారు. సమాజంలో ఈ విధమైన మార్పుకు దోహదకారి అయింది పంతులుగారి ధార్మికోపన్యాసాలే. సంఘసంస్కరణకు సయితం ఎందరో ఆనాడు ముందుకురికింది పంతులుగారి ప్రభావం వల్లనే. ❖




# నా తొలి అడుగులు

- కందుకూరి వీరేశలింగం

పదునారు సంవత్సరములు మొదలుకొని యిరువది సంవత్సరముల వరకును మనకు సుగుణములుగాని దుర్గుణములుగాని పట్టుబడ నారంభించి తరువాత నవి స్థిరపడి పోవును. స్థిరపడిన తరువాత వాటిని మార్చుకొనుట బహుతర ప్రయాస సాధ్యముగాని సుసాధ్యముకాదు. సామాన్యముగా సుగుణ దుర్గుణములు మన సహవాసులైన మిత్రులనుబట్టి యలవడును. కాబట్టి యా కాలమునందు మిగుల జాగురకులమయి శక్యమయినంతవరకు సన్మిత్ర సంపాదనమునకయి ప్రయత్నింప వలయును. ఈ విషయమయి స్వానుభవమునొక్కంత చెప్పెదను. మా బంధువులే యొకరు మా యింట కాపుర ముండెడివారు. ఆ కుటుంబ యజమానున కించుమించుగా నాయీడే గల యొక కుమారుడుండెను. ఇరువురమును పదినెనిమిదేండ్ల ప్రాయము గల వారమగుటచేతను, ఏకగృహముననే సర్వదా యుండెడి వారమగుట చేతను, బంధుత్వసంబంధము గలవారమగుట చేతను, మే మొండొరులతో మైత్రిగల వారమయి యుంటిమి. వినోదమునకయి యప్పుడప్పుడు మే మిరువురము చిట్లాడుచుండెడివారము. శైశవమునుండియు నేను దర్భ అశరీరుడనగుట చేత దేహాయసకరములయిన యాటపొంతబోవక, చీట్లు దశావతారి చదరంగము మొదలయిన కాయకష్ట మక్కరలేని మాటలతో విరామముగల యప్పుడు ప్రొద్దు పుచ్చుచుండెడి వాడను. ఆ యాటలయం దప్పుడు, నేను గొంత నేర్పరినయియు నుంటిని. నా మిత్రుడును నేనును మొట్టమొదట పందెము లేకయే చీట్లాడుచుండినను, తరువాత ప్రప్రథమమున చింతగింజలును తదనంతరమున గవ్వలను బెట్టి యాడజొచ్చితిమి. అప్పుడు పదునారు గవ్వలవెల యొక దమ్మిడీకి సమానముగా నారంభము కాకయే యుండవలెను గాని కొంచె మారంభమైన తరువాత ముందుకు సాగకయారంభించిన చోటనే నిలువదు. నా మిత్రుని ప్రోత్సాహము చేత గవ్వలు దమ్మిడీలయినవి; దమ్మిడీలు డబ్బులయినవి. నేను సాధరణముగా నోడిపోయెడి వాడను గాకపోయినను, వేడుక కొరకే యారంభమయిన మా చీట్లాట కడపట జూదము క్రింద పరిణమించినది. ఈయాటవలన నేను రెండు మూడు రూపాయలను గెలిచితిని. ఈ యాటకయి యతడొకసారి నన్ను మాయింటినుండి తన మిత్రుని యింటికి గొనిపోయెను. అతని మిత్రు లాతనివలెనే విద్యాగంథము లేని దుర్వ్యాపారులు. ఈ సోమరి బృందముతో గలిసి నేను పెక్కుమారులు డబ్బుపెట్టి జూదమాడితిని. నా మిత్రుండును మిత్రుని మిత్రులను గలిపి చీట్లాటకు మంచి స్తలము చూపెదము రమ్మని యొక బోగము వారి యింటికి నన్ను దీసికొనిపోయిన ఆ దినమున నొక ముసలిజూదరి మాత్రమే మాతో చీట్లాడెనుగాని మరుసటి దినమునందు వాడు

తనకూతురయిన పడవు పడతిని గూడగొని వచ్చి యాటకుగూర్చుండబెట్టెను. ఇంకను గొంతకాల మీదారినే యనుసరించి యుండినయెడల నేను నీతిమాలిన నిర్భాగ్యుడనయి చెడియందునుగాని యీశ్వరానుగ్రహము వలన నింతలో దెలివి తెచ్చుకొని, కడచినదాని కనుతాపపడి వెంటనే నా దుర్వ్యాపారము నుండి మరలుకొని, నా మిత్రుని తోడి సాంగత్యమును విడిచిపెట్టితిని. వయిదాని వలన సత్ప్రవర్తమునకు సజ్జన సాంగత్యయ మావశ్యకమని ఫలితార్థము తేలుచున్నది. స్వభావముచేత నెంత మంచివాడయినను దుర్జన సాంగత్యములో బడిపోయి దుర్వ్యసనములలో దగులు కొన్న పక్షమున దనవివేకమును గోలుపోయి తాను పూనిన వ్యాపారమే మంచిదను కొనునంతటి దుస్థితిలోనికి వచ్చి మానహీనుడయిన దుష్టుడగును. ఇది మనస్సునందుంచి బాగుపడగోరువారు దుస్సంగదూరు లగుటకు సర్వవిధము అబాటు పడవలయును.

ఈ కాలమునాటికి నా పూర్వ విశ్వాసములు కొన్ని మార్పు చెందుచుండినట్టు చెప్పియుంటినిగదా. దయ్యములు పట్టినవన్న వారియిండ్లకు దఱచుగా బోయి వారి చేష్టలను నటనలను లక్షణములను పరీక్షించుచుండుటచేతను భూతావేశము నందు నాకు నమ్మకము పోయినదా. ఈ కాలమునందు జ్యోతిశ్శాస్త్రములోని ముహూర్త జాతక భాగములయందును, శకునములు మొదలైన వానియందును కూడ నాకు విశ్వాసము పూర్ణముగా చెడినది. నమ్మకములేని వానిని పామరుల సంతుష్టికై నమ్మినట్లు నటించి యాచరించుచుండుట సాధారణముగా నా స్వభావమునకు సరి పడదు. విశ్వాసములని దాని యందు విశ్వాసము లేనట్లు చెప్పుటయు, అవిశ్వాసరాహిత్యమును మాటలచేతనే గాక చేష్టలయందును జూపుటయు, నాకు స్వాభావికము. నాయ విశ్వాసమును లోకమునకు జూపుటకు నాకవకాశము శీఘ్రముగానే కలిగినది. మా దొడ్డిలోనున్న యరటి చెట్టొకటి యేహేతువుచేతనో కొననుండివేయక నడుమునుండి చీల్చుకొని పువ్వు పైకి వచ్చి గెలవేసింది. ఇట్లు చెట్లు మధ్య నుండి గెలవేయుట యరిష్టసూచకమనియు, వెంటనే చెట్టుకొట్టివేయవలసినదనియు, ఇరుగుపొరుగుల వారును, దైవజ్ఞులను, బంధువులును గూడనాతో బహు విధముల జెప్పిరి. ఎవ్వరెన్ని యుంచితిన. ఆరంభదశలో గొంతకాలము గుంపులు గుంపులుగా వచ్చి జనులావింతను జూచి పోవుచువచ్చిరి. కొన్ని నెలలకు కాయ లెదగి కూరకక్కఱకు వచ్చిన తరువాత కాయలు కోసుకొని దూట నిమిత్తము చెట్టుకొట్టివేయించితిని. ఆ సమయమునందే మా యింటి దూలముయొక్క కొననున్న తొఱ్ఱలో తేనెపట్టు పట్టెను. ఇంటతేనెపట్టు పట్టగూడదనియు, అట్లు పట్టుట యశుభసూచక మనియు, దానిని తీసివేయించి దోహ పరిహారార్థముగా బ్రాహ్మణుల చేత శాంతికర్మ చేయింపవలసినదనియు, ఎల్లవారును పై యట్లే చెప్పిరి. పై యట్లే మొండిదొడ్డి యెల్లవారిహిత బోధలను నిరాకరించి చలింపక చెట్టువలె నిలిచితిని. నా తల్లియు, ముత్తవయుగూడ నాతో జెప్పి చూచిరిగాని యీ బండవానితో జెప్పిన కార్యములేదని తుదకు విసిగి యూరకుండిరి.

మండల పాఠశాలలోని పనినిలిచిపోయిన తరువాత నాకు 1872వ సంవత్సరము జ్యేష్ఠ మాసములో కోరంగియును గ్రామమునందుగల యింగ్లీషు పాఠశాలలో నెలకు ముప్పది రూపాయల జీతముగల ప్రధానోపాధ్యాయత్వము లభించినది. ఆ పనికి బోవునపుడు మంచిదినముచూచి మంచి ముహూర్తము పెట్టుకొని పొమ్మని యితరులను మావారును గూడ నన్ను బలాత్కారము చేసిరి. వారి నిర్బంధమును లక్ష్యము చేయక యమావాస్యనాడు బైలుదేఱిపోయి పనిలో బ్రవేశించితిని. ఆ పాఠశాలకు గార్యనిర్వాహకులుగానున్న యిరువురిలో నొకరు మా తాతగారి యొద్ద కొలువులో నుండిన యాతనికుమారుడు చుట్టమును సముద్రశుల్క పర్యవేక్షకుడును. (Sea Custom superintendent) అగు బలిజేపల్లి నారాయణ మూర్తిగారు. పోగానే నేను వారియింటనే దిగితిని. అమావాస్య నాడేల బైలుదేఱితివని నన్నాయన యడిగెను. ఈశ్వరుడు చేసిన దినములన్నియు సమానముగానే మంచివయినప్పుడే దినమున బైలుదేఱితినేమని నేను బదులుచెప్పితిని. అందుపైని జ్యోతిశ్శాస్త్ర విషయమున మా యిరువుకును వాదమయ్యెను. ఇట్లా విషయమున గొన్ని దినముల వితర్కము జరుగునప్పటి కాయన యేబదియేండ్లు దాటిన వృద్ధుండేయైనను, ఆయనకు సుముహూర్తాదులయందలి నమ్మకము ముక్కాలు మువ్వీసము పోయినది.

నా తల్లికి పిశాచ భ్రమ యుండువచ్చెనని మొదటి ప్రకరణముననే చెప్పితిని. ఆమెకా భ్రమము పూర్ణముగా బోవక మరణకాలము వఱకు నప్పుడప్పుడు కలుగుచునే యుండెడిది. కాని నేను దయ్యముల విషయమునందఱచుగా సంభాషించుచువచ్చుట చేత 1876వ సంవత్సరమునకు దరువాత మాత్రము కలుగలేదు. అట్టి భ్రమకలిగినప్పుడు తన్ని వాణార్థమై భూతవైద్యుడను వాని నెవ్వనినో పిలిపించి తత్కాలమునకేదో తంత్రము చేయించుచు వచ్చినంగాని కార్యము

లేకుండెను. కోరంగిలోనున్న కాలములో సహితము నా మాతకట్టి భ్రమము కలుగచునేవచ్చెను. అక్కడివారు భూతవైద్యుడని నా యొద్ద కొకయోగిని గొని వచ్చిరి. ఆ బ్రాహ్మణ యోగి మిక్కిలి కండపుష్టి గలవాడు. పూటకు సేరుబియ్యపు అన్నమునకు తక్కువ కాకుండ తినెడువాడు, గడ్డమును గోళ్ళును బెంచినవాడు, కాలికి కఱ్ఱపావలు తొడిగి, చేతబెత్తమును బట్టి, కాషాయ వస్త్రములను గట్టి, నొసట గొప్ప కుంకుమ బొట్టు పెట్టి, చూచుటకు మహాభయంకరముగా నుండెడివాడు, గంజాయిత్రాగెడివాడు, ముప్పదికిని నలువదికి నడిమి ప్రాయముగల యా పురుషుని నావద్దకు గొని వచ్చినపుడు, నేనాతని మా యింట వుంచుకొని భోజనము పెట్టెదనియు, నాతల్లి దేహము స్వస్థపడిన తరువాత మంచి బహుమానము చేసెదనియు చెప్పితిని. ఆతడందున కొప్పుకొని మా యింట బ్రవేశించెను. ప్రవేశించినది మొదలుకొని యతరుల విషయమున నేకవచన ప్రయోగము చేయుచు గర్వము చూపదొడగెను. నేను దాని కోర్చుకొని యాతడడిగిన దాని నెల్ల స్వల్పమగుటచేత నిచ్చుచువచ్చితిని. అందుపైని నేను దనకులోబడితి ననుకొని యంతకంత కత్యాశాపరుడయి యతడు పెక్కు మిష మీద నా వద్ద నుండి ధనము లాగజూచెను. నా తల్లి శరీరము స్వస్తపడిన పిమ్మట గాని నేనేమియునివ్వనని నిరాకరించితిని. అప్పుడప్పుడు కన్నులెఱ్ఱజేసి నా వంక క్రూరదృష్టితో జూచెను. నేను భయపడక యాతని యవివేకమును తలచినప్పుడు నవ్వు రాగా పకపకనవ్వితిని అందుమీద నతడు మరింత రోషమువచ్చి వాడయి కాఱులు ప్రేల నారంభించెను. అప్పుడు నేను పట్టరాని కోపము గల వాడనయి చేరువనున్న మా పాఠశాల భటునిచేత మెడపట్టించి యా యోగీశ్వరుని వీధి లోనికి గెంటించితిని. ఆతడు దండతాడి తభుజగమువలె రోజుచు, నన్ను శపించుచు, ఏమి చేసెనదో రేపీవేళకు చూడుమని బెదరించుచు, వేఱొక చోటికి బోయెను. అట్లు పోయి యతడొక యింట నొక గది పుచ్చుకొని యనికి మ్రుగ్గుపెట్టి యందేదో యంత్రము వేసి, ప్రయోగము చేసి నన్ను చంపెదనని పలుకుచు, స్నానము చేసి తల విరియ బోసుకొనివచ్చి యపవాసముతో గూర్చుండి నిష్ఠాపరుడై యేదో మంత్ర జపముచేయనారంభించెను. అది చూచి నా మిత్రులు భయపడి నా యొద్దకు వచ్చి, అట్టి యభిచారవేత్తతో తగవులాడుట క్షేమకరము కాదనియు, తమమాట విని యాతని పాదముల మీదబడి వేడికొని, చేసిన యపచారమునకై క్షమార్పణము చేయవలసినదనియు, నాకు హితము చెప్పిరి. వారెన్ని విధములజెప్పినను వారి మాటలు వినక ఆ మూఢుండు నన్నేమి చేయగలడో చూతమని చెప్పి వచ్చిన వారిని వచ్చినట్లే పంపివేసితిని. ఆ యోగి రాత్రి వఱకును భోజనము చేయక కొబ్బరికాయల నీళ్లు త్రాగి యట యుండి యొంటిగా చీకటిలో ''హ్రీం'' ''హ్రాం'' అని కేకలు వేయుచుండెను. అతడర్ధరాత్రముదాక నట్లే యుండి యాహారము లేకపోవుటచేతనో మఱియే హేతువు చేతనో తూలి క్రిందబడిపోయి, తన్నెవరో త్రోచిపడవేసినట్లు భ్రమింపబోయి తానే జడిసికొన్నట్లు మరునాటి ప్రాత:కాలమున, తన్నెవకో దేవత త్రోచిపడవేసినట్టు భ్రమింపజడిసికొనెను. భీతి చేత నాతనికి వెంటనే భయజ్వరము వచ్చెను. ఒకరిని జడిపింపబోయి తానే జడిసికొన్నట్లు మరునాటి ప్రాత:కాలమున దన్నుజూడ వచ్చినవారితో నెల్లను నేను శరభసాళ్వమును దనమీద బ్రయోగము చేసితిననియు ఆ దేవత వచ్చి తాను బంపుచుండిన దేవతనెత్తి యదచి తన్నుగ్రిందబడవేసె ననియు, ఆ దేవత తన్ను శీఘ్రముగానే చంపుననియు, ఆ యోగి చెప్పసాగెను. నాకు మంత్ర మహిమయందలి విశ్వాసముపోయిన తరువాతనే నా తల్లియొక్క భ్రమను నివారించు నిమిత్తమయి నేను శరభసాళ్వ మంత్రము నుపదేశమయితిని. ఆ సంగతి వంతకుబూర్వమే యాయెగి వినియుండి యిట్లు బ్రమసియుండును. నేను రెండు దినములుపేక్షించి యూరకుంటినిగాని యతడంతవరకు బలహీనుడయి సంధిలో నన్నే పలవరించుచుండినట్లు విని జాలినొంది, అతని భ్రమ పోగొట్టుటకయి యాతని యొద్దకుబోయి నే నేమియుజేయలేదని నమ్మబలికి ధైర్యము చెప్పి, ఆతనని మా యింటికి గొనివచ్చితిని. ఈ నాలుగు దినములలోనే యేనుగువంటి వాడు పీనుగువంటివాడయి యా దయ్యాలపోతు బ్రాహ్మణుడు మా యింటికి వచ్చిననాడరసోలెడు బియ్యపు అన్నమునైనను తినలేకపోయెను. క్రమక్రమముగా సన్నిహితము కలిగి యతడు యథాస్థితికి వచ్చుటకు నెలదినములు పట్టినది. తమ మంత్రములయందు పటిమలేదని యెఱింగి ధనార్జనముకయి మాయవేషములు వేసి పరులను మోసపుచ్చుచుండువారు సహిత మితరుల మంత్రములయందు పాటవము కలదని నమ్ముచుందురు. అతడు పూర్ణముగా స్వస్థపడిన తరువాత నాతనికొక క్రొత్తబట్ట కట్టబెట్టి యొక రూపాయ రొక్కమిచ్చి పంపివేసితిని. శరభ సాళ్వమంత్రము

వెఱుగ నపేక్షించువారు నా రాజశేఖర చరిత్రమునందు జూడవచ్చును.

1874వ సంవత్సరము నందాషాఢమాసమును నేను కోరంగిలోని పనిని విడిచి, నా స్వస్థలమగు రాజమహేంద్రవరమునకు నాలుగు మైళ్ళ దూరములో నున్న ధవళేశ్వరమునందలి యాంగ్లో దేశ భాషా పాఠశాలలో నెలకు రు.44-00ల జీతము గల ప్రధానోపాధ్యాయత్వము నందు ప్రవేశించితిని. ఇక్కడనున్న కాలములో కొక్కొండ వేంకటరత్నం పంతులవారును వారి పక్షమువారును స్త్రీ విద్యా నిషేధవాదులయి, స్త్రీల విద్యకు బ్రతికూలము నాంధ్రభాషా సంజీవనిలో వ్రాయుచుండగా, నేను వారికి బ్రతిపక్షమును బూని స్త్రీ విద్యా విధాయకవాదినయి వారి వాదమును ఖండించుచు స్త్రీల విద్య కనుకూలముగా బురుషార్థ ప్రదాయినిక వ్రాయుచుంటిని.

మొట్టమొదటి స్త్రీ విద్యామండనవాదము నన్యపత్రికాముఖముననే జరుపుచు వచ్చినను, నాయూహలను లోకమునకు వెల్లడించుటకయి స్వకీయమైన వృత్తాంత పత్రికయొకటి యుండుట యుక్తమనిభావించి, 1874వ సంవత్సరము ఆశ్వయుజ మాసము నుండి "వివేకవర్ధిని" అను నామముతో వాలుగు పెద్దపుటలు గలయొక చిన్న మాసపత్రికను తెలుగున బ్రకటింపనారంభించితిని.

**తొలి వితంతు వివాహం**

ఇది ఇట్లుండగా, తిరువూరు (కృష్ణాజిల్లా) డిప్యూటీ తాహసీలుదారుగా నుండిన దర్భా బ్రహ్మానందంగారు 1881 నవంబర్ 5న నాకిట్లు వ్రాసెను. "ఆ బాలవితంతవు 12 ఏళ్ళ వయసుగల బ్రాహ్మణ కన్యయొక్క తల్లి. మీరిక్కడికి మీ మనుష్యులను పంపినతోడనే తన కుమారితను మీ వద్దకు పంపెదమని వాగ్దానము చేసినది. నమ్మదగిన వారునూ, ఋజు వర్తనులను, దృఢచిత్తులునయిన మనుష్యులను పంపుడు. వారు విషయము నత్యంత రహస్యముగా నుంచవలెను. మీ మనుష్యులు మీ యుత్తరముతో మార్గస్థులవలె నిక్కడకు వచ్చి నన్ను కలిసికొనిండు".

ఈ కార్యముల యందత్యంతాదరము కలిగి, మొదటినుండియు మాతో పనిచేయుచుండిన సోమంచి భానుశంకరరాజుగారిని నా లేఖతో బ్రహ్మానందము గారి యొద్దకు 15వ తేదీన పంపితిని. ఆ చిన్నది ఏ గ్రామము నందుండెనో, ఆ చిన్నదాని తల్లి పేరేదో మేము పంపిన మిత్రునకు సహితము చెప్పక, బ్రహ్మానందముగారిని కలుసుకొన్న తరువాత సమస్తమూ వారే చేసెదరని మాత్రము చెప్పితిని.

నా మిత్రుడు రాజమహేంద్ర వరమును విడిచిన రెండు దినములకు బ్రహ్మానందముగారు వ్రాసిన యుత్తరమొకటి నాకు చేరినది. ఆ లేఖలోనిట్టు ఉండెను. "వెంటనే పోయి తహసీలుదారుగా వినుకొండ తాలుకా ఒప్పగించుకోవలసినదని నిన్నటిదిన మాకస్మికముగా నాకుత్తరము వచ్చినది. నేను రేపటి దినము వినుకొండకు పోవుటకు ఈ స్థలమును విడుచుచున్నాను. ఆశాభంగమును పొందక, రేపూడికి బాలవితంతు వుండే గ్రామము వెళ్ళి బాలిక తల్లితో మాట్లాడి ఆమెను తీసికొని పోవలసిందని మీ మనుష్యులతో చెప్పుడు".

మా మనుష్యులు నడిదారిలో నుండిరి. మా మిత్రుడు పోవలసిన గ్రామము మా పట్టణమునకు 150 మైళ్ళ దూరము. ఆలోచించి, ఆ చిన్నది వాసము చేయు గ్రామమును, తల్లి ఇంటిపేరును, జరపవలసిన కృత్యమును తెలుపుచు మా మిత్రునకొక లేఖవ్రాసి, లక్క ముద్రలు వేసి ఒక భటునికిచ్చి పంపితిని. మా మిత్రుడు గమ్యస్థానము చేరి విచారింపగా బ్రహ్మానందముగారు దూర గ్రామము పోయినట్లు తెలియవచ్చినది. తాము పోవలసిన గ్రామమేదో వారికి తెలియదు. తాము వచ్చిన కార్యము వేరొకరితో చెప్పవల్లకాదు. తుదకు తామెవ్వరో తెలుప వీలుపడదు. బుద్ధిమంతుడు, కార్యదక్షుడునగుటచే తొందరపడిరాక, మా యుత్తరము నపేక్షించి మా మిత్రుడా గ్రామములోనే వేచియుండగా, మేము పంపిన మనుష్యుడు పోయి మా లేఖ నిచ్చెను. తక్షణమే పోవలసిన గ్రామమునకు వారు మువ్వురును పోయిరి.

ఆ చిన్నదాని తల్లిదండ్రులు గ్రామాధికారులయిన గొప్ప వంశమువారు. ఈ కార్యము తల్లికొకతెకు తప్ప బంధువర్గములో నెవ్వరికి నిష్టములేదు. ఈ సమాచారము కొంచెము పైకి పొక్కినను మోటు గ్రామముల వారు దౌర్జన్యమునకు తెగింతురు. మా మిత్రునకు సాయము చేయువారు చుట్టుపక్కల నొక్కరును లేరు. ఇటువంటి విషమ పరిస్థితిలో, నా మిత్రుడు తామెక్కడికి పోవుచున్నారో బండివాండ్రకు సహితము చెప్పక, రాత్రి రెండు జాములకు ఆ గ్రామముచేరి, వారి యిల్లుచేరి, చిన్నదాని తల్లిని లేపి, రహస్యముగా తాము వచ్చిన పనిని తెలుపగా, ఆమె బ్రహ్మానందము గారు రానిదే తాను పిల్లను పంపనని చెప్పెను. నా మిత్రుడా రాత్రి ఆమె నేలాగుననో బ్రతిమాలి యెప్పించి,

తెల్లవారక మునుపు ఆ చిన్నదానిని తీసుకొని, వెనుకమంచి, యెవ్వరు వచ్చి పట్టుకొందురో యనుభీతిచేత శీఘ్ర ప్రయాణము చేసి, ఆ చిన్నదానిని 27వ తేదీన మా ఇంటివద్ద చేర్చెను. ఆ మరునాడే ఈ వార్త ఉరంతయు పొక్కి, ఆ చిన్నదానిని చూచుటకయి జనులు తీర్థ ప్రజలవలె మా ఇంటికి రాసాగిరి.

అప్పుడు మేము వరాన్వేషణమున కుపక్రమించితిమి. ఆ వరకు వివాహమాడ నిశ్చయించుకొన్న విద్యార్థులకు కొందరికి తల్లిదండ్రులు భయపడి, బలవంత పెట్టినందున వివాహములయిపోయినవి. బహుసంవత్సరములు మా యింటనే యుండి విద్య నేర్చుకొని, విశాఖపట్టణములో అరక్షకశాఖ యందిరువది రూపాయల పనిలోనున్న, 22 సం. ప్రాయముగల ఒక చిన్నవాని భార్య ఆకస్మికముగా మరణమునొందుట తటస్థించెను. నేనా తనకి జాబు వ్రాయగా తానీ చిన్న దానిని వివాహమాడుట కంగీకరించెను. పలువురాతనికి కన్య నిచ్చెదని తిరుగుచున్నను నిరాకరించి, వితంతు వివాహము చేసుకొని అనేక కష్టములు పొందుటకు సాహసించెను. అతని ధైర్యమును, పరోపకార చింతయు శ్లాఘ్యములు.

వివాహ వ్యయము నిమిత్తము నాళము కామరాజుగారు వేయిరూపాయలు మాకిచ్చిరి. వరుడు గోగులపాటి శ్రీరాములుగారని తెలిసిన తోడనే అతని బంధువులు మొదలయినవారు వచ్చి, వివాహము చేసికొనవలదని హితోపదేశము చేసి, కార్యము గానక మరలిపోయిరి. వివాహము జరుగునని నిశ్చయముగా తెలిసిన తరువాత మా పట్టణమంతయు మహావాయువు చేత సంక్షోభము చెందిన మహాసముద్రు వలె కలనారంభించెను. నా మిత్రులు సహితము నాతోమాటాడుటకే భయపడిరి. స్త్రీ పునర్వివాహ విషయమున తను ప్రాణములనయిన ఇచ్చెదమని డంభములుపలికినవారు సహితము, పెండ్లికి వచ్చుట మాట అటుండగా, మా వీధిన నడుచుటకే భయపడి చుట్టు తిరిగి పోవువారైరి. బంధువులందరును నన్ను జాతిభ్రష్టునివలె చూడసాగిరి. వివాహ దినమున మా యింట మాత్రమే కాక యింటి చుట్టును, వీధి పొడవునను రక్షక భటుల కావలి కావలసివచ్చినది. ఇటువంటి మహా సంక్షోభంలో 1881 డిసెంబర్ 11 రాత్రి రాజమహేంద్రవరములో మొదటి స్త్రీ పునర్వివాహము జరిగినది.

ఆ వివాహమునకు కొందరు అనివార్య ప్రతిబంధముల చేతను, కొందరు స్వాభావిక భీరుత్వము చేతను రాలేకపోయినను, ధైర్యశాలులను, దేశాభిమానులును అయిన నా మిత్రులు అనేకులు వివాహ దినములలో తాంబూలమునకు మాత్రమే గాక, భోజనమునకు సహితము వచ్చిరి. అట్టి వారితో నగ్రగణ్యులు బసవరాజు గవర్రాజుగారు. పదిమంది ఒక్కసారిగా లోకాంతర గతులయినప్పుడు పుట్టినంత సంక్షోభము ఈ వివాహ దినమున వారి యింట బుట్టినది. భార్యవంక వారును, తన వంక వారును ఒక్కసారిగా గొల్లున గోలపెట్టి, ఏడ్చుచు. శపించుచు లేచిపోయిరి.

గవర్రాజుగారి వలెనే భోజనములు చేసినవారందరును ఈ విధమైన శ్రమలకోర్చినవారే. పలువురు ప్రాయశ్చిత్తములు చేయించుకొని, మమ్ము విడువలసినవారైరి. ఇటువంటి భయంకర సమయములో ధైర్యము నిలుపలేక పోయినందుకు నేను వారిని నిందింపను.

ఆ అనర్థముల కంతకును మూలమయిన నా ప్రాణములకు సహితము కొందరు దుష్టులెగ్గుతలచిరి గాని విద్యార్థులును, రక్షక భటులును నా కంగరక్షకులుగా నుండుటచేత నాకేవిధమైన అపాయమును కలుగలేదు. మాకు అరక్షకక శాఖ వలన కలిగిన సాయ మింతయంత అని చెప్పదరము కాదు. అల్లరి జరగకుండ వారించుటకయి మాయింటి చుట్టును రక్షక భటులరువది మంది కావలి కాచుచుండిరి డిస్ట్రిక్టు పోలీసు సూపరింటెండెంట్ స్వయముగా నుండి తగిన ఏర్పాటులు చేయుచుండెను. జాయింటు మేజిస్ట్రేట్ స్వయముగా రక్షణ క్రమమును విచారించుచుండెను. అందుచేత నాటి వివాహము జయప్రదముగా జరిగెను. ప్రథమ వివాహము నిర్విఘ్నముగా నడచుట మా మండలమంతయు వ్యాపించగా తమ వితంతు బాలికలకు వివాహము చేయదలచుకొన్న వారనేకులు మా పట్టణమునకు రాసాగిరి. అందుచేత, మొదటి వివాహము జరిగిన నాల్గవ దినముననే రెండవ వివాహము జరిగినది. ఇంకను అనేక వివాహములు జరుగునని అనేకులెదురుచూచుచుండిరి. వివాహమైన తరువాత దంపతుల నాశీర్వదించుచు, మమ్మభినందించు నానా ముఖముల తంత్రీ వార్తలును లేఖలును రాదొడగినవి.

మొదటి వివాహమయిన నాల్గవ దినమున 12 ఏండ్ల ప్రాయముగల బాల వితంతువును వెంటబెట్టుకొని వచ్చి ఆమె తల్లి, తన భర్త ఆ చిన్న దాని వివాహమునకయి మా యొద్దకు బంపెనని చెప్పెను. మేమామె మాటలు నమ్మి, ప్రవేశ పరీక్ష నిమిత్తమయి పోబోవుచున్న ఒక విద్యార్థిని రప్పించి, వధువును

చూపి, అతడొప్పుకొన్న మీదట వివాహము సిద్ధము చేసితిమి. అతడు మంగళాస్నానమునకు కూరుచుండగా యీ వార్త అతని తండ్రికి తెలిసి, రోదనము చేయుచు పరుగెత్తుకొని వచ్చి, పెండ్లి కుమారుని లాగుకొని పోవుటకయి ప్రయత్నించెను. మాలోనివారు కొందరు ఆయనను పట్టుకొని తీసుకొనిపోయి శతమానము ముడిపడువరకును ఓదార్చుచు సమాధానపరచి, మెల్లగా నావలకు పంపివేసిరి. మరునాటి రాత్రి ఊరేగింపు మహోత్సవములో హిందువులలోని తగు మనుష్యులేగాక, డిస్ట్రిక్ట్, జడ్జి, జాయింట్ మేజిస్ట్రేట్, కాలేజి ప్రిన్సిపాల్ మొదలైన యూరోపియనులు పల్లకుల వెంట నడిచిరి.

రెండవ పెండ్లి కుమార్తెను తండ్రి యనుమతిలేకనే తల్లి తీసుకొని వచ్చినదని మా ప్రతిపక్షులేలాగునో తెలిసికొని, అతనిచేత మా మీద నేరము మోపించి, మమ్ము శిక్షింపచేయవలెనని ప్రయత్నించిరి. వారి దుష్ప్రయత్నములను మేము యుక్తవయసులోనే తెలిసికొని, తల్లివలన సత్యమును గ్రహించి, పెండ్లి కూతురి తల్లిని పంపి ఆమె భర్తను రప్పించుకొని, సభల నెక్కకుండా తప్పించుకొంటిమి.

ఈ వివాహమయిన మరునాటి నుండియు మూర్ఖజనుల వలన బాధలంతకంతకు ప్రబల సాగినవి. ఈ శుభకార్యములయందు కొంచెము సంబంధమున్నవారి నందరిని కాపురమున్న అద్దె యిండ్లనుండి లేవగొట్టిరి. నూతులలో నీళ్ళు తోడుకోనియ్యకపోయిరి. నీళ్ళు తెచ్చు బ్రాహ్మణులను తేకుండా చేసిరి. శుభాశుభ కార్యములకు బ్రాహ్మణులను పురోహితులను రాకుండా చేసిరి. బంధువులను వారి యిండ్లకు పోకుండ చేసిరి. కొంత ధైర్యము కలిగి నిలిచిన వారిలో కొందరికి మా గృహము నిచ్చితిమి. వివాహములయిన కొద్ది దినములలో 30 మందికి శ్రీ శంకరాచార్య స్వాములవారి యొద్దనుండి బహిష్కార పత్రములు కూడా వచ్చినవి.

ఈ బాధలిక్కడ నిట్లుండగా స్థలములనుండి ప్రోత్సాహకరములైన ఉత్తరములు, అభినందన పత్రికలును రాదొడగినవి. చెన్న పట్టణము నుండి అనేక మిత్రులు వెంటనే రావలసినదనియు, ఈ వేడి చల్లారక మునుపే కొన్ని ఉపన్యాసములు చేసినపక్షమున తప్పక కొన్ని వివాహములగుననియు నన్నాహ్వానము చేసిరి. నల్లగొండ కోదండరామయ్యగారు చెన్నపట్టణము చూడవలెనన్న అభిలాష గలదనియు, తన్ను తీసుకొనిపోయెడు పక్షమున తానే నాకు వంట చేసి పెట్టెదనియు నన్నడుగగా అంగీకరించితిని.

అప్పుడు చెన్నపట్టణమునకుపోవ ఆవిరి బండ్లను, ఇనుపదారులును లేవు. కాలువపయి పడవలో ఒక దినము ప్రయాణము చేసి కాకినాడచేరి, అక్కడనుండి వారమున కొక్కతరిపోయెడు పొగయోడల మీద రెండు దినములు ప్రయాణముచేసి చెన్నపురి చేరవలెను. పొగయోడపోవు డిసెంబర్ 30 తేదీన గాలివాన ఆరంభమయ్యెను. అటువంటి సమయమున సముద్రముమీద పోవలదని పైడా రామకృష్ణయ్యగారు మొదలైనవారు నన్ను బహువిధముల ప్రార్థించిరి. ఒక్కసారి నిశ్చయము చేసికొన్న తరువాత పట్టిన పట్టును విడిచెడు స్వభావము కలవాడను కాకపోవుటచేత, మౌర్ఖ్యముతో గాలివానలోనే పడవయెక్కి, నా సహచరునితో గూడ సముద్రమునందు ఐదుమైళ్ళు ప్రయాణము చేసి పొగయోడ సమీపమునకు పోగలినను, పడవ ఏడను తారసించుట అపాయకరమని ఎంచి, ధూమ నౌకాధికారి మమ్మెక్కించుకొన నిరాకరించినందున, మేము ఉభయులమును తడిసి ముద్ద అయి, రాత్రి 8, 9 గంటలకు తీరము చేరవలసిన వారమయితిమి...

స్వాముల వారు పంపిన బహిష్కార పత్రికలు పెద్ద పులులవలె బెదిరింపగా, అవరకు ముందంజె వేయువారందరును వెనకంజేసి, మా ధైర్యవచనములను చెవినబెట్టక పూర్వాచార పరాయణుల మరుగునకు పలాయితులు కాజొచ్చిరి. ఆత్మూరి లక్ష్మీ నరసింహముగారు స్వాములవారిపై అభియోగము తెచ్చిరి కాని అది కొట్టివేయబడినది. ప్రథమ వివాహము చేసుకొన్న గోగులపాటి శ్రీరాములగారి నీ విషయమున దూషించినవారిని కొందరు ప్రముఖుల మీద దర్భా వేంకట శాస్త్రిగారు మాన నష్టమునకు అభియోగము తెప్పించి ఓడిపోయినందున గొప్పవారితో వైరము తప్ప వేరు ప్రయోజనము లేకపోయెను. మా ప్రతిపక్షులు విజయ గర్వితులయి మా పక్షమున వారిని మరింత లోకువ చేసి గేలిచేయసాగిరి.

అక్టోబరు 24వ తేదీని కలకత్తానుండి ఈశ్వరచంద్ర విద్యాసాగరుల వారిట్లు వ్రాసిరి :

"My dear Sir, Iam very much obliged to you for the information respecting the celebration of marriage of the third Brahman widow in your part of the country. The friends of the marriage of Hindu widows here have been exceedingly delighted by this happy news. Ma

uniform success attend your benevolent exertions on behalf of the unhappy sufferers is the earnest prayer of.

**Yours sincerely**

**Iswara Chandra Sarma.**

కాకినాడలో బాలవితంతువు తానుకూడా వివాహము చేసికొనవలెనని ఎంతో అభిలాష పడుచుండెను. ఆ చిన్నదాని యింటి యెదుటనున్న యింటిలో తంజావూరి చలపతిరావుగారను పెద్ద మనుష్యుడు కాపురముండెను. ఆయన వితంతు వివాహములయందు విశేషానుభిమానము గల వాడగుటచే, ఆ చిన్నది తమ ఇంటికి ఒంటరిగా వచ్చినప్పుడు వివాహ ప్రసంగమును తీసికొని రాగా ఆమె తన అభీష్టమును తెలియబరచెను. ఆ చిన్నదాని విషయమై పనిచేయవలెనని ఈయననే మేము కోరితిమి.

ఆ చిన్నది ఒకనాటి ప్రాత:కాలమునందొంటిగా ఆయనను కలిసికొని పెండ్లివారు తమ వీధినుండి ఊరేగునప్పుడు తనకీవలకు వచ్చుట కవకాశము కలుగుననియు, అప్పుడు తన్ను తీసుకొనిపోవు ఏర్పాట్లు చేసిన పక్షమున రాజమహేంద్రవరము వెళ్లుదుననియు చెప్పెను. ఆయన అప్పుడే మూడవ వివాహము చేసికొన్న మా మిత్రునితో కలిసికొని, పల్లకిని బోయీలను సిద్ధముచేసి, పల్లకి వద్దకు తీసికొనపోవ నియమించిన మనుష్యుని ముందుగా ఆ చిన్నదానికి చూపెను.

ఆరాత్రి 9 గంటలకు ఒకచోట అద్భుతమైన మాజిక్ చూపబడునని ప్రకటన పత్రికలురాగా, చలపతిరావుగారు ఆచిన్నదాని అన్నను, మేనమామలను దానిని చూచుట కొడబరిచెను. సుమారు రాత్రి 10 గంటల వేళ పెండ్లి యూరేగింపు వారియింటి ముందునుండి సాగెను. నియమించబడిన మనుష్యుడు పెండ్లి పల్లకితో నడుచుచుండెను. పెండ్లి పల్లకి తమ యింటిముందుకు రాగానే లోపలివారు గుమ్మము ముందు నిలుచుండి వేశ్యల నృత్యగానములను చూచుచుండగా, ఆ చిన్నది సందడిలో వెలుపలికి వచ్చి, తన రాకకయి ఎదురుచూచుచుండిన మనుష్యుని వెంట నడచి పల్లకిలో కూరుచుండెను. తక్షణమే పల్లకి మోచువారు చిన్నదానిని కొని బైలుదేరిరి. తెల్లవారునప్పటికి పల్లకి మా గుమ్మములో దిగగా మేమా చిన్నదానిని లోపలికి తీసుకొనిపోయి భద్రముగా నుంచితిమి.

ఆ చిన్నదాని మేమమామలా రాత్రియే, ఆ చిన్నది రాజమహేంద్రవరము పోయినదని నిశ్చయించి, అక్కడ తాహశీలుదారుగా నున్న తమ బంధువును పోలీసువారికి తంత్రీ వార్తలు పంపిరి. కాని ఎవ్వరును జోక్యము కలిగించుకొనక యూరకుండిరి. చిన్నదాని అన్నయు, తల్లియు, మేనమామలలో ఒకరును మూడవనాటి మధ్యాహ్నము మాయింటికి వచ్చిరి. తల్లి రోదనముచేసి, కుమారితను తమ వెంట రమ్మని బతిమాలుకొనెను గాని, చిన్నది స్థిర చిత్తురాలయి నిరాకరించెను. మేనమామ నన్ను చాటునకు పిలిచి, మంచి వరుని విచారించి వివాహము చేయవలసినదని చెప్పి, అప్పను, మేనల్లుని వెంటగొన వెడలిపోయెను. ఆమె అన్న గారు ఆవరకు నాతో అనేక పర్యాయములు మాటాడి ఉత్తరములు వ్రాసిన వాడేయైనను, బహిష్కార పత్రికలు వచ్చిన తరువాత జడిసి, సాహసింపలేకపోయెను.

పులవర్తి శేషయ్య అను వైదిక విద్యార్థికి ఆ చిన్నదానిని 1883 జనవరి 3న వివాహము చేసితిమి. ప్రజాక్షేమ కార్యముల యందుత్సాహము కలిగి, నాకు సహాయములుగా నుండిన విద్యార్థులలో నితడొకడు. తరువాత పదవ వివాహము చేసికొన్న నల్లకొండ కోదండరామయ్యగారింకొకడు. ఇటువంటి విద్యార్థులకనేకులకు పాఠశాల జీతములు మొదలయినవి యిచ్చి, సాయము చేయుచుండెడి వాడను. ఆ కాలమునందు విద్యార్థులు మాకు చేసిన సాయమును నేన్నెటికి మరువజాలను. కొందరు లోకోపకార కార్యార్థమయి అగ్నిహోత్రములో దూకమన్నను వెనుదీయనివారు. ఏ కార్యమును చేసికొని రమ్మన్నను మారుమాటాడక చెప్పినట్లు చేసుకొని వచ్చుచుండిరి. ఇటువంటివారి తోడ్పాటువలననే మేమనేక కార్యములు నిర్విఘ్నముగా నిర్వహింపగలిగితిమి.

బాలవితంతువులతోను, వితంతు సంరక్షకులతోను మాటాడి, ప్రోత్సాహపరిచి, సంస్కార వ్యాపకము చేయు నిమిత్తమయి నెలకు 8 రూపాయల జీతమేర్పరచి పంచార వెంకన్నగారిని నియమించితిని. ఆయన, ఆ వితంతువుతో మాటాడితిని. ఆ వితంతువుతో మాటాడితిని, ఈ సంరక్షకుని, ఆ సంరక్షకుని ప్రోత్సాహ పరచి ఒప్పించితిని అని చెప్పుచు అక్టోబరు నుండి నావద్ద మూడు నెలల జీతము పుచ్చుకొనెను. ఆ వితంతువు మాట, ఈ వితంతువు మాట అటుండగా, 18 ఏండ్ల ప్రాయముగల ఆయన కూతురే నాల్గవ నెలలో మా యింటికి పరిగెత్తుకొని వచ్చి తనకు పతిభిక్ష పెట్టుమని నన్ను

శ్రీ వీరేశలింగం పండితులు నిశ్చయముగా మహాపురుషుడు. సాహిత్యములో ఒక శాఖను ప్రారంభించి, సంఘములో పురోభివృద్ధి పంథా లేవదీసిన మాన్యుడు. ఇది మిగుల కష్టతరమైన పని. తెలుగుదేశపు సేనాధిపతులైన వంశపురుషుల రక్తము ఆయనలో ప్రవహించుచున్నది. కనుకనే వారిలో సాహసము నిశ్చలత్వము కనబడతవి.

**- గురజాడ అప్పారావు.** (డైరీ నుండి)

1880లో తెలుగు నాటక రంగం పుట్టిందని చెప్పొచ్చు. ఎందుకంటే రాజమండ్రి బాలికోన్నత పాఠశాలలో కందుకూరి వీరేశలింగం పంతులు గారు వ్రాసిన "వ్యవహార ధర్మబోధిని' అనే తొలి తెలుగు రూపక ప్రదర్శన జరిగింది. అందుకే 1980లో నాటక శతజయంతి జరుపుకోవడం జరిగింది. **- సి.ఎస్. నారాయణ**

('20వ శతాబ్దంలో తెలుగు సాహిత్య వికాసం' పుస్తకంలోని 'సాంఘిక నాటక రంగం - పరిణామం' వ్యాసం నుండి. సంపాదకులు: కొట్టి రామారావు, జిసనారా. ప్రచురణ: ఆంధ్ర సారస్వత సమితి, మచిలీపట్నం. ప్రచరించిన సంవత్సరం 2001)

వేడుకొనెను. తండ్రి కొమారిత వెంటనే పరిగొత్తుకొని వచ్చి విలపించుచు, తన కొమారితను పంపివేయవలసినదనియు, తనకు వంటచేసి పెట్టుటకు వేరు దిక్కులేరనియు వేడుకొనెను. వంటచేసి పెట్టుటకు వేరొక వనికత్తెను కుదుర్చుకోవలసినదనియు లేకపోయిన యెడల ఉద్యోగములో నున్న కొడుకు వద్దనుండవలసిన దనియు హితము చెప్పి, పనినుండి తొలగించి, కుమారితను మా యింటనే ఉంచుకొని, ఆయనను పంపివేసితిని.

మంజులూరి వెంకట్రామయ్యగారు ప్రాయశ్చిత్తము చేసికొని వెడలి పోవునప్పుడు. 20 యేండ్ల వయసుగల తన తమ్ముని మా యింట దిగవిడిచి పోయిరి. నేనాతని ముద్రాక్షరశాలలో అక్షరములు కూర్చు పనిలో పెట్టి, నెలకు 6 రూపాయలిచ్చుచుంటిని. గోపాలమను పేరుగల ఈతడు తనకు వివాహము చేయవలసినదని నన్ను తొందర పెట్టుచుండెను. అతనికి 8 రూపాయలు జీతము చేసి, 1883 జనవరి 30న, కొత్తగా వచ్చిన వితంతువు నాతనికి పెండ్లిచేసితిని.

ఆ సంవత్సరము గోదావరి పుష్కరము. ఆ వరకు తలవెంట్రుకలున్న బాల వితంతువులను సంరక్షకులు రాజమహేంద్రవరము తీసికొని వచ్చి, గోదావరి తీరమున శిరోజములు తీయించి, విరూపిణులను చేయుదురు. ఆ యాచారమును బట్టి 17 ఏండ్ల గల ఒక వైదిక వితంతువును తల్లియు, అన్నగారును రాజమహేంద్రవరమునకు తెచ్చి, గోదావరి యొడ్డుననున్న సత్రములో దిగియుండిరి. తెల్లవారిన శిరోజములు తీయింతురనగా, ఆ రాత్రి ఎట్లో ఆ చిన్నది తనవారినేమరించి తప్పించుకొని వచ్చి నన్ను శరణు జొచ్చెను. తన ప్రస్తుతావస్థను బట్టి ఎంత బీదవానినైనను వివాహముచేసికొన సంసిద్ధురాలనని ఆ చిన్నది నన్ను దీనముగా వేడుకొనెను.

మా పాత పురోహితుడు ప్రాయశిత్తము చేసికొని పారిపోగా విధురుడైన చెలుకూరి నాయాణయమూర్తి యనునతని పురోహితునిగా నేర్పరచుకొంటిమి. ఆదినమున 23 సం. ప్రాయముగల అతని మేనల్లుడొకడు అమలాపురము నుండి రాజమహేంద్రవరకు మీదుగా కాకినాడ పోవుచు, మేనమామను చూడబోయెను. మేనమామ వితంతు వివాహము చేసికొమ్మని ప్రోత్సహించగా నతడంగీకరించెను. కొత్తగా వితంతువు వచ్చినదని విని మా పురోహితుడు, ఆమెను తానైనను, తన మేనల్లుడైనను వివాహము చేసుకొనవచ్చునని ఆలోచించి, తన మేనల్లుని వెంటబెట్టుకొని నా వద్దకు వచ్చి తన అభిమతము తెలుపగా, నేనా చిన్నదానికి వారిరువురను చూపి, "ఇతడు పురోహితుడు, ఇతడు వంట బ్రాహ్మణుడు, వీరిలో నెవరినైన పెళ్ళియాడుట కిష్టమున్నదా" అని అడిగితిని. పడుచువాడైన రెండవ వానిచే చేసికొనెదనని ఆమె చెప్పెను. నేను శతమానము చేయించి ఆ రాత్రియే వారికి వివాహము చేసితిని. ఆరవది అయిన ఈ వివాహము 1883 మార్చి 13న నడచినది.

అయిదవ వివాహమునకు వంట బ్రాహ్మణుడు లేచిపోగా నా భార్యయే గోదావరినుండి నీళ్ళు తెచ్చి, వంట మొదలైన పనులెల్లను చేసి ఎంతో కష్టపడవలసినదయ్యెను. ఈ కార్యములయందు నావలనే నా భార్యయు బద్ధాదరము కలదయి, సర్వకష్టములును సంతోష పూర్వకముగా సహించి, నన్ననుసరించుచు, సహధర్మచారిణి అన్న పేరు అన్వర్థము చేయుచుండెను. వంటలు మొదలైనవి చేయగలిగిన శ్రోత్రియ బ్రాహ్మణునకే ఈ వివాహము చేసి, వంట బ్రాహ్మణుల బెదిరింపులను తప్పించుకోగలిగితిమి. ❖




# రాజశేఖర చరిత్రము

– సహవాసి

నేటికి దాదాపు 130 సంవత్సరాల క్రింద ఒక మహానుభావుడు తెలుగు సాహిత్యంలో కొత్త ప్రక్రియ కొకదానికి అంటు కట్టాడు. అదే నేడు వికసించి ఫలపుష్ప భరితమై పరిమళాలు విరజిమ్ముతూ ప్రపంచస్థాయి కెదిగింది. ఆ మహానుభావుడు కందుకూరి వీరేశలింగం. ఆ ప్రక్రియ నవల. తెలుగులో తొలి సామాజిక నవలగా వాసికెక్కిన ఆ నవల రాజశేఖర చరిత్రము.

యూరోపియన్ భాషల్లో సామాజిక నవల అవతరణకు ఆలంబనగా జరిగిన పరిణామక్రమం తెలుగు నవల ప్రాదుర్భావంలో కాగడాకు దొరకని మాట నిజం. కానీ ఇక్కడా 19వ శతాబ్దం ఉత్తరార్ధంలో సంభవించిన మార్పుల జడి తెలుగు నవల పుట్టుక, పురోభివృద్ధి తదాది పరిణామ వికాసాలకు అనువైన నేపథ్యాన్ని సృష్టించింది. 1850-55 మధ్య గోదావరా, ఆనవాలుకు అందనంతగా మార్చేసింది. ఆర్థికంగా సాధించిన అభివృద్ధి ఇతర రంగాలను ప్రభావితం చేసింది. రైతుకు మళ్ళీ నడుం లేచింది. నడిమివర్గం నవజవసత్వాలు పుంజుకుంది. విద్యావ్యాప్తి జరిగింది. రాజమండ్రిలో ఏకంగా కళాశాలే వెలసింది. ఆంధ్రదేశంలో మొట్టమొదటిసారిగా ఉన్నతవిద్య వన్నెచిన్నెలను కన్న అదృష్టం రాజమండ్రి ప్రాంతానిదే.

అదే రాజమండ్రిలో పుట్టి, పెరిగి, ఇంగ్లీషు చదువు నేర్చిన వీరేశలింగం అసమాన సామాజిక స్పృహతో తాను చూస్తున్న సమాజాన్ని అర్థంపర్థం లేని ఆచారాలతో అంధ విశ్వాసాలతో కుళ్ళిపోయిన సమాజాన్ని మార్చటానికి నడుం కట్టాడు. జనంలో చైతన్యం తీసుకురావడానికి నూతన సాహిత్య ప్రక్రియ కావాల్సి వచ్చింది. ఆంగ్ల సాహిత్యం అధ్యయనం చేసినవాడు కాబట్టి వీరేశలింగం సహజంగానే డికెన్స్. గోల్డ్‌స్మిత్ ప్రభృత ఇంగ్లీషు నవలాకారుల రచనలవేపు ఆకర్షితుడయ్యాడు. వచనం తన భావాలను పటుతరంగా ప్రజలకు బట్వాడా చేయగలిగే ప్రక్రియ అని భావించి గోల్డ్ స్మిత్ రాసిన వికార్ ఆఫ్ వేక్ ఫీల్డ్ నవలని నమూనాగా తీసుకుని రాజశేఖర చరిత్రము రాయడానికి ఉపక్రమించాడు. స్ఫూర్తి గోల్డ్‌స్మిత్ నవలే అయినా మూర్తి పూర్తిగా ఆయన కల్పించిందే. కథ స్థూలంగా వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్‌కి అనుసరణ అన్నది ఆయన స్వయంగా చెప్పారు. కాని ఆ కథకు వీరేశలింగం సమకూర్చిన నేపథ్యం యావత్తూ ఇక్కడిదే.

"విదేశీభాషలోని ఒక ప్రక్రియని, ఇతివృత్తాన్ని, కథన శిల్పాన్ని స్వభాషా పాఠకుల కోసం, మన వాతావరణానికి సరిపోయేటట్టు, స్వజాతీయత ఉట్టిపడే రీతిలో తెలుగు సంప్రదాయంలో తెలుగు సంస్కృతిని ప్రతిబింబిస్తూ సంఘ సంస్కరణ లక్ష్యంతో వీరేశలింగం రాజశేఖర చరిత్రము సృజించాడు. గోదావరీ తీర ప్రాంతంలోని బ్రాహ్మణ కుటుంబాల జీవితంలో ఇందులో తన నీడ చూసుకుంది. "ఆ జీవితమే కాదు ఆనాటి సాంఘిక పరిస్థితులు, ఆ పరిస్థితుల్ని సృష్టిస్తున్న, ఆ పరిస్థితుల్లో జీవిస్తున్న పాత్రలు మొదలైన అంశాలను వీరేశలింగం చిత్రించిన పద్ధతి నేపథ్యానికి, పాత్రలకూ, కథకూ, కథా వస్తువుకూ ఉన్న వికటమైన సంబంధాన్ని నిరూపిస్తుంది," అని ప్రముఖ విమర్శకుడు వల్లంపాటి వెంకటసుబ్బయ్య విశ్లేషించారు. దేశ కాలాలు, ఆనాటి భావజాలం నిజాయితీతో ప్రామాణికంగా చిత్రితమైన నవల రాజశేఖర చరిత్రము. సాధారణ మానవుడు అతడి గుణదోషాలతో ఆనంద విషాదాలతో కథా నాయకుడు కావటం రాజశేఖర చరిత్రము నుంచే మొదలు అన్న అంశాన్ని పాఠకులోకం గుర్తించింది.

రాజశేఖర చరిత్రము నవల వెలువడ్డనాటికి అప్పటి జనాభా లెక్కల ప్రకారం దేశంలో పాతికేళ్ళలోపు వితంతువులు 12 లక్షలు! బాల వితంతువుల స్థితి హృదయవిదారకం. ఆడ పిల్లలకు అక్షరజ్ఞానం కూడదు. లోకజ్ఞానం ఉండదగదు. భూతవైద్యులు బ్రతకాలి! దయ్యమంటూ లేని ఇల్లే కనపడేది కాదట ఆరోజుల్లో. ఈ మాట వీరేశలింగం స్వయంగా రాశాడు.

"అప్పుడు దయ్యము లేని ఇల్లు లేనేలేదని చెప్పవచ్చును. ఎవ్వరు కొత్తగా చచ్చిననను వారు దయ్యములై తిరుగుచుండిరని ఎల్లవారును చెప్పుకొనుచుండిరి".

వీరేశలింగం కన్నతల్లే దయ్యాల భయంతో ఉక్కిరిబిక్కిరైపోయింది. దయ్యాల బూచి చూపి బొజ్జలు నింపుకున్నారు కొందరు. పరలోక భయం గురించి చెప్పి జనాన్ని అజ్ఞానాంధకారంలో ముంచేశారు మరికొందరు. దుర్మార్గ దురాచార పిశాచం సమాజాన్ని పీక్కు తింది. అలాంటి అంధ యుగంలో వీరేశలింగం పుట్టి పెరిగాడు. సమకాలీన సమాజ స్థితికి చలించి పోయి తన కాలానికి పని చెప్పాడు. అది పదును మెరుపులు మెరిసిన కత్తి. ఆ ఖడ్గ ధారక్కూడా తెగని మొద్దుచర్మం ఆనాటి సంఘానిది. అందుకని వజ్రాయుధం చేతపట్టాడు. పత్రిక ఆయన వజ్రాయుధం. అదే వివేకవర్ధని పత్రిక వజ్రాయుధానికి నూరంచులు. ఆయనకు గుండె నిండా ధైర్యం. బోగంమేళాల్ని, దొంగ యోగుల్ని, పోలీసుల దొంగతనాల్ని న్యాయవాదుల అన్యాయాల్ని, అధికారుల కండకావరాన్ని నిర్భీకతతో నిశిత పదజాలంతో ఆయన ఎండగట్టాడు, చెండాడాడు.

1880లో రాజశేఖర చరిత్రము పుస్తకరూపంలో పాఠకుల చేతుల్లోకి వచ్చింది. రాజశేఖర పాత్ర చిత్రణలో వీరేశలింగం తాతగారి వ్యక్తిత్వం ఒరవడి అయినట్లుగా స్వీయచరిత్ర ద్వారా తెలుస్తుంది. రాజశేఖరుడి ఇల్లు, ఆయన దర్జా, ఆయన అతిథిసేవ, బీరకాయపీచు చుట్టరికాలు కలుపుతూ తేర తిండికి ఎగబడి వచ్చేవాళ్ళూ వీరేశలింగం కల్పించినవి కావు. తాతల, తండ్రుల జీవిత విశేషాల నుంచి, స్వీయానుభవం నుంచి తీసుకున్నవే.

స్థూలంగా ఇదీ కథ–

రాజశేఖరుడు ధవళేశ్వరం వాస్తవ్యుడు. సంపన్న మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబంలో పుట్టాడు. పురాణాలు, కావ్యాలు చదువుకున్నవాడు. నీర్కావి ధోవతి, తలకి వదులుగా చుట్టుకున్న సరిగంచుల చలువబట్ట, చెవులకు రవ్వల కమ్మలు, కుడిచేతి వేలికి బంగారపు దర్భముండి ఉంగరం, తర్జనిలో రెండు వెండి బటువులు రాజశేఖరుడి పెద్దరికాన్ని చెప్పకనేచెబుతాయి. ఆయన ఇల్లు చూస్తే ధర్మప్రభువులు లోగిలి అంటే ఇదే కాబోలు అనిపిస్తుంది. వీధిగుమ్మానికి రెండువైపులా విశాలమైన పెద్ద అరుగులు, మధ్యన లోపలికి పోయే నడవా, నడవ మొగదల సింహద్వారం, గుమ్మం దాటి లోపలికి వెళ్ళగానే చావడి, దానికెదురుగా పెద్ద కుందు, కుందుకు ఉత్తర దక్షిణాల్లో ఒకదానికొకటి ఎదురుగా రెండు చావళ్ళు, ఒక చావడికి రెండు పక్కలా రెండు పెద్ద గదులు... ఆ కాలపు ఇళ్ళలో అంతటి ప్రశస్తమైనది లేదని చెప్పవచ్చు. కచేరీ చావట్లో బంధుమిత్రులు, పెద్దలతో సమావేశమవుతూ ఉంటారు. మధ్యాహ్న భోజనం, ఆ తరువాత పురాణ కాలక్షేపం అక్కడే. ఎప్పుడూ వచ్చిపోయే బంధువుల్తో అతిథుల్తో ఆ ఇల్లు సందడిగా ఉంటుంది.

భార్య మాణిక్యాంబ, మహా అనుకూలవతి. ఎందరు వచ్చినా వండి వార్చడంలో ఆమె విసుగనేది ఎరుగదు. ఇద్దరు కూతుళ్ళు. పెద్దమ్మాయి రుక్మిణి. అందమే ఆమె రూపంలో అవతారమెత్తినట్టుంటుంది. చిన్నతనంలోనే వివాహమైంది. భర్త నృశింహస్వామి. మాయదారి స్నేహాలు మరిగి ఇంటి పట్టున ఉండక ఊళ్ళు పట్టుకు తిరుగుతున్నాడని రుక్మిణికి మానసికంగా అశాంతి. చిన్నమ్మాయి సీత, రాజశేఖరుడి చెల్లెలు సుబ్బమ్మ తలచెడి అన్న ఇంట్లోనే వాసగ్రాసాలు. కాలం చేసిన మరో సోదరి భర్త దామోదరం, మేనల్లుడు శంకరం రాజశేఖరుడి ఇంట్లోనే ఉంటారు. దామోదరం ఇంట్లో తిని ఇంటి వాసాలు లెక్కపెట్టే దౌర్భాగ్యుడు. శంకరం చాకులాంటి కుర్రాడు. రాజశేఖరుడు ఈ మేనల్లుడికే తన రెండో కూతురు సీతనిచ్చి వివాహం జరపాలని నిశ్చయించుకున్నాడు. కొడుకు సుబ్రహ్మణ్యం. బుద్ధిమంతుడు. చక్కగా చదువుకుంటున్నాడు. ఇదీ రాజశేఖరుడి కుటుంబం.

ఇక ఆయన ఆశ్రితులనండి, బంధువులనండి, స్నేహితులనండి బోలెడు మంది. నిత్యం దర్శనం చేసుకుంటాడు సిద్ధాంతి. మహా లౌక్యుడు. సందర్భం వచ్చినప్పుడల్లా రాజశేఖరుడి ముఖస్తుతి చేస్తూ పాతికో పరకో రాబట్టుకుంటాడు. ధవళేశ్వరంలోను, చుట్టుపక్కల ఊళ్ళలోనూ వేరే పురోహితుడు లేకపోవడంతో ఈ సిద్ధాంతే ఆముదపు చెట్టు. ఏకచ్ఛత్రాధిపత్యం చెలాయిస్తున్నాడు. జనార్ధనస్వామి ఆలయ పూజారి రాఘవాచార్యులు స్వామివారికి నిత్యమూ బాలభోగం, నందాదీపం తదితర ఉత్సవాలకు రాజశేఖరుడి దర్శనం చేసుకుంటూ ఉంటాడు. స్వామివారి ఖర్చులు భరిస్తున్నది రాజశేఖరుడే. బావమరిది దామోదరం కాక, రాజశేఖరుడిని ఆశ్రయించుకున్న మరో ప్రభుద్ధుడు నారాయణమూర్తి, ఎవ్వరూ చూడకుండా రాజశేఖరుడి గదిలో దూరి డబ్బు అప్పుడిగి తీసుకోవడం అతని కలవాటు. బదులు తీసుకోవడమే గాని తీర్చే అలవాటు లేదు. అప్పు చేసి పప్పుకూడు సామెతకి నిలువెత్తు నిదర్శనం.

అతిథి అభ్యాగతులంటారా లెక్కే లేదు. "మన బంధువల్లో రాజశేఖరుడు బహుయోగ్యుడు సుమీ!" అంటూ మెరమెచ్చు మాటలతో తిష్ఠ వేసిన ప్రసాదరావు– "మీ తల్లిగారి మేనత్త అల్లుడు మా మేనమామకు సాక్షాత్తు వేలు విడిచిన మేనత్త కొడుకు," అంటూ బీరకాయ పీచు చుట్టరికం కలిపే వామరాజు భైరవమూర్తి, "పదిమంది బ్రాహ్మణులకింత అన్నం

పెట్టి సంభావన ఇచ్చే సార్థక జన్ములు మీరు," అంటూ భోజనం వేళకి దిగడే బులుసు పేరయ్య సోమయాజులు-ఇలా ఎందరో మహానుభావులు! వారందరికీ వందనాలే కాదు విందుభోజనాలు, సంభావనలు సమకూరుస్తూ రాజశేఖరుడు తన డబ్బు ఎంత కరిగిపోతున్నదో ఏనాడూ ఆలోచించి ఎరగడు. పైకి గంభీరంగా కన్పిస్తాడు. కాని పొగడ్తలకు లోలోన ఉబ్బిపోతుంటాడు. ఆశ్రితులకు అతని బలహీనతలు తెలుసు.

రాజశేఖరుడికి బైరాగులంటే భక్తి శ్రద్ధలు. పరమహంస క్రియలు, వనమూలికలు బైరాగులుకు తెలిసినంతగా మరెవరికీ తెలియవని అతని నమ్మకం. నంబి రాఘువాచార్యుల ద్వారా రాజశేఖరుడికి ధవళేశ్వరంలో విడిది చేసిన ఓ బైరాగితో పరిచయమైంది. అతనికి స్వర్ణముఖీ విద్య (ఇతర లోహాలను కరిగించి బంగారంగా మార్చడం) తెలుసుననీ, ఉచిత వైద్యంతో దీర్ఘరోగాలను మాటుమాయం చేస్తాడనీ పూజారి. సిద్ధాంతి ప్రభృతులు టముకు వేశారు. ఎవరేం చెప్పినా నమ్మటం ఆయన బలహీనత. బైరాగితో పరిచయమైన రోజు రాజశేఖరుడి జీవితంలో దుర్దినం. ఆయన దివాలా తీయడానికి అది ఆరంభం.

రథోత్సవం నాడు రాజశేఖరుడి కుంటుంబం గుళ్ళోకి వెళ్ళగా, పెద్దమ్మాయి రుక్మిణి మెళ్ళోని కాసుల హారాన్ని గుర్తు తెలియని దొంగ గుంజుకుపోయాడు. సిద్ధాంతి హరి శాస్త్రులనే మంత్ర శాస్త్రవేత్తని రాజశేఖరుడికి పరిచయం చేశాడు. మంత్రవేత్త కాదు వాడు. మాయ చేయగల ప్రజ్ఞావంతుడు, తెరచాటు మోసంతో చూచేవాళ్ళకు అనుమానం రాకుండా చౌకబారు ట్రిక్కులతో నమ్మకం కలిగించి కుతంత్రంలో కృతకృత్యుడు కావడం వాడు సాధనచేసిన విద్య. వాడి మాయలో పడిన రాజేశేఖరుడు చాలా డబ్బు, కొత్త బట్టలు అర్పించుకున్నాడు. బంగారం చేసి ఇస్తానని దొంగ మాటలు చెప్పిన బైరాగి వలలో చిక్కి రాజశేఖరుడు దివాళా తీశాడు. ఆప్తమిత్రులనుకున్నవాళ్ళు ముఖం చాటేశారు. వేలకి వేలు అప్పుడిగి సంగ్రహించిన నారాయణమూర్తి మంచి స్థితిలో ఉండి కూడా నిస్సహాయుణ్ణని కపటపు మాటలు పలికాడు. అదే సమయంలో చెల్లెలు మరణించింది. అంత్యక్రియలు పూర్తి చేయాలంటే బ్రాహ్మణుల్లో సహకరించడానికి వచ్చినవాడు లేడు. బావమరిది దామోదరం అంతకుముందే అలిగి కొడుకు శంకరంతో వేరే పోయాడు.

పువ్వులమ్మిన చోట కట్టెలమ్మాలన్న దుర్దశ భరించలేక లంకంత లోగిలిని తాకట్టు పెట్టి, వచ్చిన డబ్బుతో కాశీయాత్రకు సకుటుంబంగా బయల్దేరి వెళ్ళిన రాజశేఖరుడికి అడుగడుగునా అవరోధాలే. కాశీయాత్ర సాగలేదు గాని కష్టాలకడలిలో ఈదులాటతో అతడు అలసిపోయాడు. చిట్టచివరికి రాజాకృష్ణ జగపతి దయవల్ల అతడి జీవితాంబరంలో కమ్ముకున్న కారుమబ్బులు తొలగిపోతాయి. సుదీర్ఘ రాత్రి గడచి సూర్యోదయమవుతుంది. రాజశేఖరుడికి జీవితమే పాఠశాల అయ్యింది. అనుభవాలు గుణపాఠాలయ్యాయి. వివేకచోదితుడయ్యాడు. మూఢనమ్మకాల్ని మనస్సులోంచి పెకలించి వేశాడు. జ్యోతిష్యాన్ని నమ్మటం మానేశాడు. మనిషి పూర్తిగా మారిపోయాడు. భవిష్యత్తులో విశ్వాసం ఉంచి కాలం చేశాడు. ఆయన కాలం చేసి అనేక సంవత్సరాలు గడిచాయి. భవిష్యత్తుపై ఆయన విశ్వాసం వమ్ముకాలేదు. దీంతో నవల ముగుస్తుంది.

రాజశేఖర చరిత్రము మళ్ళీ ఫార్చున్స్ వీల్ అన్న టైటిల్‌తో ఇంగ్లీషులోకి అనూదికం అయింది. (T.R. Hutchinson: Fortune's Wheel) వీరేశలింగం జీవించిన కాలపు సమాజ స్వరూప దర్శనం కోసం రాజశేఖర చరిత్రము ఇంగ్లీషులోకి అనువాదం అయినట్లుగా ఆనాడు చెప్పుకున్నారు. వీరేశలింగం సాహిత్యకృషి ఒకెత్తు-స్త్రీ విద్యావ్యాప్తి, వితంతు పునర్వివాహం, మూఢ విశ్వాసాలు-సాంఘిక దురాచారాల నిర్మూలనం ఆయన విపరీత ప్రయాసాయాసాలు పడి కృషి చేసిన రంగాలు.

అప్పటి పరిస్థితుల్లో అడుగు ముందుకు వేయటమే కష్టం. అటువంటిది సంఘ సంస్కరణ ప్రయాణంలో మైళ్ళు ముందుకు నడిచాడు. మైలురాళ్ళు స్థాపించాడు. "కార్యశూరుడు వీరేశలింగం కదం తొక్కి పోరాడిన సింగం, దురాచారాల దురాగతాలను తుదముట్టించిన అగ్నితరంగం," అని శ్రీశ్రీ కందుకూరికి కవితాత్మక వందనం చేశాడు.

నవలా నిర్మాణంలో అది మొదటి ప్రయత్నం కాబట్టి కొన్ని లోపాలు చోటు చేసుకున్న మాట నిజం. అది వీరేశలింగం స్వయంగా అంగీకరించాడు. అయితే రాజశేఖర చరిత్రము, "తరువాత వారి గురుతర పుస్తక రచనకు కొంత తోడుపడవచ్చును," అని ఆయన ఆశించాడు.

"వీరేశలింగం పంతులుగారి వంటి దేవతలను భారతదేశ మెప్పుడు మరచిపోయిన, అప్పుడు మనకు దుర్దశ సంప్రాప్తమైనదనియే చెప్పవచ్చును. పంతులుగారి వంటి ధైర్యము, ఉత్సాహము, కార్యశూరత మన దేశీములలో ఎప్పుడు నాటగలవో, అప్పుడే పంతులుగారి చిహ్నమును స్మరింపగలిగిన వారగుదుమని నా నిశ్చితాభిప్రాయము," అని డా॥ కట్టమంచి రామలింగారెడ్డి నివాళి అర్పించారు-వీరేశలింగం అస్తమించినప్పుడు.

మరువబోమని చెప్పడానికి రాజశేఖర చరిత్రము అవశ్యపఠనీయం.

**(నూరేళ్ళ తెలుగు నవల 1878-1977 పుస్తకం నుండి. ప్రచురణ: పర్‌స్పెక్టివ్స్ 2015)** ◆

# వివేకవర్ధని

- పొత్తూరి వెంకటేశ్వర రావు



SRI

VIVEKAVARTHANI.

శ్రీవివేకవర్ధని

A MONTHLY MAGAZINE OF MORALITY & LITERATURE.

(In which the Vidvanmanoharini is incorporated.)

BAJAHMUNDRY.

Vol. III.] February, 1878. No. 2.

CONTENTS.

Native Civil Service.

Good Luck.

Vaccination.

Our Hospital Assistant.

Correspondence.

Happiness lies in constitution.

RAJAHMUNDRY.

Printed at the VIVEKAVARTHANI PRESS.

**తె**లుగు పత్రికల ప్రచురణలో **వివేకవర్ధని** ప్రచురణ కొత్త అధ్యాయాన్ని ప్రారంభించింది. అప్పటివరకు వెలువడిన పత్రికలు సాహిత్యానికి ప్రాముఖ్యం ఇస్తే, వీరేశలింగం తన పత్రికల నుంచి సామాజిక ప్రయోజనాన్ని ఆశించారు. సాహిత్యం అలాంటి ప్రయోజనాన్ని సాధించడానికి ఆయన దానిని ఒక సాధనం కావించుకొన్నారు.

*"...1874వ సంవత్సరము ఆశ్వయుజ మాసము నుండి* ***వివేకవర్ధని****యను నామముతో నాలుగు పెద్ద పుటలుగల యొక చిన్న మాస పత్రికను తెలుఁగునుఁబ్రకటింప నారంభించితిని. ఆ కాలమునందు మా గోదావరీ మండలములో దొరతనము వారిది తక్క వేఱు ముద్రాయంత్రము లేకపోవుట చేత నా పత్రిక నప్పుడు చెన్నపురిలో బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులవారి సంజీవనీ ముద్రాక్షర శాలయందు ముద్రింపింప నారంభించి, అక్కడ యుక్తకాలమునందు పత్రిక వెలువడక పోవుటచేత మూడు మాసములైన తరువాత శ్రీధర ముద్రాక్షరశాలకు మార్చి పత్రికను ద్విగుణము చేసి 17 పుటలు గల పుస్తకరూపమునఁ బ్రకటింపమొదలు పెట్టితిని..."*

– కందుకూరి వీరేశలింగం[1]

ఆశ్వయుజము అంటే సెప్టెంబరు, అక్టోబరు నెలల కాలం. పదిహేడు పుటలు అన్నారు. అలా బేసి సంఖ్య ఉండదు. ముఖపత్రాన్ని వదలి లెక్కవేస్తే పదిహేడు పేజీలు కావచ్చు. వీరేశలింగం పంతులుకి అప్పటికే పత్రికలతో అనుబంధం ఉంది. పత్రికలకు రాయడం, పత్రికాధిపతులతో సంబంధం పెట్టుకోవడం ఉంది. 1870లోనే ఆయన గోదావరీ విద్యా ప్రబోధినికి రాసేవారు. తరువాత పురుషార్ధ ప్రదాయిని గ్రంథాలనురాసి పంపేవాడని "నా పద్య కావ్యములననేకులు శ్లాఘించి యాకాలమునందలి వార్తాపత్రికలలో వ్రాసియున్నారు. నేనప్పటికి శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధమును, రసికజన మనోరంజనమును ముగించి శుద్ధాంధ్రోత్తర రామాయణమును జేయనారంభించి యుంటిని..." ని ఆయన రాసుకొన్నారు. కొక్కొండ వెంకటరత్నం పంతులు ప్రచురించిన ఆంధ్రభాషా సంజీవనికి ఆయన రాయడం, ఆయనతో అభిప్రాయ భేదాలు రావడం వీరేశలింగం పంతులులో పత్రికా ప్రచురణ వాంఛను ప్రేరేపించినట్లు కనిపిస్తుంది. వివేకవర్ధని 1874 అక్టోబరు నుంచి వెలువడిందని, ఆయన తొలిరచనలైన రసికజనరంజనము, శుద్ధాంధ్రోత్తర రామాయణములను పురుషార్థ ప్రదాయిని 1872 సంచికలలో ప్రచురితమైనవని వీరేశలింగం పంతులుపై పరిశోధన చేసిన అక్కిరాజు రమాపతిరావు రాశారు. ఇంతకూ వీరేశలింగం పంతులుకి పత్రిక పెట్టాలని ఎందుకు అనిపించినట్లు? స్త్రీలకు విద్య అవసరమా కాదా అనే విషయంలో ఉభయుల మధ్య అభిప్రాయ భేదాలు తలెత్తాయి. "నాయూహాలను లోకమునకు వెల్లడించుటకయి స్వకీయమైన వృత్తాంత పత్రికయొకటి యుండుట యుక్తమ"ని భావించడం వల్ల ఆయన పత్రికను ప్రారంభించారట. పత్రికను పెట్టినప్పుడు తన ఆశయాలను ప్రతిబింబించే విధంగా భారతంలోని ఒక నీతి పద్యాన్ని "పత్రికా ముఖమునకు తిలకముగా, పత్రికా నిర్వహణమునందు మాకు మార్గదర్శకముగా ఉండుటకయి" ఎంచుకున్నారు.

క॥ ఒరులేయని యొనరించిన
నరవర యప్రియము తన మనంబునగుఁ దా
నొరులకు నవి సేయకునికి,
పరాయణము పరమ ధర్మ పదములకెల్లన్

శాంతి పర్వంలో భీష్ముడు ''ధర్మంబులు బహువిధంబులట్లు గావున ధర్మ సర్వస్వనైజ స్వరూప నిరూపణంబు సేసి కరతలామలంబుగాఁ బలికెద" అంటూ చెప్పిన సూక్తి ఇది. ఈ "భారత నీతి వాక్య రత్నమును మేము మాకు మూల సూత్రముగాఁ గైకొంటిమి" అని రాశారు వీరేశలింగం. పత్రిక నాలుగవ మాసంలో పత్రికను గురించి, తనను గురించి మరింత వివరంగా ఒక పద్యంలో చెప్పుకున్నారు:

సీ॥ బ్రాహ్మణుండను హూణభాష నేరిచి యుందు
ప్రవేశ పరీక్షనిచ్చినాఁడ
నాంధ్రమున నొకింత యభిరుచి గలవాఁడ
దేశాభివృద్ధికై లేశమైనఁ
బ్రాలుమాలక పాటుపడ నిచ్చఁగలవాడఁ
గవితాపటిమఁగొంత గలుగువాఁడ
నోపిక సర్వజనోపయుక్తములైన
విషయమ్ములను నీతి విషయములును
సులభశైలినందరకు దెలియునట్లు
కఠిన సంధులు లోనుగాఁ గలవి విడిచి
వ్రాయుదునొకప్పు డన్యదేశీయములును
లోనుగాఁగలవానినిఁబూని కూర్తు

దేశాభివృద్ధియు, భాషాభివృద్ధియు తమ ఆశయాలని ప్రకటించి పత్రిక ముఖ్యోద్దేశాలుగా నాలుగు అంశాలను ఆయన ప్రకటించారు. అవి: 1. రాజకీయ ఉద్యోగులలో లంచాలు పుచ్చుకోవడం సర్వసాధారణం. పుచ్చుకొనకపోవడం మృగ్యం. లంచం తప్పుగాక ఉద్యోగ ధర్మమని యెల్లవారి నమ్మకం. కాబట్టి రాజకీయోద్యోగులలోని ఈ అక్రమాన్ని మాన్పడం పత్రిక ఉద్దేశాలలో ఒకటి. 2. లంచాలు తీసుకొనేవారిలోనేగాక ఇచ్చే ప్రజలలోనూ నీతిని పాటించాలనే దృష్టి ఏర్పడాలి. "కాబట్టి ప్రజలలో నీతి మానమును వృద్ధి చేయుట ఇంకొక ఉద్దేశము." 3. వేశ్యామనాదులు దురాచారాలని గ్రహించనంతవరకు నీతి వర్ధిల్లదు. కనుక "కులాచారములను చక్కబఁరుపఁ బూనుట మరియొక ఉద్దేశము." 4. "తులసి రుద్రాక్షమాలాది బాహ్యచిహ్న ధారణముకంటె సత్ప్రవర్తనము మతమునకధికావశ్యకమని జనులలో విశ్వాసము కుదురు వరకును మతము పరిశుద్ధమయి దురాచార నివారకము కానేరదు. కాబట్టి పరిశుద్ధమత సిద్ధాంతములను బోధించుట వేరొక ఉద్దేశము." ఇట్టి సదుద్దేశములతో తమ వివేకవర్ధని వెలువడినదని ఆయన వివరించారు.

ఉపాధ్యాయవృత్తి మానుకొన వలసిన పరిస్థితులు రావడం, ఏ న్యాయవాద వృత్తికో పోదామంటే అందులోనూ నీతిగా జీవించే అవకాశం లేదని మిత్రులు చెప్పడం, తాను అప్పటికే రచించిన కొన్ని పుస్తకాల వల్ల తృప్తికరమైన ఆదాయం రావడం, అంతకుమించి తన భావాలను సమాజానికి చెప్పడానికి అవకాశం ఉంటుందనే ఆశాభావం వీరేశలింగం పంతులు తన దృష్టిని పత్రికమీదనే కేంద్రీకరించేటట్టు చేశాయి. సొంత ముద్రణాలయాన్ని ఏర్పాటు చేసుకొంటే పత్రిక నిర్విఘ్నంగా నడుస్తుందనే ఆలోచన ఆయనక కలిగింది. కొందరు భాగస్తులను కలుపుకొని ఆయన సొంత ముద్రణాలయాన్ని ఏర్పాటు చేయగలిగారు. 1876 ఏప్రిల్ నెలలో స్వగృహంలో ముద్రాయంత్రం నెలకొన్నది. పత్రిక ముద్రణ అప్పటినుంచి సొంత ఇట్లోనే జరుగుతూ వచ్చింది. ఇంచుమించు ఇదే కాలంలో నరసాపురంలో మీర్ షూయజ్ అలీ ఖాన్ అనే ఉత్సాహవంతుడైన ఒక ముస్లిం యువకుడు వద్వన్మనోహారిణి అనే పత్రికను ప్రారంభించారు. వీరేశలింగం పంతులుకి, ఖాన్‌కు 1874 నుంచి స్నేహం ఏర్పడి క్రమంగా వృద్ధిపొందుతూ వచ్చింది. కారణాలు ఏవైనప్పటికీ విద్వన్మనోహారిణీ పత్రికను వివేకవర్ధనిలో విలీనం చేయడానికి ఉభయుల మధ్య అంగీకారం కుదిరింది. వివేకవర్ధనిలో ఇంగ్లీషు భాగాన్ని ఖాన్ రాస్తుంటే తెలుగు భాగాన్ని వీరేశలింగం నిర్వహించారు. 39 సంవత్సరాల చిన్న వయసులో ఖాన్ మరణించారని హిందూజన సంస్కారిణి 1895 అక్టోబరు సంచికలో రాశారు. ఖాన్ మంచితనాన్ని గురించి ఈ పత్రిక ప్రశంసిస్తూ జోహార్లు అర్పించింది. పత్రికల విలీనీకరణ వల్ల గాని ముద్రాక్షరశాలలో శుభలేఖలు అచ్చువేయడం లాంటి పనుల వల్లగాని లాభాలు రాలేదు. అది భాగస్తులకు ఆశాభంగం కలిగించడం సహజమే. సొంత ముద్రణ సొంత ఆదాయాల నుంచి ఖర్చుచేస్తూ వీరేశలింగం పత్రికను నడిపారు. సొంత ముద్రణశాలలో పత్రిక అచ్చు వేసుకోవడంతో సంతృప్తి చెంది వీరేశలింగం నష్టాలను లెక్క చేయలేదు.

ఆంధ్రభాషా సంజీవనికి వివేకవర్ధని పత్రికకు మధ్య సైద్ధాంతికమైన వాద ప్రతివాదాలు వ్యవస్థాపకులు ఒకరినొకరు

ఆక్షేపించుకోవడానికి, ఒకరిపై ఒకరు దుమ్మెత్తి పోసుకోవడానికి దారితీశాయి. 1875 సంవత్సరంలో వివేకవర్ధని పత్రికను వెటకరిస్తూ కొక్కొండ వెంకట రత్నం పంతులు హాస్యవర్ధని పత్రికను ఆంధ్రభాషా సంజీవనికి అనుబంధంగా వెలువరించారు. ముఖపత్రం మీద బొమ్మలో దంతిముఖుడై విఘ్నేశ్వరుడు తాండవం చేస్తుంటే ఆయనకు రెండువైపుల ఎలుకలు చేరి ఆరాధిస్తుంటాయి. వీరేశలింగం దానికి ప్రతిగా హాస్య సంజీవని అనే పత్రికను అనుబంధంగా వెలువరించారు. హాస్య సంజీవని ముఖపత్రం మీద సింహముఖుడై విఘ్నేశ్వరుడు రెండు పార్శ్వాలలోనూ మార్జాలాలు సేవిస్తుంటే తాండవం చేస్తున్న బొమ్మవేశారు. "సింహవక్త్రం మహా కాయం, విఘ్నేశ్వర వరాధిపమ్ / పశ్య సంజీవనీనాథం, మార్జాల యుగళాశ్రితమ్" అని ఒక శ్లోకాన్ని కూడా రాసి వీరేశలింగం కొక్కొండవారి వెటకరింతను తిప్పికొట్టారు. ఒకరి నొకరు విమర్శించుకోవడం పాఠకుల దృష్టిని విశేషంగా ఆకర్షించింది. జనం మొగ్గు వీరేశలింగం వైపు కాగా కొంతకాలానికి కొక్కొండవారు హాస్యవర్ధనిని నిలిపి వేశారు. వీరేశలింగం హాస్య సంజీవనిని వివేకవర్ధనిలో విలీనం చేశారు. వీరేశలింగం పంతులు రచించిన బ్రాహ్మ వివాహం మొదట ఈ పత్రికలోనే వెలువడింది. అందులోని భాష, శైలి జనాన్ని విశేషంగా ఆకర్షించాయని వీరేశలింగం రాశారు. బ్రాహ్మవివాహం ప్రచురణ తరువాత రెండు సంవత్సరాలకు వీరేశలింగం ఏదో పని మీద బందరువెళితే అక్కడ ఒక బ్రాహ్మణ బాలిక బ్రాహ్మవివాహం రచన మొత్తాన్ని – ఎలా కంఠస్థం చేసిందోగాని "మొదట నుంచి తుదవఅకును" ఏకబిగిన అప్పగించినదట. తన రచనను చాలాచోట్ల చాలామంది అభిమానించేవారని స్వీయ చరిత్రలో వీరేశలింగం పేర్కొన్నారు. హాస్య సంజీవని పత్రిక వెలువడి, తరవాత "పుస్తకరూపమున నదృశ్యమూన వివేకవర్ధనిలో నంతర్భాగముగాఁ బ్రవేశించి దురాచార దుర్నీతి భంజనమునందెంతోపని చేసినది. ఈ ఉపకారమునకు హేతుభూతులు శ్రీపంతులవారేయైనందున నేను వారికిఁ గృతజ్ఞతా పూర్వకములైన యభివందన శతములర్పించుచున్నాను." అని రాశారు వీరేశలింగం పంతులు స్వీయచరిత్రలో. ఆంధ్ర భాషా సంజీవని లో "స్త్రీలకి విద్య కూడదు" అని వ్యాసం రాస్తే "పురుషులకు విద్య కూడదు" అని హాస్య సంజీవనిలో రాసేవాళ్ళమని కూడా ఆయన తమ విధానాన్ని వివరిస్తూ రాశారు. కొక్కొండ వారి వాదనలోని బలహీనతలను పూర్తిగా ఉపయోగించుకొని ఆయన వాదాన్ని తిప్పికొట్టడం వీరేశలింగం పంతులు పాటించిన వ్యూహం.

పత్రికా నిర్వహణలో నిజాన్ని సూటిగా, నిర్మొగమాటంగా చెప్పినందుకు ఎటువంటి కష్టాలు రావడానికి అవకాశాలు ఉన్నాయో అవన్నీ వీరేశలింగం ఎదుర్కొనవలసి వచ్చింది. తనతో పత్రికలో భాగస్తులైన వారు దావా వేయడం కూడా జరిగింది. ఇన్ని కష్టాలను ఆయన ధైర్యంగా ఎదుర్కొనడం ఆయనకు చరిత్రలో ఒక సమున్నత స్థానాన్ని సంపాదించి పెట్టింది. కాని, ఆయన నిజానికి చరిత్ర గుర్తించినంత గొప్పవాడు కాడనీ, ఆయన బలహీనతలు ఆయనకు ఉన్నాయనీ వాదించిన వారున్నారు. వారిలో ఒక సుప్రసిద్ధ గ్రంథకర్త, చరిత్ర పరిశోధకులు, న్యాయవాది దిగవల్లి వెంకట శివరావు. వీరేశలింగం – వెలుగు నీడలు అనే గ్రంథంలో వీరేశలింగం తన జీవిత చరిత్రలో అన్నీ నిజాలు మాత్రమే రాయలేదని తేల్చారు.

వివేకవర్ధని పత్రికను వీరేశలింగం ప్రారంభించిన పరిస్థితులను గురించి, వీరేశలింగం పంతులును స్వయంగా ఎరిగిన శివరావు ఇలా వ్యాఖ్యాన పూర్వకంగా రాశారు. పురుషార్థ ప్రదాయని మొదటి సంచిక నుంచి చందాదారుగాచేరి ఆ పత్రిక తొక్కుతున్న కొత్త దారులను శ్రద్ధగా కనిపెట్టుతున్నారు. ఆ పత్రిక, పత్రికాధిపతీ మంచి ప్రచారంపొంది, గొప్ప ప్రతిష్ఠకెక్కటం బాగా గమనించారు. పత్రిక చూపుతున్న సంస్కరణలు నూతన విద్యాధికులను ఆకర్షించుటను అవగాహన చేసుకొన్నారు. ధవళేశ్వరం హెడ్మాస్టరయిన మూడు నెలలకే ఆ చిన్న పట్నంలో గల పెద్దలను ఆకర్షించి బాలికా పాఠశాల పెట్టించారు... ఆశువుగా పద్యాలు చెప్తూ, అవధానాలు చేసి చూపుతూ పండితుడు, కవి, సంస్కరణ భావశాలిగా పేరొందుతూ మరొక నెలకు 'వివేకవర్ధని' పత్రికను ప్రారంభించారు. హెడ్మాస్టరుగా 44 రూపాయల జీతముతోనూ, పాఠ్యపుస్తకాలు తెచ్చిన కొత్త ఆదాయంతోనూ పత్రికా స్థాపనకు పూనుకొన్నారు. పురుషార్థ ప్రదాయిని వొరవడిలో దానిని మించిపోవలెననే పోటీ బుద్ధితో పత్రికా స్థాపన చేశారు... వివేకవర్ధని పత్రిక పెట్టి పుస్తకంపై ఇంతపెద్ద మొత్తాన్ని కళ్ళజూచిన వెంటనే పత్రికకొక ముద్రణాలయం పెట్టాలని తలచారు. చల్లపల్లి బాపయ్యగారి సాయంతో 2100 రూ.ల వాటా ధనం సేకరించి, అందులో 350 రూ.ల తన పెట్టుబడితోఁ ప్రెస్సు పెట్టి, దానిని నడిపినందుకు ఆదాయములో ఎనిమిదవ వంతు జీతంగా పుచ్చుకొనేవారు. ప్రెస్సు పెట్టిన కొత్తల్లో నష్టం వచ్చేది. అది చూచి వాటాదార్లు ప్రెస్సు విషయం వదిలేశారు. అనతికాలంలో ప్రెస్సు లాభాలు ఇచ్చింది. కాని అప్పటికే అది తనకు దఖలు

పడి పోయింది. అప్పట్లో పంతులు గారిని ఎవ్వరూ ఏమీ అడగలేదు. స్త్రీ పునర్వివాహోద్యమం చేపట్టిన తర్వాత (ఏర్పడిన) ప్రతికక్షులు ప్రెస్సులో వాటాదార్లను రెచ్చగొట్టి వ్యాజ్యెం చేయించగా 1200 రూపాయలిచ్చి పరిష్కరించుకొన్నారు... .... 1876 జూలైనెలకే వివేకవర్ధని పక్షపత్రికగా ఎదిగింది. ఇంగ్లీషు అనుబంధంతోనూ, హాస్యానుబంధంతోనూ వెలవడసాగింది...."

వివేకవర్ధని రెండవ సంపుటం, మూడవ సంచికలో వీరేశలింగం "విజ్ఞాపనము" శీర్షిక కింద పత్రికను మద్రాసు నుంచి రాజమండ్రికి మార్చడం గురించి రాశారు. ఇది యువ నామ సంవత్సరం మార్గశిర, పుష్య, మాఘ, ఫల్గుణ మాసాలన్నింటికి కలిపి ప్రచురించిన సంచిక, యువ నామ సంవత్సరం అంటే 1875.

"సుహృత్తములగు చందాదారులారా! ఈ వివేకవర్ధని ఇదివరకు జన్మభూమికి బహు యోజనముల దూరమునున్న చెన్నపురి యందు ముద్రితముగావింపబడుచు వచ్చుట చేతను యుక్త కాలమునం జందాదారుల కందకుండెను. అట్టి లోపమును నివారించుటకై మేము మా యావచ్ఛక్తిని పాటుపడి కడకు బహు ప్రయాసము మీఁద నీ పురంబున (రాజమహేంద్రవరం) నొక్క ముద్రణా యంత్రముం బ్రతిష్ఠాపింప గలిగితిమి. ఈ సారి నుండియు వివేకవర్ధని స్వీయ ముద్రాక్షరశాలయందే ముద్రింపబడి వెలువడుచుండుం గావున ఇకముందు చందాదారుల కందరకుందగిన కాలముననే మేము ప్రతినందింపఁ గలమని దృఢముగా నమ్ముచున్నాము. మరియుఁ బెక్కు నెలల పత్రికలు బాకీ పండియుంటంజేసి, వాటినన్నింటినీ ప్రత్యేముంగా నొక్కసారి ప్రకటించుట మాకు మిగల భారముగ నుండునని తలపోసి, మార్గశిర, పుష్య, మాఖ ఫాల్గుణ మాసములు నాలుగింటికి నీయొక్క సంచికనే ప్రకటించుటకు నిశ్చయించు కొన్నాము. ఈ లాగుననే చైత్ర, వైశాఖ, జ్యేష్ట మాసములు మూఁటికినింగూడ నొక పత్రికనే పదియేను దినములలోఁ బ్రకటింతుము. అప్పటినుండియు నెప్పటి పత్రికలప్పుడే తప్పక చందాదారులకుజేరుచుండును. ఈ ఏర్పాటు వలనం జందాదారులకెంత మాత్రమును నష్టం గలిగింపము. ఎట్లును వారు పండ్రెండు పత్రికలనే వడసెదరు. రేపటి యాషాఢ మాసము మొదలుకొని (ఇదివరకును మాసపత్రికగా వెల్వడుచున్న) వివేకవర్ధని పక్ష పత్రికగాఁ జేయ నిశ్చయించినాము. కాబట్టి ఆశ్వయుజ మాసాంత మునకుంబండ్రెంబు సంచికలు చందాదారులకెల్ల లభింపఁ గలవు. మఱియు నీ యాషాఢమాసము మొదలు హాస్య సంజీవనియను(తెనుగు) మాస పత్రిక యొకటియు, ఇంగ్లీషు పక్ష పత్రిక యొకటియు వివేకవర్ధని కనుబంధములుగా బయల్వెడలనున్నవి..."

వివేకవర్ధని తొలి సంవత్సరాలలో ఏ విషయాలకు ఎలా ప్రాధాన్యం ఇచ్చేవారో కూడా శివరావు రాశారు.

1874 అక్టోబరు -(ప్రథమ సంచిక) ఆస్తిక్యము; నవంబరు - సత్యము; డిసెంబరు - అహింస; 1875 జనవరి - చదువువేరు, సద్గుణము వేరు; ఫిబ్రవరి - స్త్రీవిద్య; మార్చి - దయ్యములు; మే, జూన్ నెలలు - వైద్యులు; జూలై - ఐకమత్యము; సెప్టెంబరు - దయ్యములు; అక్టోబరు - ప్రయాణ విచారము, యదార్థ జ్ఞానము, డిసెంబరు - ఆత్మ; 1876 మార్చి, ఏప్రిల్, మే - భగవద్గుణము; జూన్ - బ్రాహ్మణులు, వారి వృత్తులు; సెప్టెంబరు - దయ్యములు; డిసెంబరు - సుగుణ దుర్గుణములు.

వీరేశలింగం పంతులుకి కలిగిన ఆధునిక భావాలన్నింటికి కారణమని ముద్దు నరసింహం నాయుడు రచించిన వ్యాస సంపుటి హితసూచని కారణమని కూడా శివరావు నిశ్చితాభిప్రాయం. "వివేకవర్ధనిలో హితసూచనిలోని అనేక విషయముల ఉపయోగించినారు. పంతులుగారి రచనలలో కూడా అనేక విషయములను అందులో నుంచి గ్రహించి విపులీకరించినారు" అని శివరావు రాశారు.

వివేకవర్ధని మాస పత్రికగా ప్రారంభమై, పక్షపత్రికగా వృద్ధిచెంది, తరువాత వార పత్రికగా స్థిరపడింది. హాస్య సంజీవని అనుబంధ పత్రికగా మొదలై వివేకవర్ధనిలో విలీనమైంది. 1885-86 ప్రాంతంలో కేవలం స్త్రీలకు "ఉపయోగించు" మాస పత్రిక సతీహితబోధినిని తానే ఎడిటరుగా ప్రారంభించి మూడు సంవత్సరాల పాటు నడిపారు. గోదావరి విద్యా ప్రబోధిని, పురుషార్థ ప్రదాయిని, ఆంధ్రభాషా సంజీవని పత్రికలకు రాసినట్లే వివేకవర్ధని వచ్చిన తరువాత కూడా వీరేశలింగం మరి కొన్ని పత్రికలకు రాశారు. వాటి నిర్వహణలో పరోక్షంగానూ, ప్రత్యక్షంగానూ సాయంచేశారు.

వివేకవర్ధని పత్రిక కారణంగా వీరేశలింగం దౌర్జన్యాలను ఎదుర్కొనవలసి వచ్చింది. కోర్టు కేసులలో పోరాడవలసి వచ్చింది. వివిధవర్గాల ఆగ్రహావేశాలకు తాను గురి కావలసి వచ్చిందని వీరేశలింగం రాశారు:

"లంచములు తగవన్న రాజకీయాధికారులకుఁ గోపము; వేశ్యాంగనా సంగము నీతిగాదన్న శృంగార

నాయకులకుఁ గోపము; నీతిమాలిన బాహ్యవేషములు మతవిరుద్ధములన్న, ఆచార్య పురుషులకుఁ గోపము. మా పత్రికోద్దేశమును నిశ్శంకముగా నిర్వహింపవలసినచో నిన్నికోపములను సరకు చేయకుండవలెను."

వివేకవర్ధని పత్రికను నడపడంలో వీరేశలింగానికి రాజమహేంద్రవరం రాజకీయ శాస్త్రపాఠశాలలో ఆయనతోపాటు పనిచేసిన బసవరాజు గవర్రాజు, బుర్రా రాజలింగము శాస్త్రి, యేలూరి లక్ష్మీనరసింహము సలహా, సహాయ, సహకారాలను అందిస్తుండేవారు. వివేకవర్ధని పత్రికలో తాము రాసిన దాని వలన "మనసు నొచ్చిన వారందరు దుష్టచతుష్టయమని పిలుచుచూ వచ్చిరి" అని వీరేశలింగం స్వయంగా రాసుకొన్నారు.

వివేకవర్ధని పత్రిక ప్రారంభమైన కొత్తలలో న్యాయస్థానాలలో అవినీతిని బయటపెట్టడానికి వీరేశలింగం ప్రయత్నించడం ఆయనకు కోర్టు సమస్యలను తెచ్చిపెట్టింది. వాటిని ధైర్యసాహసాలతో ఎదుర్కొనడం ఆయన కీర్తిని ఇనుమడింప జేసింది. ఆ కాలంలో న్యాయవాద వృత్తి చేయడానికి మండల న్యాయాధికారి పట్టాలను ఇచ్చే పద్ధతి ఉండేది. న్యాయవాదులు యోగ్యతా పత్రాలను ఇస్తే వాటిని బట్టి న్యాయవాది పట్టాలను ఇచ్చే ఒక పద్ధతిని ప్రవేశపెట్టడం, అందులో కొందరు డబ్బు తీసుకొని యోగ్యతా పత్రాలను ఇవ్వడం, ముడుపులు ముట్టినతోడనే న్యాయవాది పట్టాలు ఇవ్వడం జరుగుతూ ఉంటే వివేకవర్ధని మొత్తం వ్యవహారాన్ని ప్రచురించింది. దానిపై మండల న్యాయాధికారి వీరేశలింగానికి కోర్టుకు రావలసిందిగా సమన్లు పంపారు. వీరేశలింగం కోర్టుకు వెళ్ళారు గాని న్యాయాధికారి అడిగిన ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పక చట్టం నిబంధనలను అడ్డం పెట్టుకున్నారు. చట్టం ప్రకారం "నేనుత్తరము చెప్పుటకు బద్ధుడను గాని పక్షమున బదులు చెప్పుటకు నాకిష్టము లేదు" అని చెప్పి న్యాయాధికారిని ఇరుకులో పెట్టారు. న్యాయాధికారి ఏమి చేయడానికీ పాలుపోక ఇంకా పైఅధికారులకు రాశారు. అప్పటికీ ప్రయోజనం కలగలేదు. మరేమీ చేసేది లేనందువల్ల ఎవరెవరికి కొత్తగా న్యాయవాది పట్టాలను ఇచ్చారో వాటన్నింటిని రద్దు చేశారు. న్యాయాధికారితో వివేకవర్ధని పేచీ పెట్టుకొన్న మరొక సందర్భం ఉంది.

1878లో స్థానిక న్యాయాధికారిగా వచ్చిన మరొకరు తాను రాయవలసిన తీర్పులు కొన్నింటిని అప్పట్లో గవర్నమెంట్ ప్లీడరుగా ఉన్న తన బంధువుచేత రాయించేవారు. ఎవరు ఎక్కువ డబ్బు ఇస్తే వారి తరఫున తీర్పు వస్తుందేదని ప్రతీతి. వీరేశలింగం ఈ తతంగాన్ని ప్రత్యక్షంగా చూసి, గ్రహించి వివేకవర్ధని పత్రికలో అచ్చువేశారు. అది పెద్ద సంచలనానికి కారణమైంది. వీరేశలింగం కొంత పరిశోధన చేసి సాక్ష్యాధారాలను సేకరించి న్యాయాధికారి మీద ఆరోపణను రుజువుచేశారు. పరువు పోవడం తట్టుకొనలేక న్యాయాధికారి ఆకస్మికంగా మరణించాడు. గవర్నమెంట్ ప్లీడరు కామరాజు విషంతాగి ఆత్మహత్య చేసుకొన్నాడు. సిరస్తదారుగా ఉండిన మరొకరు "అన్నవస్త్రములకు లేక బిడ్డలతో బాధపడుచు కడబట పిచ్చివాండ్ర వైద్యశాలలో దుర్మరణము నొందెను" అని వీరేశలింగం స్వీయ చరిత్రలో ఉంది.

తనకు రెండు విధాలుగా శత్రువులు ఏర్పడ్డారని వీరేశలింగం రాసుకొన్నారు. వితంతు వివాహాలు వ్యతిరేకించేవారు ఒక వర్గం. వివేకవర్ధనిలో "తమ కార్యములను బయలఁబెట్టుచు వచ్చుట చేత సంతప్తాపము నొంది వ్రేటుపడ్డ పాముల వలె పగతీర్చు కొనుటకు సమయము ప్రతీక్షించుచుండెడి" వారు రెండవ శత్రువర్గం. పత్రికా నిర్వహణం వీరేశలింగం జీవితాన్ని అలా ప్రభావితం చేసింది.

వీరేశలింగం ఆత్మకథలో కొన్ని అంశాలు వివాదాస్పదమై ఉండవచ్చు. అంత మాత్రాన సాహిత్య, సంఘసంస్కరణ రంగాలలోనూ, పత్రికా రంగంలోనూ ఆయన చేసిన కృషిని చులకన చేయవలసిన అవసరం లేదు. అది న్యాయం కాదు. పందొమ్మిదవ శతాబ్ది పత్రికా రచనలో, ప్రచురణలో, సమాజానికి పత్రిక సాధనంగా చేయడంలో వీరేశలింగం కృషి చరిత్రాత్మకమైనది.

వివేకవర్ధని పత్రిక స్థాపనకు అంతకు ముందు వెలువడిన పత్రికలు ప్రేరణ కలిగించి ఉండవచ్చు. కాని, సంస్కరణ శీలమైన రచనలు వివేకవర్ధనిలోనే మొదలైనాయి. అలా ఈ పత్రిక సమాజ సేవ చేసిందనడం నిర్వివాదాంశం. వీరేశలింగం రచనలు, వివేకవర్ధని తెలుగునాట సంస్కరణోద్యమాన్ని నిర్మించాయి. వివేకవర్ధని సంఘాన్ని ప్రభావితం చేసిన విధానం కారణంగా అది వెలువడిన 1874 సంవత్సరం తరువాత వచ్చి పత్రికలను వివేకవర్ధని తరం పత్రికలని వ్యవహరించడం సముచితం.

**(ఆంధ్రజాతి అక్షర సంపద తెలుగు పత్రికలు పుస్తకం నుండి. ప్రచురణ 2004, ఆంధ్రప్రదేశ్ ప్రెస్ అకాడమీ)** ◆



# కవుల చరిత్ర నన్నెంతో గుబగుబ లాడించేది

- శ్రీ పాద సుబ్రహ్మణ్య శాస్త్రి

వీరేశలింగంగారి కవుల చరిత్ర మాత్రం నిత్య నూతనంగానే కనపడుతుంది, నా కిప్పటికీ.

చాలాకాలం నే నా మూడోభాగంతోనే కాలక్షేపం చేసుకుంటూ వచ్చాను.

నే నెంతోకాలం యెదురుచూడగా యెదురు చూడగా, సంపూర్ణ గ్రంథం వొకనాడు హఠాత్తుగా నా చేతికి వచ్చింది.

తమ దగ్గిర రెండు ప్రతులుండడంవల్లా, కవుల చరిత్రలేని ప్రబుద్ధాంధ్ర లైబ్రరీ చూసి యెంతో యిదయీ, నా కది మిత్రులు శ్రీ ఆంధ్ర శేషగిరిరావు గారిచ్చారు.

నా దృష్టిలో సాహిత్య వ్యవసాయి కదొక పెన్నిధి.

అయితే, అది అసమగ్రమూ, ప్రమాద భూయిష్టమూ అని కొందరంటారు, నే నెరుగుదును.

కావచ్చు, వారితో నాకు పేచీ లేదు.

మరి, నిర్దుష్టమూ సమగ్రమూ అయినదేదీ?

నాకు తెనుగుకవుల చరిత్ర కావాలి.

అది రచించడానికి నాకు శక్తి లేదు, లేశమూ.

ఇందరు పండితులున్నారు, గ్రంథకర్తలున్నారు, పరిశోధకులూ ఉన్నారు, లోటు గుర్తించినవారు కూడా వున్నారు. మంచి చరిత్ర బయలుదేరతియ్యరేం, మరీ?

కాకపోయినా, వీరేశలింగం పంతులుగారి మధుర రచన విడిచిపెట్టడం మాత్రం యెలాగ?

రమారమి వొక్క సంవత్సరం పాటు, భారతం ఆదిపంచకమూ, కవుల చరిత్ర మూడో భాగమున్నూ మాత్రమే నాకు సర్వస్వమూను.

అయితే, మా పెద్దన్నగారు చెప్పిన గ్రంథాల జాబితా పూర్తి అయేదాకా "శారదరాత్రుల" పద్యం తరువాత భారతంలో వొక్క అక్షరమైనా చదవలేదు, నేను.

అప్పుడప్పుడు గురుముఖతః చదివిన సంస్కృత గ్రంథాలు తిరగవెయ్యడమున్నూ వుండేది; కాని తెనుగు గ్రంథాలు మాత్రం అవి రెండే ముట్టుకోడం.

వాటిలో కవుల చరిత్ర నన్నెంతో గుబగుబలాడించేది.

కానయితే, ముద్దుపళనీ, కంకంటి పాపన్నా, దిట్టకవి నారాయణకవీ, అయ్యలరాజు నారాయణకవీ మొదలయిన వా రేకొద్దిమందో తప్ప ఆ భాగంలో వున్న వారందరూ బహుసామాన్యులే.

సామాన్యులే అంటే అది యిప్పటి మాట.

అప్పట్లో మాత్రం, వారందరూ నాకు నన్నయలే, శ్రీనాథులే.

కాగా, అప్పట్లో, కవి కావడం మహర్షి అయి వుండడమే అనీ, రసికుడైన వాణ్ణి ప్రాపంచికమైన క్షుద్ర వాతావరణంలో నుంచి ఆనందోద్యానవీధులకు చేర్చగలిగేది కవిత్వమే అనీ, కవి అనుగ్రహానికి పాత్రం అయిన దేశమూ, కాలమూ, పాత్రా కూడా శాశ్వత బ్రహ్మకల్పాలయిపోతాయనీ, కవి అంతస్థు తరిచి తెలుసుకోవలసిన బ్రహ్మపదార్థం అనీ బోధించి మా కులవిద్యలమీద నాకు నిరాదరభావం పుట్టించేది, ఆ కవుల చరిత్ర.

"ఇంకా గ్రంథరచనకు పూనుకోవేం?" అంటూ తరిమి తరిమిన్నీ కొట్టేది నన్ను.

కొంతసేపటిదాకా నాకు బాహ్యజ్ఞానం కలిగేది కాదు.

**(శ్రీ పాద సుబ్రహ్మణ్య శాస్త్రి స్వీయ చరిత్ర 'అనుభవాలూ - జ్ఞాపకాలూను" పుస్తకం నుండి)** ❖

# విజ్ఞాపనము

- కందుకూరి వీరేశలింగం



అస్మద్దేశీయులైన ఆంధ్ర మహాజనులారా! రాజమహేంద్రపుర వాస్తవ్యులగు భ్రాతృవరులారా!

నా కడపటిదైన చిన్న విన్నపమును ఒక దానిని మీకు చేయుచున్నాను. ఆంధ్రదేశాభివృద్ధికై ఇప్పుడు పనిచేయుచున్న సమర్థతములలో పరిగణింపబడదగిన వాడను కాకపోయినను, పాటుబడ నారంభించిన వారిలో నేనొక్కడనని చెప్పుకొనుట, కేవల ప్రగల్భోక్తిగా ఎన్నబడదని తలచెదను. నేనెప్పుడును ధనవంతుడనుగాను: బలవంతుడనుగాను: అధికారవంతుడనుగాను: అధిక విద్యావంతుడనుగాను: మహా కార్య విజయ నిర్వహణములకు కావలసిన దానిలో దేనిని గలవాడను కాకపోయినను దేశాభిమానమొక్కటి మాత్రం కొంచెము కలవాడనగుటచేత, తత్ప్రేరణమున శక్యాశక్య విచారము చేయక, దేశ సంస్కరణోద్యమములో నడుగుపెట్ట సాహసించితిని. ఆ కార్యము నెంతవరకు నిర్వహింపగలిగితినో చెప్పలేను గాని, దాని నిమిత్తమయి నాకుండిన అల్ప ధనమును, యౌవనమును, బలమును, విద్యను, బుద్ధిని ధారపోసి, మీ ఆదరమునకు పాత్రుడను కాగలిగితినని మాత్రము చెప్పగలను. మన దేశస్థులితరులును నన్ను గొప్పచేయుచు వచ్చుటచే తెలుగు దేశములో రాజమహేంద్రవరము సంస్కారములకు జన్మభూమి యని పేరుపడినది. ఇంతవరకు ప్రాణముతో నిలువబెట్టిన యీ సంస్కార వల్లిమ తల్లిని కొనలు సాగించి సఫలము చేయవలసిన భారమిప్పుడు మీరు వహించవలసిన అవసరము తటస్థించినది. ఈ భారమును సంతోష పూర్వకముగా పైని వేసుకొని, రాజమహేంద్రవరమునకీ వరకు కలిగిన కీర్తికంటె ఎక్కువ కీర్తిని తెత్తురని మిమ్ము మీ వృద్ధ సోదరుడనైన నేను వినయపూర్వకముగా వేడుచున్నాను.

ఈ కీర్తి తెలుగు దేశమంతటిదిగాని రాజమహేంద్రవరము నొక్కదానిదే కాదు. నేనరవదేశమునందునను, కన్నడదేశమునందును సంచారము చేసినప్పుడక్కడివారు సంఘ సంస్కారాది విషయములలో తమ దేశముల కంటె తెలుగు దేశ మెక్కువ అభివృద్ధి పొందినదని చెప్పుకొనుచుండగా నేను పలుమారులు విని, ఆంధ్రదేశము యొక్క అభ్యున్నతికానందించి గర్వపడుచు వచ్చినాడను. ఓ ఆంధ్ర మహాజనులారా! అనంత సత్ఫలిత సంధాయకమైన సాంఘిక సంస్కార వల్లరీ పోషణ భారము వహించుడు. మీరా భారము పూర్ణముగా భరింపుడని ఆంధ్రమాత తన ప్రియ పుత్రులను వేవిధముల వేడుచున్నది....

దేశాభివృద్ధికి సంస్కారమన్ని విషయములలోను సమానముగా నుండవలయును గాని, ఒక్క విషయములో మాత్రమే నడుచుచుండుట చాలదు. ఏక విషయాభివృద్ధి ఎప్పుడును నిజమైన అభివృద్ధి కాజాలదు. శరీర మందలి సమస్తాంగములును పరస్పరాను కూలముగా నెదుగక, ఒక కడుపో, కాలో ఎక్కువగా నెదిగినప్పుడు దానిని రోగ చిహ్నముగా ఎట్లు భావింతుమో, అట్లే ధార్మిక సాంఘికాభివృద్ధి ప్రయత్నమునుపేక్షించి, రాజ్యాంగ స్వాతంత్ర్యాభి వృద్ధిని గూర్చియే ఉద్యమించుటయు సంపూర్ణ సుఖసాధకము కాజాలదని భావింపవలయును. రాజ్యాంగ స్వాతంత్ర్యములను సంపూర్ణముగా పొందగలవారమయిన కుటిల కులాచార భూతమునకు దాసులమయి, కడుపున పుట్టిన బిడ్డల స్వాతంత్ర్యములనైన ఇయ్య జాలక, ఆ అనాథ బాలలు వైధవ్య దుఃఖముల పాలయి బాధపడుచుండగా చూచుచు మనమేమి సుఖమనుభవింపగలుగుదుము? ఇంట సుఖదాయకములైన

సత్కులాచార స్వాతంత్ర్యములను సంపూర్ణముగా పొందగల వారమయినను, బయట ధనప్రాణములకు రక్షణము చేయని క్రూర నిరంకుశ ప్రభుత్వమునకు నిరందర దాస్యము చేయవలసిన యెడల ఏమి సుఖమనుభవింపగలుగుదుము? ఇంటను, బయటను గూడ హేయదాస్యము నుండి విముక్తులమయి, ఉభయ స్వాతంత్ర్యములను పొందగలిగినప్పుడు గదా మనము నిష్కళంక సౌఖ్యము నొందగలుగుదుము? కాబట్టి నిజమైన దేశ క్షేమమును ఉపేక్షించిన పక్షమున సమస్త స్వాతంత్ర్యముల నిమిత్తమును, సమస్త అభివృద్ధుల నిమిత్తమును సమానముగా కృషిచేయుడు.

ఇప్పుడు మన ఆంధ్రదేశము మేలుకొని, చురుకుదనమును బూని దేశాభివృద్ధికరములైన నానా క్షేత్రములయందు మహోత్సాహముతో కృషి చేయుచున్నందుకు నేనెంతయు సంతోషమొందుచున్నాను. ఇటువంటి స్థితి మన మాతృభూమికి కలుగవలెనని నేను 30, 40 సంవత్సరముల క్రిందట అభిలషించితిని. అప్పుడా కోరిక దివ్యస్వప్న సదృశ్యముగా కనబడినది. అప్పుడు రాజమహేంద్రవరము వంటి పట్టణములలో సహితము యువజనులు సభలు జేయుటయే సామాన్యజనుల దృష్టికి తప్పిదముగా నుండెను. ఇప్పుడు చిన్న పల్లెల యందు సహితము సభలు జరుగుచు, వివిధ విషయములు వితర్కింపబడి, జనసామాన్యముచే మెప్పొందుచున్నవి. అప్పుడు స్త్రీ విద్య బహుజనులచే దూషింపబడుచుండెను. ఇప్పుడెల్లయెడల బాలికా పాఠశాల లేర్పడి, స్త్రీ విద్య అభివృద్ధి నొంది, సభలు, ప్రసంగములు, పుస్తకములు చేయగల స్త్రీలచే నొప్పి భూషింపబడుచున్నది. అప్పుడు దేశ భాషలు పురుషులు చదువుటకు సహితము తగిన పుస్తకములు లేకుండినవి: ఇప్పుడు పురుషులకుపయుక్తములైనవి మాత్రమే కాక, స్త్రీలు చదువదగిన పుస్తకములు కూడ దినదినాభివృద్ధి నొందుచున్నవి. అప్పుడు విద్యాభిరుచిగల ధనవంతులకే పుస్తక సంపాదనము బహు వ్యయ ప్రయాస లభ్యమగుచుండెను. ఇప్పుదూరూర పఠన మందిరములు ప్రబలి, బీదలకును పుస్తక సంపాదనము అల్పవ్యయ సాధ్యమగుచున్నది. అప్పుడాంధ్ర వార్తాపత్రిక లంతగా లేకయు, ఉండిన ఒకటి రెండును చదువువారు లేకయు ఉండెను. ఇప్పుడు దేశభాషావృత్తాంత పత్రికల సంఖ్య అధికమయి, వేలకొలది చదువరులు గలవయి, కొన్ని పట్టపగటి సూర్యునివలె ప్రకాశించుచున్నవి. అప్పుడు ధూమనౌకమీద విద్యాగమము కొరకు చెన్నపురికి వెళ్లిన వారికే ప్రాయశ్చిత్తములు విధింపబడుచుండెను. ఇప్పుడు విద్యా, వాణిజ్య, శిల్ప శాస్త్రార్థము ఖండాంతరములకు పోయి వచ్చినవారికిని ప్రాయశ్చిత్తము లక్కరలేక పోవుచున్నవి. ఇటువంటివి అనేకములు చెప్పవచ్చును. అయినను సాంఘిక సంస్కారాదుల యందు మనవారికి మాటలలో గల శూరత్వము కార్యములలో నింకను నేనభిలషించినంతగా కనబడుచుండ లేదు. ఉద్యమములలో మాట లెక్కువగాను, కార్యములు తక్కువగాను కావలసినవి కొన్ని: మాటలు తక్కువగానూ, కార్యము లెక్కువగాను కావలసినవి కొన్ని. రాజ్యాంగ సంస్కార ప్రయత్నము మొదటి తరగతిలోనిది: సాంఘిక సంస్కార ప్రయత్నము రెండవ తరగతి లోనిది. ఈ రెంటిలో సంఘ సంస్కారము మన చేతిలో నున్నది. రాజ్యాంగ సంస్కారము దొరతనము వారి చేతిలో నున్నది. మన సంఘ స్థితి బాగుపడినగాని ప్రభుత్వము వారనుగ్రహించెడు రాజ్యాంగ స్వాతంత్ర్య ఫలములను మనము నిర్విచారముగా అనుభవింపజాలము. ఈ సత్యమును దృఢముగా మనస్సు నందుంచుకొని, సంఘ సంస్కారోద్యమమునందు కూడ సమాన శ్రద్ధ వహించి పనిచేయుడు. ఈ పనిలో ఎక్కువ కష్టములున్న వనుటకు సందేహము లేదు. ఉన్ననేమి? ఎక్కువ ఫలముల ననుభవింపగోరువారు ఎక్కువ కష్టములు పడవలెను.

ఒక రే విషయమున నైనను పనిచేసి పేరు పొందుచున్నప్పుడు ఈర్ష్యాళువులైన వారు కొందరు వారిపైని లేని దోషముల నారోపించుచు, వారి పేరుకు భంగము కలిగింప పాటుపడుదురు. మరి కొందరు వారి కీర్తికి మాలిన్యము కలిగించి, వారి నణగ ద్రొక్కుట చేతనే తాము పైకి రావలెనని ప్రయత్నము చేయుదురు. ఈ ఇరుతెగలవారి వలని ఉపద్రవము సంఘసంస్కార నాయకులకెట్లో అట్లే రాజకీయ నాయకులకును గలదు. ఈ దేశ సేవాపరులు దేశమునకు చేసిన ఉపకారమునకై దూరస్థలములయందు సహితము సభలు చేసి మహా జనులు అభినందన పత్రికలను చదువుచుండగా, అసూయాపరులు స్వస్థలములో యుక్తా యుక్త వివేక శూన్యులైన బుద్ధి హీనులని పత్రికలలో తెగడుచుందురు. ఈ దోషైక దృక్కులు జనులకు చేసెడిది ఉపకార లేశమైనను కానబడదు. లౌక్యాధికార ధూర్వహులనేకులు తమ కన్నుల యెదుట లంచములు పుచ్చుకొనుచుండ ఒక్క మాటయైనను పలుకుటకీ విలేఖకులకు నోరు రాదు. వ్రాయుటకు కలము సాగదు. రేయింబగళ్లు కష్టపడి న్యాయముగా పనిచేయు వారిని దూషించుటకే వీరికి పెద్ద నోరు వచ్చును. ఒక్క దురాచారమును

## వీరేశలింగం గారు : సంఘ సంస్కరణోద్యమము

- డా॥ సి. నారాయణ రెడ్డి

ఫ్రాన్సు దేశములో వాల్టేరువలె ఆంధ్రదేశమున సంఘసంస్కరణము కొరకు తన కలమును ఖడ్గసదృశముగా జళిపించిన మహాపురుషులు వీరేశలింగంపంతులుగారు. సాంఘిక దురాచార నిర్మూలనములోనేమి, బహుముఖ సాహితీప్రక్రియా సృష్టిలోనేమి, ఆంధ్రజాతీయతా ప్రచారములో నేమి, వీరేశలింగంగారే పితామహతుల్యులు. వారే రథులు, సారథులు. 1874లో వారు వివేకవర్ధనియను పత్రికను స్థాపించిరి. ఇది మాసపత్రిక. ఈ పత్రికా ప్రకటన ప్రయోజనములు రెండని పంతులుగారే తమ స్వీయచరిత్రలో వ్రాసికొనిరి. ఒకటి భాషాభివృద్ధి; రెండవది దేశాభివృద్ధి. తెలుగుభాషలో మృదువైన, సరళమైన శైలిలో సలక్షణ వచన రచన చేయుట భాషాభివృద్ధికి మార్గమని, దురాచారములను నిర్మూలించి, మతకులాచార విద్యానీతి విషయములందు నానాముఖముల కృషిచేయుట దేశాభివృద్ధి మార్గమని పంతులుగారు వివరించిరి. లంచగొండితనమును బట్టబయలు చేయుటయందు, స్త్రీ విద్యా విషయమునందు, వితంతు వివాహ విషయమునందు వీరేశలింగం గారి కృషి అనన్యమైనది. 1881లో రాజమహేంద్రవరమున ఒక నాటక సమాజమును స్థాపించి 'చమత్కార రత్నావళి'యను రెండు నాటకముల నాడించిరి. ఇవి ప్రహసన రూపములో నున్నవి. వీని ప్రదర్శనతో నగరమందు గొప్ప సంచలనము కలిగినది. 1881 డిసెంబరు 11వ తేదీని రాజమహేంద్రవరములో మొదటి వితంతు వివాహము జరిపించి పంతులుగారు సంఘ సంస్కరణోద్యమమునకు పతాకస్థాయి కల్పించిరి.

సంఘసంస్కరణోద్యమముతో పాటు సాహిత్య కేదారమున ఎన్నో క్రొత్త అంట్లను నాటిన భవిష్యద్ద్రష్ట వీరేశలింగంగారు. గద్యవాఙ్మయమును క్రొత్తదారులలో నడిపించుటయందు వారే ఆద్యులు. కావ్యనాటకములే కాక తెలుగులో ప్రకృతిశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము, శారీరశాస్త్రము, పదార్థ వివేచనాశాస్త్రము, భౌతిక భూగోళ శాస్త్రములకు సంబంధించిన గ్రంథములు, అలంకార సంగ్రహము, ఆంధ్రతర్క సంగ్రహము మున్నగు బహువిధ వాఙ్మయ సృష్టి చేసిన మనీషి ఆయన. ఆంధ్ర సాహిత్య చరిత్రమును క్రమబద్ధముగా ప్రమాణవంతముగా వ్రాసినదాతడే. వీరి ఆంధ్రకవుల చరిత్ర ప్రచురణముతో నన్నయ, రామకృష్ణకవి ప్రభృతులకు సంబంధించిన కట్టుకథలు మాయమైపోయినవి. ఒక్క కవితారంగము తప్ప సారస్వత క్షేత్రములోని అన్నిదారులలో సరిక్రొత్త ప్రయోగములు చేసిన మహారచయిత పంతులుగారు.

"తెనుగులో వచన ప్రబంధమును నేనే చేసితిని. మొదటి నాటకమును నేనే తెనిగించితిని. మొదటి ప్రకృతిశాస్త్రమును నేనే రచించితిని. మొదటి ప్రహసనమును నేనే వ్రాసితిని. మొదటి చరిత్రమును నేనే రచించితిని. స్త్రీలకై మొదటి వచన పుస్తకమును నేనే కావించితిని".

ఒక్కమాటలో చెప్పవలెనన్నచో ఆంధ్రదేశమునకు సాంఘికముగా వినూతన జాగృతిని కలిగించిన ప్రప్రథమ వైతాళికుడు వీరేశలింగంపంతులుగారు.

**(ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు: ప్రయోగములు పుస్తకం నుండి)**

◆

---

మాన్పుటకైనను వీరి కెప్పుడును బుద్ధి పుట్టదు: మాన్పుటకయి ప్రయత్నించెడి వారిని నిందించుటలో వీరి కెక్కడలేని బుద్ధులు నుదయించును.

మన దేశాభివృద్ధి కిప్పుడు పని కావలెను గాని, అది లేని పొడిమాటలు కావలసియుండలేదు. మన ఆంధ్ర దేశము నందు సాంఘిక, ధార్మిక విషయములలో పని చేయుటకయి ఏర్పడియున్న సమాజములలో హితకారిణీ సమాజము ముఖ్యమైనదని చెప్పవచ్చును. దాని భరణమున కయి నా కున్న అర్థము నిచ్చితిని గాని అది దాని వ్యయములలో అర్థమున కయిన చాలదు. ధనాభావము చేత హితకారిణీ సమాజము నూతనారంభమునకు పూనలేక పోవుటయే గాక, ఉన్న వితంతు శరణాలయాదులను నిర్వహించుటకు త్రొక్కట పడుచున్నది. మీ దేశ సేవయందు కాలము పుచ్చి దయనీయుడనయి యున్న నేను చేతులు జోడించి వినయ పూర్వకముగా మీకు నా కడపటి ప్రార్థనను చెల్లించి హితకారిణీ సమాజములో సామాజికులుగా చేరి దాని నుద్ధరించి నిరంతరాయముగా నెగడునట్లు చేయుడు. ఈశ్వరుడు మీకు నిరంతర శ్రేయస్సును కలిగించునుగాక! ఓ భక్త వరదా! ఓ దీన రక్షకా! దీనుడనైన నేను ఆంధ్ర దేశమును సంతతాభివృద్ధి నొందుచుండుదానినిగా చేయ ప్రార్థించుచున్నాను. నా ప్రార్థనను సఫలము చేయుదువు గాక!

**ఇట్లు విన్నవించు విధేయ సేవకుడు,**

**కందుకూరి వీరేశలింగము.**

# బాలాంత్రపు రజనీకాంతరావు కన్నుమూత



ప్రసిద్ధ సాహిత్య, సంగీత మూర్తి బాలాంత్రపు రజనీకాంతారావు ఏప్రిల్ 22న విజయవాడలో కన్నుమూశారు. తెలుగు కవిద్వయం వెంకట పార్వతీశ్వర కవుల్లో ఒకరైన బాలాంత్రపు వెంకటరావు కుమారుడు బాలంత్రపు రజనీకాంతరావు. 1920 జనవరి 29న పశ్చిమగోదావరి జిల్లా నిడదవోలులో జన్మించారు. అంధ్రా విశ్వవిద్యాలయంలో బి.ఎ. (హానర్స్) పూర్తి చేశారు. రచయితగా, సంగీత దర్శకుడుగా, వాగ్గేయకారుడుగా ఖ్యాతినార్జించారు. శతపత్ర సుందరి. ఆంధ్ర వాగ్గేయకారుల చరితము తదితర రచనలు చేశారు.

అకాశవాణి ఉద్యోగిగా రజనీకాంతారావు 1947 ఆగస్టు 15వ తేదీన దేశ తొలిప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ జాతినుద్దేశించి చేసిన ప్రసంగం అనంతరం ఆయా ప్రాంతీయ భాషల్లో దేశభక్తిగీతాన్ని ప్రసారం చేశారు. తెలుగు భాషలో రజనీకాంతరావు రాసి కంపోజ్ చేసిన 'మ్రోయింపు జయభేరి' అనే గీతాన్ని టంగుటూరి సూర్యకుమారి గానం చేశారు. అప్పుడు మనది ఉమ్మడి మద్రాసు రాష్ట్రంగా ఉండేది. 1948 ఆగస్టు 15న తొలి స్వాతంత్ర్య వార్షికోత్సవం సందర్భంగా 'మాదీ.. స్వాతంత్ర్య దేశం' అనే గీతాన్ని రచించి, సంగీతం సమకూర్చారు. దాన్ని కూడా టంగుటూరి సూర్యకుమారి గానం చేశారు. తర్వాత ఆయన ఆకాశవాణి డైరెక్టర్ అయ్యారు. స్వర్గసీమ, గృహప్రవేశం, రాజ మకుటం తదితర తెలుగు సినిమాలకు సంగీతం అందించారు. కూచిపూడి నృత్య రూపకాలు, యక్షగానం, మేనక విశ్వామిత్ర, విప్ర నారాయణ వంటి నృత్యాంశాలకు సంగీతం సమకూర్చారు. 'జేజి మామయ్య పాటలు' అనే చిన్న పిల్లల కార్యక్రమాన్ని ఆకాశవాణిలో ప్రసారం చేశారు. ఆకాశవాణి విజయవాడ డైరెక్టర్‌గా పని చేస్తున్న సమయంలో ప్రముఖ నవలా రచయిత గుడిపాటి వెంకట చలంను ఇంటర్వ్యూ చేశారు. వెంపటి చినసత్యం, శోభా నాయుడు వంటి నృత్యా కళాకారులకు సంగీత బాణీలు అందించారు. విజయవాడ ఆకాశవాణి కేంద్ర సంచాలకుడిగా 1978లో పదవీ విరమణ చేశారు. సంగీత ప్రియులంతా 'రజనీ'గా పిలుచుకునే రజనీకాంతరావు అనితరసాధ్యమైన ప్రతిభతో కర్ణాటక సంగీతంలో తనకంటూ ప్రత్యేకమైన బాణీని సృష్టించుకున్నారు. విజయవాడ కేంద్రం నుంచి భక్తిరంజని, సంస్కృత పాఠాలు, ఉషశ్రీ ధర్మసందేహాలు, ఈ మాసపుపాట, పిల్లల కార్యక్రమాలు వంటివి ఎన్నో ఆయన ప్రారంభించారు. ఇవన్నీ జాతీయ స్థాయిలో ప్రసిద్ధి పొందాయి. వేటూరి సుందరరామ్మూర్తి ప్రసిద్ధ రచన 'సిరికాకొలను చిన్నది' రూపకాన్ని విజయవాడ కేంద్రం ద్వారా ప్రసారం చేశారు. స్వర్గసీమ (1945), గృహప్రవేశం (1946), పేరంటాలు (1951), రత్నమాల (1947), ద్రోహి (1948), బంగారుపాప (1954) తదితర చిత్రాలకు సంగీతాన్ని అందించారు. చిన్న వయసులోనే కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారాన్ని ఆనాటి రాష్ట్రపతి సర్వేపల్లి రాధక ృష్ణన్ నుంచి అందుకున్నారు. 1981 ఆంధ్రా యూనివర్శిటీ కళా ప్రపూర్ణ అవార్డు అందించింది. 2007లో ఉమ్మడి ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలో రాష్ట్ర ప్రభుత్వం 'కళారత్న' పురస్కారంతో సత్కరించింది. నవ్యాంధ్రలో 'తెలుగు వెలుగు' పేరుతో తొలి ఉగాది పురస్కారాన్ని 2015లో ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు నుంచి అందుకున్నారు.

సాహితీ రచనలో ఆయన కలం పేరు రజని. ఆయనకు ముగ్గురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు ఉన్నారు. 'ఆకలి మంటల మలమలలాడే అనాథలందరు లేవండోయ్' అనే అంతర్జాతీయ కార్మిక గీతాన్ని తెనిగించిన నళినీ కాంతారావు ఈయన సోదరుడే. రజనీకాంతారావు సంగీత, సాహిత్య రంగాల్లో విశిష్ట సేవలందించారు. ❖

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

# వీరేశలింగకవి



- గుర్రం జాషువా

వీరేశాఖ్యుడు లింగధారి కవితావేశుండు సత్కావ్యముల్
నూరుల్‌గూరిచి జాతిదేవతకు కన్నుందోయి నర్పించుచున్
క్రూరాచార మహాపిశాచి కెదురై కొంగ్రొత్త ఖడ్గాలతో
కోరల్ దీసిన యోద్ధకాంధ్ర సుకళాక్షోణుల్ ఋణగ్రస్తముల్

తెలుగు శారదకు నత్తులు ముంగరలు దీసి
    కొంగ్రొత్త తొడవులు గుస్తరించి
పరిహాసమన్న కోపముచేయు గడ్డలో
    నవనీతహాస్య వాఙ్మయము నాటి
పసివితంతువుల దుర్భర దీనతకు గుంది
    కూలిపోయిన కాపురాలు నిలపి
గడనచేసిన చిల్లిగవ్వతో సర్వంబు
    శరణాలయములపై జల్లివైచి

మరణమునకు దక్క మరి తీరుబడిలేక
కలము దించనట్టి కవివరుండు
కందుకూరి కులుడు కాలుమెట్టినచోట
కాలు మెట్టలేదు కలుషలవము

నన్నయ మున్నుగాగల సనాతన సత్కవిజీవితంబులన్
గన్నులగాంచిన ట్లమృతఘంటమునన్ వెలయించి భాషకున్
జిన్నెలువన్నెల న్నిలిపి నేడు మహాకవులైన వారి కిం
తన్నము బెట్టిపోయిన మహాత్ముని దేశము విస్మరించునే?

ఒకవంకన్ బదివేల కంఠములతో హుంకారముల్ సల్పి సాం
ఘిక శార్దూలము చప్పరించుటకు లంఘింపన్ రవంతేని జం
కక దీక్షారథమున్ మరల్పక కళాక్షాత్రంబు జూపించు ధా
ర్మిక వేదండుని యుక్కుగుండెలు మహాంధ్రీ నీకు నాదర్శముల్



వీరేశలింగ కవి బం
గారు కృతులు పాఠ్యపుస్తకంబులగుచు మా
కారోజుల నాంధ్రోక్తుల
సారము రుచిజూపి వలపుచార ఘటించెన్

SHAITYA PRASTHANAM RNI N0.APTEL/2004/18396 Postal Regd. No.VJ/187/2017-19
Date of Posting : 1st &2nd of Every Month ▪ Date of Publication: 27.04.2018

PRSVI4OZA192



**If Un delivered please return to: Prasthanam, C/o M.B. Vignana kendram, 27-30-4, 3rd Floor Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002. Ph: 0866-2577248, Cell: 9490099059**

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A 1912 |
| పుస్తకం పేరు | ప్రేమ 140 |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |